# వసుంధర



శేషాద్రిరమణకవులు.

# వసుంధర

ఆంధ్రదేశచరిత్రసంబంధమగు నవల.

గ్రంథకర్తలు:

శేషాద్రిరమణకవులు,

శతావధానులు.

బెజవాడ ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. కోదండరామయ్యగారిచే ముద్రితము.

.1934

 [వెల రు. 1-

# పీఠిక.

సహృదయులారా!

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికయందు బరిశోధనము గావించుచున్న సుప్రసిద్ధ చరిత్రస్థలములగు ఓరుగల్లు, వర్ధమానపురము, కందూరు, పొలవాస లోనగు నగరముల దర్శించి యటఁగల శాసనములఁ దిలకించునపుడు స్ఫురించిన కథా కల్పనము నాధారము చేసికొని యీనవలను రచించితిమి. కథకు వలయు చరి త్రాంశములు హనుమకొండ శాసనమునుండియు మామిళ్లపల్లి ఏలేశ్వర శాస నములనుండియు గ్రహించితిమి. ఇందలి కథాంశము చాలవరకుఁ జరిత్రాను సారమె. కథాపాత్రములును చరిత్రమునకు సంబంధించినవె.

గ్రంథరచనము ఇప్పటికి 15 సంవత్సరములక్రిందట జరిగెను. మామి త్రులగు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యపంతులుగారు పాంగముగ గ్రంథము ఆంధ్రపరిషత్పత్రికయందు బ్రథమముద్రణము గావించి స్వల్పప్రతిఫలమునకుఁ బ్రతు లన్నియు మాకు నొసంగిరి. విద్యాశాఖవారీపాత్రము పెద్ద నభిమాన ముంచి గ్రంథాలయములలో నుంపఁదగినదిగ నిర్ణయించిరి. స్థానికసంస్థలు పాఠశాలలలో నుంచుటకుఁ బ్రతులఁగొనియు నున్నతపాఠశాలోపాధ్యాయులు ఉపవాచకముగ నున్నతతరగతులకుఁ బఠనీయముగ నుంచియు సమ్మాద రించిరి. కాకతీయగ్రంథమాలలో రెండవకుసుమముగ నుంపఁబడి ప్రజాదర ణమునకీనవల పాత్రమయ్యెను. ఇపుడీనవల, చరిత్రపరిశోధనమున నేము గడించిన నూతనాధారముల సాయమున స్వల్పములగు మార్పులతో ద్వితీయ ముద్రణము గావించి ప్రకటింపఁ గలిగితిమి. ఆంధ్రవాఙ్మయప్రియులగు రసికులీరెండవముద్రణమునందు సైతము పూర్వాభిమాన ముంపఁ బ్రార్థితులు.

ఆంధ్రదేశచరిత్రాత్మకములగు నవలసంఖ్య ప్రోత్సాహమయి లెక్కించుటకు నెడిగ నున్నది. ఆంధ్రదేశమునకు భాషకుఁ జిరకాలము సేవగావించి కీర్తి చిహ్నములతో దిఙ్ముఖముల నలంకరించిన కాకతీయరాజుల చరిత్ర [illegible] శాఖ్యాయికారోగ్యములగు పుట్టము లెన్నియో నికలవు. పాఠకుల [illegible]

ఉజ్జ్వలపు ప్రకృతిసౌందర్య భాసురములగు కథాస్థలములు పెక్కులు కలవు. కాలగర్భమున విక్రమజీవితములు మరుగుపడినను జరిత్రప్రపంచమునఁ బ్రచండజ్యోతితో వెలుఁగు సమకాలికమహాపురుషుల దివ్యనామములు కథాకల్పనమునకుఁ జాలినన్ని యున్నవి. ఇన్నిటిని సమన్వయించి యీ నవలను రచింపఁగలిగితిమి.

పండ్రెండవశతాబ్దమున నాంధ్రదేశమునఁగల జైనశైవమతముల పరస్పరసంఘట్టనము అహింసాజీవనులగు జైనులు దేశమునకు సంఘమునకుఁ గావించినసేవ మతములు రాజానుగ్రహపాత్రములై దేశకల్యాణమునకుఁ దోడ్పడినవిధము ఈ నవలయందుఁ గొంతవరకుఁ జిత్రింపఁబడినది. ప్రకృత కథాంశము కాకతీయసామ్రాజ్యము హనుమకొండనుండి ఓరుగంటికి మార్పఁబడకముందు జరిగినది.* కేవలపాఠకులకంటెఁ బదిరెండవ శతాబ్దమునందలి చారిత్రాంశములు, ఆకాలప్రదేశసౌభాగ్యము నెఱింగిన సోదరుల కీనవల యుత్సాహకరము గానోపు నని మావిశ్వాసము.

ఇట్లు భాషాసేవకులు,

హనుమకొండ, 1—6—1934.

శేషాద్రిరమణకవులు,

శతావధానులు.

# FOREWORD.

The novel which has enjoyed and justified the confidence of the West as a form of literary expression not inferior to the others in evoking interest in the great panorama of human passion and action is, by curious irony, a recent enterprise in Telugu Literature. And regrettably enough, either because the Telugu novelists have not grasped the fundamental elements that go to make up a novel, or because they are in a hurry to run to the press, a good Novel in Telugu is a rarity. Except in isolated instances, few novels are governed by the laws of their being, and can stand even gentle criticism. It is habitual with our novelists to conform to no standard or principle and to go on at break-neck speed setting at naught "reason and rhyme," and writing what pleases them most or what comes uppermost to their minds. The abundant output of the so-called novel is a testimony to the fore-going remarks.

Our novel, in more than one way, conforms to the conventional model, and is yet a departure from it—a happy and welcome one—in its treatment. It must be admitted that the story is meagre. The chief incidents centre round the kingdoms of Vardhamanapuram and Hanumakonda with the kingdom of Kanduru for the main-spring of action. The evolution of the plot, though steady and regular, is not without a gap, as the author was bound down by the subsequent developments known to have taken place in history. For instance, immediately after the imprisonment of Mahadevaraya and the voluntary expatriation of Gokarna from his brother's kingdom, there is a big gap of several years to

allow for the baby Vasundhara to grow into the full-blown maiden. An attempt, however, to bridge over the gap has been made in the institution of a search after Gokarna. Again the explanatory note of the author,—which by-the-bye, will advantageously be read before the novel—tells us that Rudradeva knew of Gokarna; but in the body of the novel, we find him debating who Gokarna was. Except for these, the story is happily told; and the situations, though few, are skilfully handled. There is no over-elaboration of detail; but on the other hand, terseness and brevity are employed almost to a fault. One would like to hear more of Somanatha and Manjari, who appear to be the only two individualized characters in a crowd of conventional ones; and one is almost tempted to protest against the summary termination of their careers.

Of the other characters much need not be said; they are either embodiments of virtue or monsters of inequity; and but for the historical evidence, there are not any other indications to show why Bhimaraju is, or chooses to be, a veritable Satan on earth. Briefly said, as in many other Telugu novels, there is not much of motivation; but, this must, in all fairness, be admitted that our author has tried to give life to and to clothe in flesh and blood, the dry bones of historical material. And, despite the many other things that might be said, the characters live to us, if not as perfectly humanized ones, at least as historical personages with plenty of human interest. The creation of Keerthivarma is to serve as a foil to the rest, and the end that he meets with appears to be undeserved. With these remarks we can pass on without any special mention of the female characters; but one thing at least deserves notice; and that is the conventional way of falling in love at first sight. A touch of some uncomfortable

feeling comes over us when we read of Vasundhara as openly writing to the emperor for help and proposing their own marriage In this, our author is, which certain reservations for the better, one of a host of conventional writers. He has not, however, worked out any anxious tense and exciting love-scenes; and has judiciously eschewed sentimentalism of all kinds.

There are not many sub-plots in the story; the interweaving is organic; and diggressive elements are rare. The story moves on naturally enough till the conclusion. The career of Bhimaraju in cruelty, wickedness and sin, is interesting in its own way and deserves the treatment it has obtained.

Nothing in the novel can be happier than the excellent way in which it opens; and the author's skilful management of the scene, which could have been made positively agonising, is a testimony to his artistic powers and taste. Another instance of this to choose one among others, is the judicious disclosure at the end of the incestuous relationship between Bhimaraju and Soudamini. Earlier revelation of this abominable bestiality would have rendered our enjoyment of the novel forced and reluctant. (It is for this, perhaps, that the writer has put his Explanatory Note at the end). Another choice way in which the author has heightened our interest in the novel lies in the employment of lyrics. They have their own sweetness and import; and they are necessary for the movement of the action. Only a slight use is made of the emotional element in so far as it is employed. The *Denovement* is in part historical, and the rest may be said to have been carefully managed.

Much praise is due to the style of the book. The author it master of a flowing, lucid style which is fresh and delightful. It is neither bookish nor colloquial, but commands conversational ease and naturalness. The figures are never out of place and are happily and judiciously employed. Descriptions of scenes are not elaborate and over-wrought, but are highly suggestive. The languege is racy when occasion demands it. The author has avoided the antiquated and out-of-the-way diction and is a master of telling words and choice expressions. In short, the novel is written in chaste beautiful Telugu which commands ease and freshness, clarity and vigour.

Within the brief compass of a foreword, it is not possible to note all one has to say about the novel and before it is concluded, it must be said that we rise from a reading of the novel with a pleasant smack of something gained; and our mind lingers over the chief incidents of the story and over intense and illuminating scenes and passages. This is a handy-book—one of the best of its kind—which deserves to be placed within the easy reach of the School-going world.

NANDIGAMA,<br>9—1—1922.

S. LAKSHMI NARASAYYA,<br>B A., (Hons).



శ్రీ

# వసుంధర.

(ప్రథమ భాగము.)

## మొదటి ప్రకరణము.

శారదరాత్రులలో విహార మానందజనకము. పిండియారఁ బోసినటు లున్న యాపండువెన్నెలలో నొక యంటుమావిగున్న క్రీనీడ నొకయువకుఁ డాసీనుఁడై యుండెను. చెంత నొక యువతి యేదియో రాగ మాలాపించుచుండెను. పరివారమంతయు విడుదులలో నియోజితకార్యములయం దప్రమత్తతో మెలంగుచుండెను. యువకుఁ డా సతీగానముననో రుచిరశరచ్చంద్రికావిభవముననో హృదయము లీన మొనరించి యంటుమామిడిపై దృష్టి ప్రసరించెను.

సమీపమునుండి “ నాధర్మమును నేను నెరవేర్చికొనుచున్నదానను. కర్మసాక్షీ! నీవే సాక్షి యను నొక యవ్యక్త స్వరము బయలువెడలెను. ఆ స్వరమున శోకము, శాంతము, కరుణము నిబిడీకృతమైయుండెను. యువకుఁ డా శబ్ద

మును విని విభ్రాంతుఁ డయ్యెను. కర్తవ్యము తోఁచినది కాదు. అది మంత్రకూటప్రాంత నిబిడారణ్యము. ధ్వనినిబట్టి వెడలుదుమా? మార్గము దుర్గమము. దట్టముగఁ బెనవేసి కొనియున్న యడవిచెట్టులనుండి పగలె నడచుట కష్టము. యువకుఁ డది యొకయార్తనాద మని గ్రహించెను. హృద యము మాత్ర మాధ్వనిగల చోటు చేరెను. కాని శూన్య హృదయ మేమి చేయఁగలదు? ఇంతలో నార్తరావము బయలువెడలినచోటునుండి వెలుఁగు గానరాఁ దొడంగెను. క్రమముగ ధూమము, జ్వాలలు మింటికిఁ బ్రాకెను. జ్వాలా సందర్శనమున యువకునకు గమ్యస్థానమునకుఁ జేరఁగల నను ధైర్యము జనించెను. యువకుఁడు కరవాలము ధరించి యాజ్వాల కభిముఖముగఁ బోవఁదొడఁగెను. కడకు గమ్యస్థానమునకుఁ జేరఁగలిగెను. అట నేమికలదు? అంతయు భయంకరప్రదర్శ నమె. అడవికట్టియ లన్నియు నొకచో రాశిగఁ బేర్పఁబడి నటులుండెను. జ్వాల యన్నివైపులనుండి బయలువెడలుచుం డెను. చెంత నొకశిలపై నొకసాధ్వి నిలిచియుండెను. ఆయమ దివ్యసుందరమూర్తి యాజ్వాలాముఖమున కృతాంజలిగ నిలువఁబడి యుండెను. ధ్యానము పూర్తియయ్యెను. అంజలి లోని ప్రసవము లగ్నిముఖమున నర్పించెను. వాలుగన్నులఁ దెఱచి ముందునకుఁ జూచి, 'తనయా! నిన్ని ప్రపంచమున కొసం గుచున్నాను.' అని సాధ్వి యాయగ్నిలో, యువకుఁ డేదియో వాకొనఁబోవుచుండ, దుమికెను. జ్వాలామాలిక లాయువతిని కౌఁగిలించుకొనెను. కొంతసేపటి కాయువతిపవిత్రదేహము

వీతిహోత్రునియందు లీనమయ్యెను. ఎవ రా యువతి? ఏమి యీభయంకరచర్య? యను ప్రశ్న యువకుని హృదయము నత్యూంత లూగించెను. యువకుఁడు పవిత్రుఁడగు నగ్నిహో త్రునకుఁ బ్రదక్షిణనమస్కారము లాచరించి 'సోదరీ! నీ వొక భారతమాతృ తేజోనిధానమవుగాని యలంతినెలంతవు గావు. నీపవిత్రజీవితము దుర్భేదముగ నున్నది. నీ పవిత్రమూర్తిని సందర్శింపఁజాలితినిగాని యాకస్మికవిపత్తును వారింపజాలనైతి' నని యువకుఁడు కంటఁ దడిపెట్టెను. సమీపముననుండి యొక శిశు వేడ్చుచున్నటుల వినవచ్చెను. యువకుని హృదయ మున నావేశ మతిశయించెను. ఇంక నెట్టి బీభత్సరసము ప్రద ర్శింపఁబడుచున్నదోయని ముందున కేగెను. ఒకచోఁ గొన్ని వస్త్రములు, కవచము, ఆయుధములు, భూషణములు రాశిగఁ జేర్పఁబడియుండెను. అట నాలుగైదు సంవత్సరములు నిండని యొకపసికూన కూర్చుండి యాటలాడుకొనుచుండెను. ఆశిశువు చేయు నవ్యక్తగానము, ఆక్రందనము, క్రీడనము గాంచి యా ప్రేతాలయమున నానందించువా రెవరు? చెంతనున్న యొక నిలువుటంగీని జూచి నాన్న నాన్నయని పిలిచెను. ప్రత్యు త్తరము రాలేదు. మఱల నటులె పలుమారు పిలిచెను. ప్రత్యుత్తరము రామిచే వేసారి యంగీపై మొగముంచి చేతు లతో నిటునటు కదల్చుచు నేడువసాగెను. ఇంతలో జ్వాలలు నలుదిక్కుల విజృంభించెను. ఒకయగ్నికణ మాశిశువుధరించిన వలువపైఁ బడెను. ఆవేడికి శిశువు తాళలేక 'అమ్మా చూడవే' యని యాక్రందన మొనరించెను. యువకుఁడు సమీపించు

వఱకు శిశువు భయవశమున గడగడ వడఁకుచు నేడ్చుచుండెను. యువకుని జూడఁగనే శిశువు చేతులనెత్తి 'నాన్నా' 'నాన్నా'యని దైన్యముగ ముక్తకంఠమున విలపించెను. యువకుని హృదయము నీరయ్యెను. విశాలమగు నాతని హృదయమున ధైర్యమను రేణువు నిలుచుటకుఁ దావులేదయ్యెను. అత్రముతో నాశిశువును గౌగిలించుకొని వలువనంటుకొని విజృంభించు మంట నెటులోఁ జేతులతో నులిమి, 'తల్లీ! సోదరీ! యీకనులు దెఱువని పసికూనగతి యేమనియనుకొనక సహగమనవ్రతము నెఱవేర్చితివా? నీహృదయము పవిత్రమైనది; నీ ప్రేమము నిష్కళంకమైనది; నీజన్మము పావనమైనది. స్త్రీలోకమునకు మార్గదర్శకముగ నీకూన నొసంగియుందువని యువకుడా చితిని బరికించెను. జ్వాలాగర్భమునుండి దగ్ధమగుచున్న స్త్రీస్వరూపమును, పురుషస్వరూపమును గ్రిమ్మరి దర్శించి విధి యనుల్లంఘ్యమని చకితుఁడై నిలువఁబడెను. శిశువు చితివెలుఁగునఁ దన్నెత్తికొనిన యువకుని మొగముఁ దేఱిచూచి నాన్న నాన్న యని యస్ఫుటముగా వాకొనుచుఁ గొనవ్రేలితోఁ జితిని జూపించెను. అమ్మా! అమ్మా! యని యరణ్యమువైపు చిటికెనవ్రేలితోఁ జూపెను. తాను కనులారఁజూచిన భయంకరప్రదర్శనము, శిశు వొనరించు శైశవచేష్టలు యువకునిఁ దన్మయునిఁ గావించెను. శిశువు మాటిమాటి కాయువకుని మొగముఁజూచి చెక్కిలి నివురుచు నాసికపై వ్రేళ్లుంచుచుఁ గంఠము కౌగిలించుచు జ్వాలామాలికా శోభితుఁడగు పితిపాకుని వైపు. అదిగో నాన్న నాన్న.

ఇదిగో అమ్మ అమ్మ యని చూపుచుండెను. యువకుఁడా శిశువు దుఃస్థితికి, దుర్దశకుఁ బరితపించి తనకుటుంబినిచే నీపసికూనను సాకించుటయే కర్తవ్యమని వెనుకమరలి చూచెను. శిశువు వ్రేలు ముడచి అమ్మా అమ్మాయని చేతులఁ జాచి ముందునకు దుముకఁబోవ నెదుటనున్న యొక స్త్రీవ్యక్తి యా శిశువునందుకొని, 'ప్రాణనాయకా! ఏమి ఈ విపరీతపరిణామము? ఈ శిశు వెవరు? మీర లింత పరితాపతప్తు లగుట కేమి హేతు'వని శాంతముగ సుప్రసన్నముగఁ బ్రశ్నించెను. యువకునిహృదయ మింక స్థిరపడలేదు. అతనిహృదయదృష్టి కా సహగమన మొనరించిన సాధ్వీపవిత్రమూర్తి కానవచ్చుచుండెను. చితివైపు దృష్టి ప్రసరించి, 'సోదరీ! నీవెవ్వతెవు? నీచరిత్రమెద్ది? ఈవిపత్తునకు మూలమెద్ది?' యని యువకుఁడు యువతినిఁ జూడకయె పల్కుచుండెను.

యువతి తొట్రుపాటుతో యువకుని కడ్డమువచ్చి 'ప్రాణనాయకా! ఏమి యిటుల తొట్రుపడుచున్నారు? ఎవరిని సోదరి యనిపిలుచుచున్నారు? నే నెవతెనని విన్నవింపవలయును? మీ యర్ధాంగిని, సహధర్మచారిణిని. ఏమిసెలవు?' అని యువకుని భుజముపైఁ జేయివేసెను. శిశువు యువతిచేతులనుండి జాఱి నాన్న నాన్నయని యువకునిపైకిఁ బ్రాకసాగెను. యువకుఁడా శిశువునుదీసి యెత్తుకొని 'సతీ! నీవా? నాహృదయము స్వస్థముగ లేదు. నేను గాంచిన బీభత్సప్రదర్శనము మనస్సునఁ బ్రతిబింబించుచున్నది. చేతులమీఁదుగ నొక యువతీశిరోమణిని పవిత్రుఁడగు వహ్నిపాలుచేసిన దీ పాపాత్ముఁడే. సతీ! ఈ

పాపపునోట నేమని యీపవిత్రకథాంశము నివేదింపఁగలను? విచారవశమున నసందర్భముగ బయలువెడలు నా నుడువుల నుండి భావమమాత్రము గ్రహింపుము. ఆర్తనాదము విని నిన్ను విడచి యిఁటకుఁ జేరితిని. ఒక పవిత్రకాంత యీచితి ముందుఁ బ్రణయమంత్రములఁ జపించెను. నేను కనులు విచ్చునంతలోఁ గర్తవ్యము నిర్ణయించుకొనునంతలో నీయగ్నికుండమున కాహుతియయ్యెను. దిక్కుమాలిన యీపసికాయ చితిచెంతఁబడి జననీజనకుల దుస్తులతోఁ గ్రీడించుచు, నేడ్చుచు నుండెను. యువతీ సహగమనసందర్శనమున శిశుదురవస్థా ప్రదర్శనమున నాహృదయము నీ రయ్యెను. నీ వర్ధాంగివి. నాహృదయావేగము సగము నీ వనుభవించుము. శిశుపోషణ భారమంతయు నీయదియె.' అని యువకుఁడు నిశ్చేష్టుఁడై నిలువఁబడెను. యువతియు శిశువు నక్కున నుంచుకొని చితిని దిలకింపఁదొడంగెను.

ఇంతలోఁ బ్రాగ్దిశనుండి 'గోకర్ణా? ఏమి తిలకించుచుంటివి' వనుపలుకులు వినవచ్చెను. గోకర్ణుఁ డులికిపడి ముందునకుఁ దిలకించి, 'ఓహో! అన్నయ్యగారు వచ్చుచున్నారు. అన్నయ్యా! చూచున దేమియు లేదు. భరతఖండ దుర్దశ, ఆంధ్రదేశ దురవస్థ' యని గోకర్ణుఁడు సదైన్యముగ వాకొనెను.

'ఏమి? భీమరాజు కంఠగతప్రాణుఁడై యుండఁగనె సోదరుడు ఆంధ్రదేశ దుర్దశకై పలవింపవలసి వచ్చెఁగా?'

'అన్నయ్యా! కాలమున కేమహాశక్తియు నడ్డుపడఁ జాలదు. ఇఁకమనబోంట్లెంతలో నెంతవారు. ఇటనొకభయానక ప్రదర్శనము దిలకించి నాసహధర్మచారిణితో సమానదుఃఖ మనుభవించుచు మాతృదేశ దురవస్థను స్మరించితిని.'

'తమ్ముఁడా! ఇది దుర్దశకాదు. మాతృదేశమున కిది లోపముకాదు. కథాంశము విందువేని పరితపింపవలసినయగత్య ముండదు. కాకతీయచక్రవర్తికిని గందూరు దేశాధీశ్వరుఁడగు తైలపదేవునకును జాలకాలమునుండి సంగ్రామము జరుగుచుం డెను. తైలపదేవుఁడు కాకతీయచక్రవర్తికి వెఱచి నన్ను శరణు గోరెను. పూర్వవైరముఁ బురస్కరించికొని తైలపదేవుని నేనె వంచనోపాయంబున వధించితిని. మాణిక్యదేవి భర్తతో సహగమన మాచరించెను. ఇందుఁ బరితాపావశ్యకత యేము న్నది? ప్రతిపక్షుల వినాశమున కానందింపుము.'

'అన్నయ్యా! మీరు నిశ్చయముగ ధర్మవిచ్యుతులయ్యుఁ బరితాప మందకున్నారు. ధర్మదూరుల రాజ్యలక్ష్మి చాలకాల మాశ్రయింపనోపదు. తైలపదేవుని వధించి మీ రిహపరము లకు దూరులైతిరి. కాకతీయచక్రవర్తి యీయక్రమవధకు మిమ్ముసహింపఁడు. శరణుగోరినవానివధించుట యిహపరములకు దూర మగుటకే; తగుదునని మీ రిఁక తలయెత్తఁగలరా?'

ఛీ! నీవు పిఱికిపందవు. ధర్మశాస్త్రము వల్లెవేయుదువుగాని క్షత్రియరహస్యానుగుణముగ భాషింపనేరవు. కాకతీయ చక్రవర్తి తలగిల్లి మొలవేయుననియా నీ వెఱవు? చోడవం

శము నీవంటి యప్రశస్తునిఁ గనుట యెట్టిదుస్స్థితి నందుటకో తోఁచకున్నది. నీవు విరోధిపక్షపాతివి.'

గోకర్ణుని హృదయము భీమరాజుమాటలతోఁ జలించెను: అగ్రజాతునితో నెదుర్కొనుట కాతనిమన స్సంగీకరింపకపోయెను. ధర్మదేవత యాతని కావేశముఁ గల్గింప నిట్లు పలికెను. 'భీమరాజా! యీ యక్రమచర్యమాత్రము నేను బహిరంగము సేయక మానను. ప్రజాముఖమునుండి యీ వార్త కాకతీయచక్రవర్తిచెవికి సోఁకించు భారము నాది. నావిరోధిని జంపితివని యాతఁడు నీకు గండపెండెరములిచ్చునో, అక్రమహత్యకే ప్రతిఫల మొసంగునో తిలకింతుఁగాక! నేఁ డనుభవించు నానందము నాఁటికేమగునో చూచుకొమ్ము.'

భీమరాజు కోపము మేరమీఱెను. 'తా నొనరించిన కార్య మక్రమమగుఁగాక, సక్రమమగుగాక, వ్యతిరేకించుటకు గోకర్ణుఁ డెవఁడు. సంస్థానము నాది. పరిపాలనవిధానము నాహస్తగతము. గోకర్ణుని సమయానుసారముగ మట్టుపెట్టకున్న నే నధోగతిపాలగుటయె సత్య'మని భీమరాజు సంకల్పించుకొనెను.

గోకర్ణునిసతి మలయవతి. ఆయమ భీమరాజును జూచి 'యీ శిశువుమాత్రము మిగిల్చి కందూరుమండలేశ్వరుఁడు, రాజ్ఞి స్వర్గరాజ్యమును జూఱగొనిరి. రాజ్యవ్యవస్థలెటులున్నను ఈ శిశుసంరక్షణము మీకును విధి' యని మలయవతి యా శిశువును భీమరాజు పాదములపైఁ బడవేసెను. భీమరాజా శిశువును గాలితోఁ దన్ని, 'ఇంక నీ దౌర్భాగ్యదేవత మిగుల్పఁ బడినదా! దీనిగతి ముందు విచారించెద' నని వెడలిపోయెను.

గోకర్ణుఁడు మిగుల దయార్ద్రహృదయుఁడు. ఇప్పటికితని కీ వహాగమనకథాంశ మంతయు స్పష్టపడెను. "తైలప దేవుఁడు కాకతీయ చక్రవర్తిఘాటికి వెడలి పత్నితో శిశువుతో నటవిఁ జేరి ధర్మస్వరూపుఁడను భ్రమతో మాయన్న గారిని శరణువేఁడి పొందిన ప్రతిఫలమిది. కందూరుమండలేశ్వరులకు, వర్ధమాన పురాధీశ్వరులకు వంశపరంపరాగతమగు వైర మున్న నందుఁ గాక. సాధించు మార్గ మిదియా? రాజకయుదురంతములలో మాయన్న గారిని వ్యతిరేకించి ధర్మము స్థాపించుటయే నావిధి యని గోకర్ణుడు నిశ్చయించి కర్తవ్యమును యోజింపసాఁగెను.

భీమరాజుపాదహతిచే శిశువు మిగుల దూరమునఁ బడెను. ఒడలంతయు గీసుకొని పోయెను. శిశువు భయ ముతో వెక్కి వెక్కి యేడ్చుచుండెను. మలయవతి యా శిశు వును బుజ్జగించుచు 'ప్రాణనాయకా! మనమిఁక వర్ధమానపురము నకుఁబోవలదు. మాయన్న వలన నీకును శిశువునకును నింతయున రానివిపత్తు సంభవించును. నావిన్నపము నాలింపుఁ'డనిబతిమా లెను. గోకర్ణుఁడు నవ్వి, 'సతీ! భయమునొందకుము. అధర్మ మును ధర్మముచేతనే జయింపవలయును. వర్ధమానపురమున గల పౌరులలో ధర్మపక్షపాతులు పెక్కండ్రు కలరు. ఇంతకుఁ గాఁగల దేమియు లేదు. సతీ! హృదయమును గుదురుపఱచు కొనుము. నీ ప్రేమతరంగమువలె హృదయము నుత్తుంగములాడు చుండె'నని గోకర్ణుఁడు సతితో శిశువుతో వర్ధమానపురికిఁ బోవ సంకల్పించి విడిదికిఁ జేరనేఁగెను. ప్రత్యర్థిని సాధింపఁ గల్గితి నను సంతోషముతోఁ దీర్ఘయాత్రల ముగించి భీమరాజు రాజ్యాభిముఖుఁడయ్యెను.

# రెండవ ప్రకరణము.

మన చరిత్రకాలమున నాంధ్రదేశమునఁ గాకతీయ సామ్రాజ్యము మిక్కిలి వైభవోపేతముగ నుండెను. ఈసామ్రాజ్యచ్ఛత్రముక్రింద స్వదేశప్రభువులు కొన్ని స్వల్పసంస్థానములను బాలించి సార్వభౌమునకు సుంకమునొసఁగుచు వినయవిధేయతలతోఁ గాలముఁ గడుపుచుండిరి. ఆకాలపు స్వదేశసంస్థానములలో వర్ధమానపు సంస్థానము విభవమునను సైనికబలమునను పేరుకెక్కియుండెను. ప్రకృత మీసంస్థానమును గరికాలచోడుని వంశీయుఁడును గాశ్యపగోత్రుఁడును బరాక్రమశాలియు నగు భీమరాజు పరిపాలించుచుండెను. భీమరాజు మిక్కిలి తెలివితేటలుకలవాఁడు; చండశాసనుఁడు. ప్రజలాతని భయంకరస్వరూపమును గలలో సైతము దర్శించి భయభ్రాంతులగుచుండిరి. తలంచినపట్టు నెఱవేరుటయే యతనికిఁ గావలసినది. ఎంతధనవ్యయమైనను, ఎంత ప్రజావ్యయమైనను నతఁడు లక్ష్యపెట్టక తన పట్టుదల నెఱవేర జీవితావధి యెదిరి బలాబలముల యోజింపక పోరాడుటయే యతని స్వభావము. సమకాలికుల కితనియం దవిశ్వాసము, అసూయ జనించుటకిదియె కారణము. భీమరాజురాజ్యతృష్ణ నిరుపమానమైది. రక్తపాతము, సంగ్రామము, జైత్రయాత్ర యతని కత్యుత్సాహజనకములు. నేఁడు భీమరాజు సందిగ్ధస్థితిలో నుండెను. తైలపదేవుని వధించినటులఁ దన రాజ్యమునఁ బ్రకటించుట యాతని సంకల్పముకాదు. కృత్రిమోపాయముతో నొనర్చిన యానీచ

కృత్యమపకీర్తికరమనియు, నపాయకరమనియు నతఁడెఱుంగని వాఁడుకాఁడు. ప్రకటింప మానుకొనుటయు సమంజసముగఁ దోఁచుటలేదు. గోకర్ణుఁడు భీమరాజున కంకుశమువంటివాఁడు. ధర్మదేవత భీమరాజును సన్మార్గమున నడపుటకై యావచ్ఛక్తి వినియోగించి గోకర్ణుని సృజించె నని ప్రజల విశ్వాసము. గోకర్ణుఁడు సోదరుఁడగుఁగాక, భీమరాజునకు హృదయశల్యమె. భీమరాజుతో గోకర్ణుఁ డనేకపర్యాయములు ధర్మసంస్థాపనార్థమై పోరాడి కృతార్థుఁడు కాకపోయెను. కాని గోకర్ణుఁడు తన ధర్మమునుమాత్రము వదలి యన్నచేయు దుష్కృత్యముల నంగీకరించువాఁడు కాఁడు. భీమరాజు తైలపదేవుని తానె వధించినటుల రాజ్యమునం దంతట ప్రచురించి విజయోత్సవములు చేయించి సైన్యముతోఁ గందూరున కేగి యట గోకర్ణున కాయాధిపత్యమొసంగిన నీరహస్యము గుప్తముగనుండు నని యూహించెను. గోకర్ణుం డంగీకరింపకపోయిన మిగుల నపకీర్తి గడింపవలసివచ్చునే యని భీమరాజు సంశయించెను. కాని యాసంశయ మంతగా బాధింపలేదు. కందూరుసామ్రాజ్యము చూచినంతనే గోకర్ణుఁడు పరవశుఁడై తా నాడించునటు లాడఁడా? యని భీమరాజు నమ్మకము.

గోకర్ణుఁ డెచట నున్నాఁడు? మంత్రికూటప్రాంతనిబిడారణ్యమునుండి భ్రాతృదురంతముల స్మరించుచుఁ బత్నితో, శిశువుతో వర్ధమానపురాభిముఖుఁడై వచ్చుచుండెను. సోదరుని రాక విని భీమరాజు మంత్రిని, పౌరులను బిల్పించి గోకర్ణ

మహారాజుగారి నెదుర్కొని తీసికొనిరండని పంపి, రాజ్యమున విజయోత్సవములు చేయవలయుననియుఁ దైలపదేవుని భీమరాజు వధించెఁగాన కందూరు రాజ్యమునకు గోకర్ణుని బట్టాభిషిక్తుని గావింతు మనియుఁ జాటఁబంచెను. వర్ధమానపుర మంతయు నలంకరింపఁబడెను. వినోదమునకు సైనికులు, శతఘ్నులు కాల్పదొడంగిరి. రాజకీయోద్యోగు లేనుఁగుల నలంకరించి యంబారిపై భీమరాజు ప్రతిచ్ఛందమునుంచి వీధుల నూరేగింపఁదొడంగిరి. బురుజులపై సైనికులెక్కి జయభేరుల మ్రోగించుచుండిరి. గోకర్ణుఁ డీయుపాయముతో వశముకాకపోఁడనియు సమయముకనిపెట్టి యాతనియొద్దనుండి కందూరు రాజ్యమును హరించి వర్ధమానపుర రాజ్యముతోఁ గలుపుట యొక శ్రమకాదనియు భీమరాజు సంకల్పించి సోదరుని రాకకుఁ బ్రతీక్షించుచుండెను.

గోకర్ణుఁడు జైనమతాభిమాని. "అహింసా పరమో ధర్మః" యను జైనధర్మసూత్రము గోకర్ణుఁ డహోరాత్రములయందు జపించుటయందే కాక యనుష్ఠించుటయందు సైతమాతఁ డే జైనాచార్యునకేనిఁ దీసిపోఁడు. వాగీంద్రచూడామణి యను జైనాచార్యుఁడు గోకర్ణున కభిమానదేశికుఁడు. శిశుసంరక్షణమున గోకర్ణునిహృదయము శాంతినొందెను. మలయవతి సహజసుకుమార, అసూర్యంపశ్య. ఆయమ తన మృదులబాహుమధ్యమునఁ గిశోరము నుంచికొని చెట్లనీడను గోకర్ణునితో నడువఁదొడంగెను. గమనాయాసముచే నాయమ యడుగులు తడఁబడెను. శిశువు జాఱిపోవునేమో యని

దృష్టినంతయు బిడ్డపై నుంచి రేయింబవళ్లు నడచుటచేఁ గాళ్లు వచ్చిపుండ్లయ్యెను. గోకర్ణుఁడు మిక్కిలి డస్సిపోయెను. భీమరాజు శిశువుపైఁ జూపిన కటికచేఁతమాత్ర యీదంపతుల హృదయము నల్లకల్లోలము గావించుచుండెను. మలయవతి మాత్ర మప్పుడప్పుడు, 'ప్రాణనాయకా! బావగారివలన బిడ్డ కేమియుపాయము రాదుగద?' యని సదైన్యముగఁ బ్రశ్నించుచుండెను. సహజగంభీరమగు గోకర్ణుని యంతరంగమున కా వాక్యమశనిఘాతమువలె నుండునుగాని ప్రత్యుత్తరము మాత్ర మొసంగక మెల్లఁగ నడచుచుండెను. పాపము, మలయవతి కాలి కొక యెదురుదాయి కొట్టుకొనెను. వ్రేలు పగిలి బొట బొట రక్తము కాఱుటచే నాబాధకుఁ బరవశ యయ్యెను. బాహుబంధమునుండి శిశువు జాఱి కావు కావుమని యేడ్చుచు అమ్మా! అమ్మా! ఆఁకలి ఆఁకలి యని మలయవతి పైఁట చెఱఁగుఁబట్టి లాగుచుండెను. గోకర్ణునిహృదయ మా యవస్థాప్రదర్శనముచేఁ గరఁగి నీరయ్యెను. కనుల నశ్రువులు క్రమ్మెను. ప్రశాంతముగనున్న యాతని హృదయమునకు భీమరాజు చేయు దుండగము లన్నియు నొక్కమాఱు స్ఫురించెను. పుణ్యక్షేత్రసందర్శనమున కని వెంటగొనివచ్చి సహగమనశ్మశానవాటికలోఁ దనను, మలయవతిని విడచి నిర్దయుఁడై పరివారముతో వర్ధమానపుర మలంకరించిన యగ్రజునిపై రోషము, అసూయ, కోపము గోకర్ణునిహృదయమున జనించి తీవ్రమగు నగ్నిహోత్రమువలె నాతని యవయవముల దహింపఁజేయుచుండెను. ఆతనిహృదయదృష్టికి మాణిక్యదేవి

సహాగమనము, భీమరాజుపరుషసంభాషణము, మలయవతి సంప్రార్థనము తూటిమాటికి వ్యక్తమగుచుండెను. శిశువు కావుకావుమని యేడ్చునపుడెల్ల భీమరా జొనరించిన పాదతాడనము, కిశోర మొనరించిన యాక్రందనము స్ఫురణకు వచ్చుచుండెను. మిట్టమధ్యాహ్నమయ్యెను. ఇంక వర్ధమానపురముఁ జేరుట కొకదినము ప్రయాణము చేయవలయును. క్షుత్పిపాస లధికమగుటచే మలయవతియు గోకర్ణుఁడు నటనే విశ్రమించిరి. వాడినపల్లవములతో నొకసెజ్జనొనరించి యందు శిశువునుంచిరి. శిశువున కస్ఫుటముగ మాటలుమాత్రము వచ్చును. పాలుగారుచున్న చెక్కిళులు, మధురములైన పలుకులు, ఆనందకరములైన క్రీడలు గల యాశిశువుమనోహరమూర్తి యాదంపతులశ్రమ నపనయించెను. ఇంతలోఁ జిఱుగాలి వీచెను. అలసి సొలసియున్న యా దంపతులు సొమ్మసిల్లి నిదురబోయిరి. శిశు వాయిరువురిపైఁ జివురుటాకులు విసరివేయుచు, నవయవములు కదలించుచుఁ, బైనిపడిపొరలుచుఁ గ్రీడావిలాసములతో గాలము గడుపుకొనుచుండెను. గోకర్ణుఁడుమాత్రము మెలకువతో శిశువును, సతిని మధ్యమధ్య చూచుచుండెను.

ఇంతలోఁ దూర్పుదిక్కునుండి సందడి వినవచ్చెను. గోకర్ణుఁ డులికిపడిలేచి కూర్చుండెను. కొందఱాశ్వికులు సైన్యముతో నాయుధములతోఁ దమవైపునకె వచ్చుచున్నటులాతఁడు గమనించెను. ఇంకఁగొంచెమునే పటులె తిలకించెను. మహామంత్రి సైనికులతో వచ్చుచున్నటులఁ దెలిసికొనెను. గోకర్ణుఁడు మలయవతిని లేపి, 'సతీ! లెమ్ము! లెమ్ము! మా

యన్నగారు మనల బంధించుటకుఁ గానోపు సైన్యమును మన కభిముఖముగఁ బంపుచున్నారు. మహామంత్రి యాసైన్యము నడిపించుచున్నాఁడు. ప్రత్యేకించి మనమే ధ్యైన నంతగా భయపడఁ బనిలేదుగాని శిశురక్షణమున మనము జాగరూకులమై యుంటిమిగాన మార్గాంతరముఁ జూచికొనుట యావశ్యకము. మనల నిరువుర బంధించుటయు శిశువును ఖండించుటయు నన్నగారి సంకల్పమైయుండును. నిర్బంధావాసమునకు వెఱచికాదు. శిశువును రక్షింప నశక్తులమై దొంగతోవలఁ దీయవలయును. ఆ కానవచ్చుచున్న గుట్టచెంత నొక జైనాశ్రమము కలదు. గుహలలో మతబోధకు లుందురు. మనము కొంతకాల మాశైలమున వసించి కాలపరిస్థితులు పరికించుచు నుందము. సాధ్యమైన నీశిశువునకుఁ గందూరురాజ్యము నొసంగి కాకతీయచక్రవర్తిపాదములచెంతఁ బడవేయుదము. మనకు ఖడ్గధారణముతోఁ, హేతువాదముతోఁ బనిలేదు. అధర్మమును ధర్మమే జయించు' నని గోకర్ణుఁడు శిశువుతో సతితో నటవీగర్భమునుండి గుట్టయొద్దకుఁబోవు కాలిత్రోవ ననుసరించి మెల్లఁగా నీశాన్యదిక్కునకు సాగిపోయిరి.

భీమరాజుసైనికు లివ్వటికిఁ బదియాఱు కోసులదూరము పయనమొనరించిరి. ఎందుఁజూచినను గోకర్ణుఁడుఁ దత్సతియుఁ గనరారైరి. పలువురను బ్రశ్నించిరి. నదుత్తరము రాదయ్యెను. మంత్రికిఁ గర్తవ్యము తోఁచదయ్యెను. గోకర్ణుని జాడ తెలిసికొనకుండ వచ్చినందులకు భీమరాజు తనకును, సైనికులకును నెట్టి కఠినశిక్ష విధించునో యని పారసాగెకు

భయాతురుఁడై యోజింపఁ దొడంగెను. మంత్రివర్యున కేమియుఁ దోఁచదాయెను. నిర్జనమగు నాయరణ్యమున గోకర్ణునిజాడఁ దెలుపువా రేరి? సమీపమున జైననిలయము లున్నవిషయముమాత్ర మాతఁడెఱుంగును. ఏనిలయమునం దేని యర్చకులున్న వారినివిచారింతుఁగాక. జైనమతాభిమానియగు గోకర్ణుఁడు నిలయములందున్న ప్రతిజైనునకుఁ బరిచితుఁడె. ఈయుపాయాంతరముతో గోకర్ణుని యునికిఁ దెలిసికొనవచ్చునని మంత్రినిశ్చయించిసైనికులనందఱ నొకచో నుంచి తా నొకఁడు జైనధర్మానుసారముగ శిరోవేష్టనము, ఆయుధము, పాదరక్షలు విసర్జించి పాదచారియై బయలు వెడలి, నడచి నడచి, కడకొక విహారమును దర్శించెను. విహారముచెంత కేఁగఁగనే కలకలము వినవచ్చెను. గోకర్ణుని విషయమావిహారమునఁ దెలియవచ్చునని మంత్రి ద్వారమును సమీపించెను. ద్వారపాలకు లగు జైనభిక్షుకు లామంత్రిని నిరోధించి నిలయమునకు మతాంతరు లేగరాదనియు జైనాచార్యులు జినవర్ధంతి జరుపుచుండిరిగాన లోనికేగ నవకాశ మొసంగఁబడదనియుఁ గఠినముగ మందలించిరి. మంత్రి శ్రమ విఫలమయ్యెనని తలంచియుఁ బ్రయత్నముతో సాధ్యముకానిదేదియు నుండరాదని యొక జైనభిక్షుకునిఁ జూచి 'స్వామీ! నేఁటివర్ధంతికి వర్ధమానపురాధీశ్వరుని సోదరుఁడగు గోకర్ణమహారాజుగారు విజయముచేసిరా? యని ప్రశ్నించెను. జైనభిక్షుకుఁ డించుక యోజించి, 'ఆర్యా! మీకు సదుత్తరమీయఁ జాలను. జైనమతము స్వీకరించిన యెన్నృపాలుఁడేని విహారము

నకు రాఁదలంచినముం డా శాంతిసరోవరమున స్నాన మొనరించి భిక్షుకవేషముతో నిలయము చేరవలయును. అందుచే సార్వభౌమునకు సంన్యాసికి జైనాశ్రమమున భేదముండదు. గోకర్ణుఁడు జైనమతాభిమాని యని నే నెఱుంగుదును గాని నేఁటి సమావేశమునకు వచ్చెనో లేదో చెప్పఁజాలను. నేఁడు నిలయమున విద్వత్పరీక్షయు తేపు భిక్షుకపరీక్షయు జరుగును. తేపు భిక్షుకులు స్థానాధిపతులకు జైనదేవుని సమక్షమునఁ దమపేరు, తా మొనరించిన జైనమతవ్యాప్తి, ముందొనరింపనున్న మతసేవ నివేదించెదరు. మీకావశ్యకమగు విషయ మున్న నొకపత్రికపై వ్రాసియుండు. గోకర్ణ మహారాజువారు వచ్చియున్న సమయానుసారముగ మీలేఖ నప్పగించెదను, అని భిక్షుకుఁడు వాకొనెను. మంత్రి తత్క్షణమె తాళీదళముపై గంటముతో నొక లేఖ వ్రాసి యాభిక్షుకున కొసంగి ప్రణామ మొనరించి తనసేనతోఁ గలిసికొని వర్ధమాన పురికిఁ జేరనిశ్చయించెను. భీమరాజుతో గోకర్ణుఁడు జైనాశ్రమమున నుండెననియు వర్ధంతియైనపిమ్మటఁ గందూరునకు సతీసమేతుఁడనై తప్పక వచ్చెదనని చెప్పెననియు దెలుప నిశ్చయించి నాఁటి యాందోళనమునకు శాంతిచెప్పి సేనతోఁ బురాభిముఖుఁ డయ్యెను.



# మూఁడవ ప్రకరణము.



పదునొకండవ శతాబ్దమున ఆంధ్రదేశమున మతకలహములు పెచ్చరిల్లెను. శైవవైష్ణవమతములు రాజావలంబనముచే నభివృద్ధికి వచ్చుచుండెను. రాజనిర్బంధమువలననేమి మతాచార్యుల బోధనమహత్త్వమువలననేమి జైనులు మతాంతరులగుచుండిరి. వీరావేశపరవశులై కొందఱు తీవ్రవాదులు జైనాలయముల రూపుమాపుచు అహింసాజీవులగు జైనుల సంహరించియుఁ బిశాచధర్మ మనుసరించి మతప్రచారము గావించుచుండిరి. ఈ సంక్షోభసమయమున జైనమతవృక్షము సుస్థిరమగు దోహదము నొసంగిన యాంధ్రులచేఁ గూఁకటి వేళ్ళతోఁ బెఱికివేయఁబడ నుండెను.

అసహాయులగు జైనులు చేయునదిలేక అమూల్యములగు తమ విగ్రహసముదాయములతో నపూర్వమగు వాఙ్మయముతో సురక్షితస్థానములకు వలసఁబోయిరి. అట్లేగినవారిలో అపరజినావతార మనఁబడు వాగీంద్రచూడామణి ప్రథమగణ్యుఁడు. వాగీంద్రుఁడు కాకతీయులనాఁడు తలసూపుచున్న వీరశైవమత విజృంభణమునకు వెఱచి నన్నూరు జైనాలయములలోని విగ్రహములు గ్రంథరాజములు గైకొని పదివేలమంది జైనులతో నూర్గురు ఆచార్యులతోఁ బ్రకృతిమనోజ్ఞమగు నొక విశాలస్థలమునందు నూతనముగ నాశ్రమములు నిర్మించెను.

వాగీంద్రుఁడు మధ్యందినకృత్యములు ముగించుకొని శిష్యులకుఁ దీర్థప్రసాదముల నొసంగుతరుణమున నొక భిక్షుఁ డొక లేఖ తెచ్చియిచ్చెను. వాగీంద్రుఁ డా లేఖను జదువుకొని మందహాసముఖారవిందుఁడై శిష్యలోకమున కిట్లాజ్ఞ యిచ్చెను. 'మిత్రులారా! గోకర్ణుఁ డిటకు వచ్చియుండ నోపు నని భీమరాజుమహామంత్రి కొనిపోవచ్చి యాతని కొసంగుటకై యీ జాబు పంపినాఁడు జరుగఁబోవు జినవర్ధంతికి ఋషిస్వరూపుఁడగు గోకర్ణుఁడు రానున్నాఁడని యీ జాబు చెప్పక చెప్పుచున్నది. విద్యార్థులారా! మీలోఁ గొంద ఱెదురేగి సకుటుంబముగ రానున్న గోకర్ణున కెదురేగి యిటకు సగౌరవముగఁ గొనిరండు. భిక్షుకులారా! శాంతిసరోవర తీరమున నున్న శ్వేతాంబరనిలయమున గోకర్ణునకు విడిది యేర్పఱుపుఁడు. ఆశ్రమమున గోకర్ణుఁ డడుగుఁ బెట్టఁగనె నాకుఁ దెలుపుఁడు. ఆతని సన్మానింప నేను వచ్చెదను.'

ఇంతలో నిరాడంబరుఁడును శుద్ధసత్త్వస్వరూపుఁడు నగు గోకర్ణుఁడు మలయవతితో దీనురాలగు బాలికతో నాశ్రమముఁ జేరి వాగీంద్రునిపాదములపైఁ బడి నమస్కరించెను. శిశువుగూడఁ దనమృదుహస్తములు వాగీంద్రునిపాదములపైఁ జేర్చి శిరసంట మ్రొక్కెను. మలయవతి దూరమున నుండి ప్రణమిల్లి ప్రక్క కొదిగి నిలువఁబడెను. వాగీంద్రుఁడు గోకర్ణుని బిగియారఁ గౌఁగిలించుకొని 'మిత్రమా! తీర్థయాత్రలు ముగిసినవా? మీయన్నగారు భీమరాజు నవరివారముగ మన యాశ్రమము కటాక్షింపనున్నాఁడా?' యనెను.

'స్వామీ! పరిస్థితులు విషమించినవి. యాత్రిలు ముగించి అన్నగారు రాజధాని కేగిరి. పరమాత్ముఁడు నాకీ శిశువుతో బంధము కలిగించినాఁడు.'

'అన్నట్లు అడుగమఱచితిని. ఈబిడ్డ యెవతె?'

'ఈమె విషాదజీవితము వాకొన నాలుక తడబడుచున్నది. శరణార్థియగు తైలపదేవునకు మాయన్నగారు మరణము ప్రసాదించిరి. అతనిపత్ని సహగమన మొనర్చుటచే దిక్కులేని యీ శిశువు నాపాలఁబడినది.'

వాగీంద్రుని కనులనిండ నీరుగ్రమ్మెను. గంభీరహృదయుఁడగు నతఁడు లోలోన నె మ్రింగి శిశువు నెత్తుకొని చెక్కులు నిమిరి 'అమ్మాయీ! నీవు గోకర్ణునిపాలఁబడుట నీసుకృతము. ఉసురోడ్డియేని నీకు మేలు సంధింపఁగలఁడు. ఈ దేహము నందలి సగమురక్తము తైలపదేవుఁ డొసంగిన యుష్ణక్షీర ధారలచే నుత్పన్నమైనదె. నీ భవిష్యజ్జీవిత పథమును గంటక రహితము కావింపలేకపోతిమేని మాజీవితములు కాల్పనా?' అని పల్కుచు ఆదీనబాలికను విశాలవక్షమున నుంచుకొనెను.

వంచినతలతోఁ జెంతనిల్చియున్న మలయవతి 'స్వామీ! మీయమోఘాశీర్వాదము బడసిన యీ శిశువు ధన్యురాలు. మీ యాశీర్వాదబలముకంటె భీమరాజుదుస్సంకల్పబలము బలీయమైన దని నేను భయపడుచున్నాను' అనిపల్కెను.

వాగీంద్రుఁడు యోచించునటులఁ గొంచెము సేపు ధ్యానదృష్టితో నుండి యిట్లు పలికెను "గోకర్ణా! నా యాజ్ఞ నీవు

వినితీరెదవను విశ్వాసముతో జెప్పుచుంటిని. నీ విటనే సతీసుతా సహితముగ నాలుగైదేడు లుండకతప్పదు. ఈలోపుగ ఆశ్రమవిద్యాధికారి యీ బాలికకు యోగ్యములగు విద్యారహస్యములు దెలుపఁగలఁడు. నీవును నీనాలుగైదు సంవత్సరములు మిగిలిన జైనసాంప్రదాయగ్రంథముల నధ్యయనము జేసి యాశ్రమమునకువలయుకట్టుదిట్టముల గావింపుము. మలయవతి భిక్షుకురాండ్రకు ధర్మోపదేశములు గావింపఁగలదు. పిదపఁ గందూరు రాజ్యమున కీబాలికను బట్టాభిషిక్తురాలిగ నొనర్చి యోగ్యుండగు వరునిఁ గూర్చితిమా మనజీవితములు ధన్యములు.

గోకర్ణుఁడు వాగీంద్రుని యాజ్ఞ తలదాల్చి యంగీకృతి సూచించెను. రాజనీతివిదుఁడును అనుభవశాలియు నగు వాగీంద్రుఁడు గురుప్రసాదమగు క్షీరము గోకర్ణునితోఁ గలిసి త్రావి యాశ్రమము సందర్శింపనేగెను. ఆంధ్రదేశమునఁ గల దర్శనీయక్షేత్రములలో నీ జైనవిహార మొకటి. రాజనీతివిదుఁడు, వాగీంద్రుఁ డీ విహారమునకుఁ దన జీవితసర్వస్వము ధారవోసి యైహికాముష్మికజీవితముల కీ యాశ్రమధర్మములతోఁ బొత్తు గుదిరించెను.

ప్రధానాలయశిఖరము స్వర్ణవిగ్రహములు జినాచార్యుల పాదపద్మములు చలువఱాతి మెట్లు గల శాంతిసరోవరము, చెంగటఁ బారు జీవనది యగు మీనాంబరము తిలకించి ప్రకృతిమనోహరమగు నీ యాశ్రమమున గురుకులవాసము సేయగల మహాభాగ్యము లభించినందులకు గోకర్ణుఁ డానం

దించెను. ఆశ్రమవాసు లందఱును గోకర్ణునిసాహచర్యము
లభించినందులకు సంతసించిరి.

విశాలహృదయుఁడును మహాత్ముఁడునునగు వాగీంద్రుఁడు తన యాశ్రమమునందు వివిధమతస్థులకును దావొసంగెను. అహింసాసిద్ధాంతము నామోదించి సాత్వికాహారము స్వీకరించుచు జితేంద్రియులుగ నుండు నేమతమువారలకైన నీ యాశ్రమమునఁ దావు గలదు. ఆశ్రమతరుఫలములఁ దిని ఆశ్రమధేనుక్షీరములు గ్రోలి రాజకుమారులు సైతము కార్యశీలురై యట వసించుచుందురు. మతము, సాహిత్యము, సంగీతము, శిల్పము, వ్యాయామము, రాజనీతి, ధర్మశాస్త్రము, వేదాంతము మున్నగు విద్యలు శిష్యుల కర్హకాలములందు బోధించుచు వాగీంద్రుఁడు గోకర్ణునితో రాజకుమారితో మలయవతితో నిష్టగోష్ఠి గావించుచు దినములు క్షణములవలె గడుపుచుండెను. మలయవతి యేకాంతమున గోకర్ణుని, గలిసికొని 'యెంతవఱకీ విరాగజీవితము. తండ్రి లేని బిడ్డను సింహాసనాసీనురాలి గావించి యేరాజకుమారునకేని యొసంగుదుమన్న ఆచార్యుని వాగ్దానము నెఱవేరుట యెప్పుడు ? కందూరురాజ్యము భీమరాజుదుష్టపరిపాలనము నుండి విముక్తి నొందుట యెప్పుడు ? ఇంక నెన్నాళ్లు మన కీ గురుకులవాసము?' అని యుద్రేకకరముగ భాషించెను. శుభసమయము తనంతన యాసన్నమగునని గోకర్ణుఁ డచంచలదీక్షతోఁ బ్రత్యుత్తర మిచ్చెను.

---

# నాలుగవ ప్రకరణము.

కందూరురాజ్యము విస్తీర్ణమునను సైనికబలమునను వర్ధమానపురరాజ్యమునకుఁ బైచేయిగా నుండెను. భీమరాజు కందూరుసంస్థానమును హరింపవలయు నని యనేకపర్యాయములు ప్రయత్నించి యవమానితుఁ డయ్యెను. ఎటులేని కందూరుసంస్థానాధీశ్వరుఁ డగు తైలపదేవుని వధించితీఱవలయు నని భీమరాజు సంకల్పించి యెంతయో ప్రయత్నించెను. శక్తికతీతమగు కార్య మొనరించి కృతార్థులైనవా రెవ్వరేని కలరా? భీమరాజు తన ప్రయత్నము విఫలమగుకొలఁది పట్టుదలతోఁ గందూరుసామ్రాజ్యముపైకి విజృంభింపఁదొడంగెను. తైలపదేవుఁడు భీమరాజు సద్దగించుటతోనే తనయావచ్ఛక్తి విని యోగించుచు నుంటచేఁ గాకతీయచక్రవర్తికి విజయదశమినాటికిఁ గప్పము నొసంగ వీలు కాదయ్యెను. ఇట్లు నాలుగు సంవత్సరములు గడచెను. అపుడు కాకతీయసామ్రాజ్యమున కధిపతిగ నున్న రుద్రదేవమహారాజు 'లోఁగడ నీయవలసిన కప్పముతో నియతకాలములో రాకున్న నీసంస్థానమునుండి నిన్ను సకుటుంబముగా వెడలనడిపింతు' నని యొక లేఖ నంపెను. ప్రత్యుత్తర మెంతకాలము నిరీక్షించినను రాదయ్యెను. రుద్రదేవమహారాజునకుఁ గర్తవ్యము తోఁచక రుద్రసేనాని యనునొక పద్మనాయక సేనానాయకునితోఁ గొంత సైన్యమును, గందూరురాజ్యమును ముట్టడించి తైలపదేవుని పదచ్యుతుని గావించుటకై పంపెను. రుద్రసేనాని నడిపిన

సైన్యమునకుఁ దైలపదేవునిసైన్యమునకు ఘోరసంగ్రామము జరిగెను. విజయము కాకతీయసైన్యమునకు లభించునటుల స్పష్ట మగుటచేఁ దైలపదేవుఁడు తలదాచుకొనుటకు మంత్రి కూటపాంతారణ్యములకుఁ బోయెను. పిమ్మట వంచకోపాయముతో శరణార్థియగు తైలపదేవుని భీమరాజు వధించెను. చండశాసనుఁడగు భీమరాజునకు వెఱచి ప్రజ లిది యుక్తమా అయుక్తమాయని సైతము తమలోనైనఁ జర్చింపలేకపోయిరి.

కందూరురాజ్యమున నీ చరిత్రాంశమంతయు నాబాల గోపాల మెఱుంగును. రణరంగమునఁ గాకతీయచక్రవర్తి సైన్య మెదుర్కొనియుండ విజయము భీమరాజు తనదియని యెట్లు చెప్పికొనఁగలిగెనని ప్రజలందఱేకముఖముగఁ దలఁచుచుండిరి. కొందఱు పౌరులు భీమరాజుపక్షమునఁ గాకతీయసైన్యము రణమునకు వచ్చెననియు మఱికొందఱు పౌరులు తైలపదేవుఁడు, భీమరాజు తులారణమొనరించిరనియుఁ జెప్పుకొను చుండిరి. రాజభక్తులగు ప్రజలు రాజకీయోద్యోగులకు సకాలమునఁ బన్నులు చెల్లించుచు శాంతముగఁ గాలము గడుపు చుండిరి. మంచియవకాశము చూచుకొని కందూరురాజ్యమును తన రాజ్యములోఁ గలుపుకొన భీమరాజు యత్నించు చుండెను. కందూరు రాజ్యమునందంతటను భీమరాజు తైలప దేవుని జయించి సామ్రాజ్యము సోదరుఁడగు గోకర్ణునకొసంగు చుండెఁగావ నే డాస్థానమున మహోత్సవమగునని ప్రకటింపఁ బడెను. కందూరు ప్రజలకెవ్వరికి విజయోత్సవమనిన నుత్సాహముగ లేదు. భీమరాజుపాలబడి మన మెట్టిదురవస్థలకు లోను

గావలసియుంటిమోయని పౌరు లందఱు వందురుచుండిరి. గోక ర్ణుఁడు ధర్మస్వరూపుఁడని పౌరు లెఱుంగుదురుగాని యస్వతంత్రుఁడగు నాతఁడేమి యుపకృతి సేయఁగలఁడని. నిరుత్సాహు లగుచుండిరి. భీమరాజు చండశాసనమునకు వెఱచి పౌరులందఱు పురము నలంకరించిరి. సైనికు లందఱు విజయోత్సవములలోఁ జాలుగొని యాస్థానము నలంకరించిరి. నాఁడు ఫాల్గుణ శుద్ధదశమి. మధ్యాహ్నము గోకర్ణునకుఁ బట్టాభిషేకోత్సవమని చుట్టుపట్టులనుండి జన మపరిమితముగ వచ్చెను. సైనికు లందఱు నూతనప్రభుని యేల్బడికి బద్ధు లగుట కరుదెంచిరి. సంస్థానమునకు సంబంధించిన యన్నిగ్రామములనుండి భూస్వాములు, ఉద్యోగులు, బ్రాహ్మణులు, పండితులు చనుదెంచిరి.

భీమరాజు మంత్రిసామంతద్వారికాదులతో జయభేరులు మ్రోగించుచు సూర్యోదయమగువఱకుఁ గందూరుసంస్థానమునకుఁ జేరెను. గోకర్ణుఁ డంతవఱకు రానటుల నాతఁడు గ్రహించెను. మంత్రిని బిల్చి సోదరుఁడు రానికారణ మేమి యని ప్రశ్నించెను. అతఁడు యోజించి పట్టాభిషేకసమయమునకు వచ్చి తీరును. ఎట్టి యున్మత్తుఁడేని యప్రయత్నలభ్యమగు రాజ్యలక్ష్మినివలదని కాలఁద్రోయునా? గోకర్ణు డీపట్టాభిషేకవార్త యింతకుమున్నె విని యిట రానుండవచ్చునని మనస్సును గుదురుపఱచికొనెను. కందూరుసంస్థానోన్నతోద్యోగులు, పౌరులు, భూస్వాములు, మహాధీశ్వరులు రాజమందిరముఁ జేరిరి. పట్టాభిషేకలగ్నము దాటిపోవనున్న

దని పురోహితుఁడు హెచ్చరించెను. మహాజనము కలకల మొనరించుచుండెను. భీమరాజుక నాలసింపరా దని యొకపటమ్ము కేలఁగొని యాస్థానమధ్యమున నున్న నొక యున్నతపీఠము నెక్కి నుచ్చైస్స్వరముతో నిటుల వాకొనెను. "ఓ పౌరసోదరులారా! కందూరురాజ్యము వర్ధమానపుర రాజ్యముతోఁ గలిసిపోయినది. తైలపదేవుని దురంతముల గూర్చి మీకు బ్రత్యేకించి తెలుపఁబనిలేదు. మీ రాతని పరిపాలనమున మిగుల శ్రమ లందియుందురు. ధర్మసంస్థాప నార్థము నేను కందూరురాజ్యముపైఁ గత్తికట్టితిని. కడకు జయించినది ధర్మదేవతయే. మీయందఱి యంగీకారమును తలఁదాల్చి నాకుఁ బ్రతినిధిగ నాసోదరుఁడగు గోకర్ణున కీ సింహాసనాధిపత్యము నొసంగనున్నాఁడను. ప్రకృత మాతఁడు తీర్థయాత్ర లొనరించుచు గురుకులవాస మొనరించుచు నిటకు సకాలమునకుఁ జేరరాఁడయ్యెను. అతని ప్రతిచ్ఛందమును సింహాసనమున నుంచుచున్నాను. మీ రందఱు నామోదించి నటులేకదా!"

భీమరాజిటుల నుపన్యసించుచుండ సభామధ్యముననున్న యొకవ్యక్తి మేఘగంభీరస్వరంబున నిట్లుపలికెను, 'పౌరులారా! గోకర్ణుఁడు తీర్థయాత్రలనుండి యిదిగో వచ్చియున్నాఁడు. అతని విజ్ఞప్తినైతము మీ రాలింపవలయును.' అనుచు భీమరాజునకుఁ బ్రక్క గోకర్ణుఁడు శిశుసహితము నిలిచి 'సోదరులారా! రాజ్య తృష్ణ కంతము లేదు. భీమరాజు తైలపదేవులకుఁగల యేకా ధిపత్యవాంఛ యనంతమైనది. తైలపదేవుని జీవితమంతయు

భీమరాజు ప్రతిఘటింప నెదుర్కొనుటతోడనే యంతరించెను. అతని సాత్త్వికభావము, ధర్మపరతంత్రత, మీరు గ్రహింప వీలులేదయ్యెను. కాకతీయసామ్రాజ్యముపైఁ దైలపదేవున కకారణద్వేషము కలిగెను. రుద్రదేవుని యనుజ్ఞచే రుద్రసేనాని తైలపదేవునిసంస్థానము ముట్టడించి యాతని పదచ్యుతుని గావించి యావిజయవార్తఁ జాటుటకై సైన్యముతో హనుమకొండ కేగెను. తైలపదేవుఁడు రుద్రసేనానిధాటికి వెఱచి మంత్రికూటప్రాంత నిబిడారణ్యములకుఁ దలదాఁచుకొనఁ జోటు లేక యర్ధాంగియగు మాణిక్యదేవితోఁ బుత్రికయగు నీపసికూనతో వలసపోయి యట కంతకుమున్నె క్షేత్రసందర్శనమున కరుదెంచిన భీమరాజును శరణుగోరి ఘోరమృత్యుముఖమున నంతర్హితుండయ్యెను. న్యాయమునకు విజయము కాకతీయసామ్రాజ్యమునకు సంబంధించినదే. సంస్థానము తైలపునియేకైక పుత్రియగు నీబాలకు సంబంధించినదే. రుద్రదేవచక్రవర్తి కందూరురాజ్యమును హరింప సంకల్పింపలేదు. అట్టియుద్దేశమే యున్న నిట విజయస్తంభము నాటి రుద్రసేనాని సేనతో సంస్థానమును గాచియుండువాఁడే. చక్రవర్తియాజ్ఞ తైలపదేవుని పదచ్యుతినిఁ గావించువఱకే. తైలపదేవుఁడు రుద్రదేవచక్రవర్తిని క్షమార్పణముఁ గోరిన నాతనిసంస్థానమున కీదుర్దశ రాదు. తనపై నభిమానముతో వచ్చు స్వసైన్యమును విరోధిసైన్యముగ భావించి భీమరాజును శరణుగోరి తైలపదేవుఁ డంతరించెను. రుద్రసేనాని "తైలపదేవుఁడు, సేనతో రాజ్యము విడిచిపోయెనని వెనుకకు మరలి వెడలిపోయెను.

మాణిక్యదేవి భర్తతో సహగమన మాచరించెను. విూనంస్థానాధీశ్వరుల వంశాంకురముగ నీయాఁడుబిడ్డ నిలిచియున్నది. భీమరాజున కీ కందూరురాజ్య మేవిధముననేని సంక్రమింపఁ జాలదు. దానఁజేసి గోకర్ణుఁడుసైతము సింహాసనార్హుఁడు కాఁ జాలఁడు. భీమరాజు కందూరురాజ్యమును హరింప యత్నించు వఱకు నేను బ్రతిఘటింపఁబనియుండ దని గూఢచారులచేఁ బరిస్థితులను వినుచు నేను గురుకులవాసము జేయుచుంటిని. నా కీరాజ్యబంధమువలదని పీఠముపై నున్న పటమును గోకర్ణుఁడు తీసివైచి కుమారి నా సింహాసనముపై నుంచెను. పౌరులలోఁ గల కలము జనించెను. 'భీమరాజు ద్రోహి, దురాత్ముఁడు, దురభిమాని, అసత్యభాషి, చంపుఁడు, మర్దింపుఁడు, కందూరురాజ్య లక్ష్మికి బలిపెట్టుఁడు, రండు రం'డను కలకలము బయలువెడలెను. భటులు చుఱకత్తులు దీసికొని ముందునకు రాఁదొడంగిరి. పౌరులు కఱ్ఱలతో నీటెలతో ముందడుగు వేయుచుండిరి. గోకర్ణుఁ డాకలకలము నాలించి బిగ్గరగ 'సోదరులారా! దౌర్జన్యము కూడదు. అహింసను బోలినవ్రత మింకొకటిలేదు. తైలపదేవుని వధించిన పాపము భీమరాజు నెంతదుర్గతికిఁ ద్రోయ నున్నదో భగవానుఁ డెఱుంగును. పశ్చాత్తాపతప్తుఁడై భీమ రాజు శల్యావశిష్టుఁడు కానున్నాఁడు. శాంతింపుడు, శాంతింపుఁడు. ఇహలోకమున మనము చేయుశిక్షకంటెఁ బరమునఁబర మాత్ముఁ డొనంగుశిక్షయే గొప్పది. ప్రతికృతి నొనర్చితిమేని మనముసైతము ధర్మచ్యుతుల మగుదుము. భారతమాత శైల మయిల హార్మ్యముల స్థూలవస్తుసముదాయముల వహింపఁగలదు

గాని యధర్మపరమాణువును మోయఁజాలదు. జైనుఁడీధర్మ సూత్రములనే భారతదేశమున ముక్తకంఠముతో వాకొనెను. మీ రందఱు భీమరాజును వధింపనిశ్చయింతురేని యీదురంత కారకుఁడనగు నేను భృగుపాతముతో మరణింతునని వక్కాణించెను. గోకర్ణుని శాంతవచనములచేఁ బౌరులు నిశ్చేష్టులైరి. భీమరాజు నాసాగ్రదృష్టితో నేదియో విచారించుచున్నటుల నిలువఁబడియుండెను. సభ యంతయు నిస్తరంగనీరాకరమువలె శాంతమై ప్రసన్నమైయుండెను. ప్రకృతివిలసనము, కర్తవ్యభారమొక భీమరాజుపైనమాత్రమె కలదు. ఆతనిహృదయమున స్వాస్థ్యము లేదు. సర్వాంసహాభారధూర్వహుఁడను నేనే యని బుజములఁ జఱచుకొను భీమరాజు నామగోపనము గావించుకొనవలసివచ్చెను. అతని హృదయమున నసూయ, మాత్సర్యము, అహంకారము, క్రోధము సమముగ జనించియున్నియుఁ గలిసి యొకమహాశక్తిగ మారి యింద్రియముల స్తంభింపఁజేసెను. భీమరాజపుడు ధర్మదేవతముందు శిక్షితుఁడై ముగ్ధుఁడై స్తబ్ధుఁడై నిలువఁబడెను. హృదయమున నన్ని వికారభావప్రవృత్తులు కలవుగాని పశ్చాత్తాపమున కప్పటికేమాత్రము నిలువనీడ లేదయ్యెను.

గోకర్ణుఁడు భీమరాజువైపునకు మరలి 'అగ్రజాతా! గతమునకు వగవఁబనిలేదు. కందూరురాజ్యమునకు నన్నభిషిక్తుని జేయుటకంటె నీకుమారిని జేయుట కర్తవ్యము. పితృార్జితమున కీ యమయె ముఖ్యురాలు. వర్ధమానసంస్థానచ్ఛత్రచ్ఛాయ ననుసరించి కందూరురాజ్యము జల్లఁగ వర్ధిల్లనుగ్ర

హింపుఁడని ప్రార్థించెను. భీమరాజు గోకర్ణుని చేతి కీలుబొమ్మ యయ్యెను. ప్రజాభిప్రాయమే గోకర్ణుని యభిప్రాయముగ నున్నపుడు భీమరాజు చేయున దేమున్నది? అతనిసంకల్పసౌధము కూలిపోయెను. హృదయాకాశమున నశాంతిసమీరము వీచెను. గోకర్ణునియాజ్ఞ నుల్లంఘించినఁ బ్రజలు తన్నేమి చేయుదురోయనుభీతి యాతని సారెసారెకుఁ జంచలింపజేసెను. అంతరంగము నెటులో గుదురుకఁబఱచుకొని భీమరాజా బాలికను గోకర్ణునియొద్దనుండి చెంతకు రప్పించి సింహాసనమున నాసీనురాలిఁగ నొనరించెను. సభ్యు లందఱు జయవాక్యముల నుచ్చరించి కోలాహలము లాచరించిరి. సువాసినులు మంగళగీతములతో రాజ్యలక్ష్మికు పాయనము లొసంగిరి. పౌరులమొగంబున విలసిల్లు మందహాసముగాని గోకర్ణుని ముఖమునఁ గల యుత్సాహముగాని భీమరాజుముఖంబునఁ గానవచ్చుటలేదు.

ఇంతలో వాగింద్రచూడామణి యను జైనాచార్యుఁడు సభావేదిక నధివసించి, 'సోదరులారా! ధర్మము గెలిచినది. మీర లందఱు భీమరాజును దొల్లింటివలెఁ బ్రేమించుట విధి. అధర్మప్రేరితుఁడై తైలపదేవుఁడు తనకుఁ దానె మడసెనని మనము శాంతింపవలయును. తైలపదేవుని పవిత్రతేజముతో జనించినయీకుమారి యచిరకాలమున నాంధ్రసామ్రాజ్యమహారాజ్ఞి కాఁగలదు. ఇది సర్వజ్ఞులగు జైనసిద్ధాంతులేకముఖముగ వాకొనిన దివ్యవాణి. గోకర్ణా!– నీవు భీమరాజతో వర్ధమానపురమున కేగి ప్రజలలో శాంతి నెలకొల్పు యగ్రజునకుఁ గుడిబుజముగ నుండి వర్ధమానపురసంస్థానముఁ

గాపాడుము. ప్రజలలోఁ గల్గిన రాజద్వేషము నడంచి శాంతి స్థాపింపుము. భీమరాజొనరించిన ధర్మవిచ్యుతి పశ్చాత్తాపముతో శాంతించినది. ప్రజల హృదయమునుండి యీ భిన్నాభిప్రాయమును దొలగింపకున్న దేశ మరాజక మగును. పరధర్మస్థాపనమువలె స్వధర్మస్థాపనముగూడ నీవిధి. మలయవతీ! నీ వీకుమారిని సంరక్షించుచుఁ గందూరురాజ్యముననే యుండుము. ఈబాలకు యుక్తవయస్సు వచ్చువఱకు విద్యాబుద్ధులు నేర్పుటకిట నిరువురు మేధాశాలురగు నంతేవాసుల నుంతును. మలయవతియు గోకర్ణుఁడు వాగీంద్రుని వాక్యముల శిరసావహించితి మని శిరఃకంపమాచరించిరి.

వాగీంద్రుఁడు: కందూరుస్థ నికులారా! మీమీరాజభక్తి మఱువక శిశురక్షణమున నప్రమత్తులు కండు. మిమ్ము ధర్మస్వరూపిణియగు పరంజ్యోతి కాపాడఁగలదు. వర్ధమానపురస్థ నికులారా! మీ రందఱు "రాజానుమతో ధర్మః" యను న్యాయ మెఱింగి వర్తింపుఁడు. మీప్రభువగు భీమరాజు మాట జవదాటకుఁడు. ధర్మమూర్తియగు గోకర్ణుఁడు మీకు మార్గదర్శియై యున్నాఁడు. న్యాయము తొలంగి ప్రభువులు దుష్పథమున నడచిరేని మే మందఱము సంగ్రామరంగము నలంకరింతుము. మా జీవితములు సర్వసన్న్యాసమున కని మీరు తలంపకుఁడు. ధర్మస్థాపనమె మాప్రధానాదర్శము. "నమో జినపరమాత్మనే" యని వాగీంద్రుఁడు పీఠము డిగ్గి శిష్యులతో నా స్థానము వదలి యొంటే నేగెను. భీమరాజాదులు గోకర్ణునితో నారాత్రినుండి వర్ధమానపురి కేగ సంకల్పించిరి.

# ఐదవ ప్రకరణము.

భీమరాజు వర్ధమానపురము జేరినదిమొదలు కొన్ని సంవత్సరములు కార్యభారమంతయు గోకర్ణునియందె యుంచి తాను పరిపాలనవిధానమును మాత్రము శ్రద్ధతో దిలకించుచుండెను. దేశమున శాంతి స్థాపింపఁబడెను. ప్రజ లందఱు నియతధర్మములలోఁ బ్రవర్తింపఁ దొడంగిరి. కాకతీయచక్రవర్తి కాలాహివలె తన్నెపుడు మట్టుపెట్టునో, గోకర్ణుడు, గోముఖవ్యాఘ్రము, తనకేమి అపాయము వాటించునోయనుభయము మాత్రి మతనిహృదయమును జంచలింపజేయుచుండెను. గోకర్ణుని పలుకుబడి క్రమముగ హెచ్చుటఁ జూచి యెటులేని యాతని వెడలనడవకున్న రాజ్యమిఁక హస్తగతమగుటదు స్తరమని తలంచెను. ఈ పరిస్థితులలో త్రైలపదేవుని భీమరాజు వధించినకథ దేశమునం దంతటఁ బ్రాకెను. తుదకుఁ గాకతీయ చక్రవర్తియగు రుద్రదేవమహారాజుసైత మాలించెను. అధర్మ శీలుఁడగు భీమరాజుపై నలుక వహించి, యాయయుక్తకార్య మొనరించినందులకు బ్రతిక్రృతిగ నేమిప్రతిఫలము కందూరు రాజ్యమున కొసంగుదువో తెలిపి యాప్రతిఫల మాసామ్రాజ్యమునకు మాసములోఁగఁ జెల్లింపవలయుననియు నటులొనరింపకున్న నేఁటినుండియె మీకును మాకును సంగ్రామము నిశ్చయమనియు నొకలేఖవ్రాసి సోదరుఁడగు మహాదేవరాయల కొసంగి కొంతసైన్యముతోఁ బంపెను. గోకర్ణుఁడు భీమరాజు

రాజ్యవిషయకప్రసంగము లొనరించుతఱి మహాదేవరాయలు భీమరాజున కాలేఖ నొసంగి యర్ధాసనమునునాసీనుఁ డయ్యెను.

భీమరాజా లేఖ ననేకపర్యాయములు పరిశీలించి గోకర్ణునకొసంగి కర్తవ్యమేమియని ప్రశ్నించెను. గోకర్ణుఁడు దూరమాలోచించెను. లేఖ మఱలఁ బరిశీలించెను. కడకుఁ జక్రవర్తిశాసనము సామంతుల కనుల్లంఘ్యమని వాకొనెను.

భీమరాజు తోఁకఁద్రొక్కిన పామువలెఁ గోపముతో 'సోదరా! నీచందనశీతలములగు మాటలచే నే నింతవఱకు మోసపోతిని. సామ్రాజ్యపరిపాలన ధర్మము నీ వెఱుంగవు. నీవొక జైన సంన్యాసివి. సర్వసంగపరిత్యాగివి. ఏమందువు, చక్రవర్తిశాసన మనుల్లంఘ్యమనియా?

గోక:—కాకేమున్నది? మహాదేవరాయ లిటుఁడటన్నుడు. 'మన ముభయులము ధర్మము కోరుదుము. తైలపదేవుని మీరక్రమముగ వధించినందులకుఁ జక్రవర్తి మీకు ద్రవ్యదండనము విధించి దానిని గందూరు సామ్రాజ్యమున కిప్పింపఁదగఁడా?

భీమరాజుమనస్సు కలవరపడెను. చాలసేపు యోజించెను. రుద్రదేవచక్రవర్తి కపరాధము చెల్లించుటకాతనియంతరాత్మ యంగీకరించుటలేదు. ప్రతిఘటించిన సంగ్రామమున నెదుర్కొనఁ డా నశక్తుఁడు. ఈరెంటికి సంబంధింపనిగత్యంతరమేమేని కలదా యని యాతఁడు యోజించెను. గోకర్ణునకు, మహాదేవరాయల కా భీమరాజు యోచనయొక విధమగు సేను

మానముఁ గలిగించెను. భీమరాజు కొంతసేపటికి 'మహాదేవ
రాయా! మీ మండలము గొన్ని పురుషాంతరములనుండి
కాకతీయసామ్రాజ్యచ్ఛత్రముక్రింద సుఖముగ జీవించుచు
న్నారము. మీయాజ్ఞ నేనెన్నఁటి కుల్లంఘింపను. వార్తావ
హునితోఁ గాదగుకార్యమునకుఁ జక్రవర్తియంతటి మీరు
సైన్యసమేతముగ రా నగత్యము గోచరించుటలేదు. కొలఁది
కాలములో గోకర్ణుఁడు, నేను రుద్రదేవచక్రవర్తిసన్నిధిలో
సర్వము నివేదింతుము. మాబోఁటిసామంతుల లోపాలోపములఁ
బరిపాలించు చక్రవర్తివద్దకు వచ్చుటలో మా కెట్టి సంశ
యము లేదు. మీ రలసివచ్చితిరి. సైన్యమును వెనుకకుఁ బంపి
కొంతకాలము మా యాతిథ్యము స్వీకరించి సామ్రాజ్యము
నకు దయచేయవచ్చును. వీలున్న మేమును మీవెంట వత్తు
మని భీమరాజు వచించెను.

భీమరాజు మాటల సందర్భము, గోకర్ణునియెడఁ జూపిన పరుషభావము, తనచెంతఁ జూపిన సరళభావము మహాదేవునకు మిగుల ననుమానాస్పదముగ నుండెను. భీమరాజునకు హృదయములు రెండు కలవనియు నొకటి పరవంచనమునకు, మఱియొకటి స్వామిద్రోహమున కుపయోగించునని యాతఁడు గ్రహించెను. భీమరాజుమాట లెంతవఱకు విశ్వసనీయములో, అం దెంతవఱకు సత్యము కలదో యరయుటకై యారాత్రి యట నివసింప సంకల్పించి మహాదేవరాయలు తనసైన్యముతో "వెనుకకుఁ బొండనియు, భీమరాజు సంధి కంగీకరించెనని అన్నగారికిఁ దెలుపుఁ డనియుఁ జెప్పెను.

మహాదేవరాయలు వినోదప్రియుఁడు. గానమునందు, నృత్యమునందు నాతని కాసక్తి యెక్కువ. వసంతసమయమున నంటుమావిచివురుగొమ్మలలో మేను దాచి మనోహరముగఁ గూయు గోయిలకూఁతల కాతండు పరవశుఁడై యెక్కుడిన మంతయు వనమున వసించును. కవుల మనోహరకవితా శయ్యలలోఁ జిక్కుకొని యొక్కొక్క నాఁడాతఁడు రాజమందిరము వదలి కవుల వెంటనంటి శరచ్చంద్రికారాత్రులు గడపుచుండును. ఎవఁడేని వ్యాధిగ్రస్తుఁడై విలపించుచున్నఁ దాను నటులె విలపించుచు నెదుటివానిబాధ తనదిగ భావించును. సరళ స్వభావ మొందుదక్క ప్రపంచధర్మము నెఱుంగనిమహాదేవ రాయలు నేఁడు మధురములు నమృతప్రాయములు నగు భీమ రాజుపలుకులు విశ్వసించి నాఁటిరేయి నటఁ గడుపనిశ్చయించెను. ఆ సాయంకాలమంతయు వినోదములతోను, వారకాంతల నృత్యములతోను, గాయకులగానముతోను, భటుల శరీర వ్యాయామములతోను మహాదేవరాయలకు సంతోషముగ నిమేషమువలె గడచిపోయెను. అతని హృదయమున ననుమానమె లేదు.

భీమరాజు గౌరవపాత్రుఁడనియు, నుచితానుచితజ్ఞుఁడనియు, ననుభవశాలియనియు, మహాదేవరాయలు నిశ్చయించెను. గోకర్ణుఁడు భీమరాజుదుండగముల మహాదేవరాయలకుఁ దెలుపఁదలంచెను. కాని వీలుకా దయ్యెను. భీమరాజు భేద నీతికి వీలు కల్పింపక మహాదేవరాయల నేమరకయుండెను.

రాత్రి జాముపొద్దుపోయెను. మహాదేవరాయలు భీమరాజువద్ద సెలవుపుచ్చుకొని తాను వేగుజామున సామ్రాజ్యమున కేగుదుననియుఁ గొలఁదికాలములో మీరు మాయన్న గారి సందర్శనమునకు రావలయుననియుఁ దెలిపి శయనమందిరమున కేగెను. భీమరాజు గోకర్ణునివద్ద కేగి మహాదేవరాయలిపుడె యలసి నిదురించినాఁడు. నిద్రాభంగ మొనరింపకుమని తెలిపి యావల ప్రధానమంత్రితో నించుక మంత్రాంగ మొనరించి గోకర్ణుని మహాదేవరాయలతోఁ గలియనీయకుఁడని యాయుధపాణులగు భటుల ద్వారమున నుంచి యథేచ్ఛముగ వెడలిపోయెను.

మహాదేవరాయల కొక మందిరమున శయ్య యేర్పఱుపఁబడెను. ఆ మందిరమునఁగల శిల్పిచిత్రములు, చిత్రపటముల సౌందర్యము పరిశీలించుచు వినోదముగ నలుగెలఁకులఁ జరించెను. సమీపమున నొకసుందరిమూర్తి పటమునఁ జిత్రింపఁబడి నయనానందకరముగ నుండెను. ఆ పటములోని సతీముఖవిలాసము, సౌకుమార్య సౌందర్యములు పరిశీలించుచు నాగరలిపితోఁ గ్రింద లిఖింపఁబడిన నామముఁ జూచెను. అందు భీమరాజపుత్రి 'సౌభాగ్యవతి' యని లిఖింపఁబడి యుండెను. ఆ ప్రతిచ్ఛందమును గేలఁగొని పర్యంకమునఁ బరుండి పలుమారులు గాంచి యానందించి నిజముగ నిది శిల్పిసమయానుకూలమొ, సహజమొ పరిశీలింప వలయునని జాగరూకుఁడై పరికించెను. అతని భావనాశక్తి నిశితముగ లేదు? ఆ నిర్ధారణమునఁ గృతార్థుఁడు కాఁజాలఁడయ్యెను.

ప్రతిచ్ఛందమును గనుల నద్దుకొనుచు 'తన్వీ శ్యామా శిఖరిదశనా పక్వబింబాధరోష్ఠీ' అని యేదియో వా కొనుచు మణిదీపముచెంత నాప్రతిబింబమును జూచుచు మహాదేవరాయలు పరవశమున నున్మాదమునఁ దన్మయుఁడై యానందించుచుండెను. ఇంతలో మణిదీపము లన్నియు నారి పోయినటులుండెను. శయ్యచలించుచున్నటు లగుపడెను. హృద యము స్థానమును దొలంగి శూన్యప్రదేశముఁ జేరినటులయ్యెను. అది బాహ్యాంధకారమొ, హృదయాంధకారమొ యతనికి గోచరించుటలేదు. కనులవిచ్చి చూచెను. అంధకార బంధురము. కాని మణిగణభూషణాదులతోఁ బ్రజ్వరిల్లుచున్న యొక స్త్రీ వ్యక్తిసుందరమూర్తి యతని నయనములముందుఁ బ్రతిబింబించు చుండెను. ఎంతవఱకా బింబసందర్శన మగుచుండెనో యంత వఱకు వెలుగు గోచరించుచుండెను. అతని హృదయమునఁ, గనులముందు నంతయు నంధకారమే. ఒకవైపునుండి గంధక మిశ్రితమగు వాసనతో గాలి వీచెను. ఆ వాయువుపీల్చినకొలఁది మహాదేవరాయలకుఁ దెలివితేటలు మందగించెను. ప్రతి చ్ఛందము వక్షస్థలముననే కలదు. అతఁడు పర్యంకముమీఁదఁ బరుండి స్మృతిఁ దొలంగెను. అది తన్మయమొ, విషవాయు ప్రయోగఫలితమొ యెట్లు నిశ్చయింపఁగలము?.

మహాదేవరాయ లొకజాముసేపటుల మాంద్యముగ నుండెను. తల తిరుగుచుండెను. కనుల విచ్చిచూచెను. తాను పరున్నది పూర్వపర్యంకమే కాని నివసించియున్నది మాత్రము పూర్వహర్మ్యముగాదు. ద్వారముచుట్టు నినుపచువ్వలు ప్రాత

బడి యొకబలమగు తాళము వేయఁబడి యుండెను. విచ్ఛ్వ కత్తులతో నిరువుర్గు రక్షకభటులు లా గృహమును గాచియుండిరి. మహాదేవరాయుల కంతయు నాశ్చర్యముగ నుండెను. ప్రతిచ్ఛందముమాత్రే మాతనిహ స్త మలంకరించియుండెను. తానున్న మందిరమునుండి కొంత వెలుఁగు కానవచ్చెను. కొంత సేపటికి సూర్యోదయ మయ్యెను. మఱలఁ దన నివాస మంతయు నొకమాఱు పరిశీలించెను. గృహాంతరాళమున నొక చెక్కపై నేదియో వ్రాయఁబడియుండెను. సమీపించి పఠించి స్తబ్ధుఁడైపోయెను. అందు "మహాదేవరాయా! నీకీ కారాగార వాసము జన్మాంతమువఱకు భీమరాజుచే విధింపఁబడెను." అని వ్రాయఁబడియుండెను. అతని కంతయు నింద్రజాలమువలె నుం డెను. తన దురవస్థ మాతృదేశమున విన్నవించువారు లేరు. పరిచితులు లేరు. కర్తవ్యము తోఁచుటలేదు. 'ఇఁక నిందె మర ణింపవలయును కాఁబోలును. భీమరాజుమధురములగువాక్య ములే న న్నింతటి యవస్థకుఁ దెచ్చెను. నే నెవఁడనో గోకర్ణుఁడు తప్ప యీరాజ్యమున నితరు లెఱుంగరు. భీమరాజు సంకల్ప మిటుల విపరీతముగ నుండుటచేతనే సైన్యము వెనుకకుఁ బంపు మని చెప్పియుండెను. 'గోకర్ణునిసాహాయ్యముతో నే ను త్తీర్ణుఁడఁ గావలసినదేగాని గత్యంతరము లేదు. గోకర్ణునకు నాయవస్థ తెలియదు. భీమరాజు తెలియనీయఁడు. ద్వారపాలకులను మంచిచేసికొని విముక్తుఁడను కావలయును. నే నంతటియదృష్ట జాతకుఁడనా?' యనుచు మహాదేవరాయ లాకారాగారమునఁ బ్రభాతము నంతయు గడపెను.

---

# ఆఱవ ప్రకరణము

వర్ధమానపురసంస్థానముచుట్టు గొప్ప మంటికోటయు, నగాధమగు కందకమును గలవు. కోటకు నాలుగుద్వారములు, ఎనిమిది బురుజులు కలవు. ప్రతిబురుజుపైనను వేయిమంది సైనికులు నాలుగు శతఘ్నులతో సమరమునకు సర్వసిద్ధముగ నుందురు. భీమరాజొక ధర్మశాల స్థాపించి సంగ్రామోపయోగకరములగునాయుధములు, బల్లెములు, శతఘ్నులు, నాళయంత్రములు చటనే చేయించి పౌరులందఱకు నిర్బంధముగ సంగ్రామము నేర్పి పదాతిబలము నభివృద్ధిపఱచెను. భీమరాజు జనకంటకుఁడగుటచే నాత్మసంరక్షణమున కతఁడెక్కుడుగఁ బాటుపడవలసివచ్చెను. తన యాదాయములో నాల్గవవంతు మూలధనముగ బొక్కసమున నుంచెను. ఎట్టి విపత్తుననేని యందుండి యొకకాసేని వినియోగింపఁడు. మిగిలినధన మాతనిసైన్యమునకు సంస్థానోద్యోగులకుఁ బరిమితముగ వినియోగించును. భీమరాజునొద్ద ప్రపంచము గర్హించు దుర్గుణములు కొన్ని కలవు. పరకాంతావాంఛ యాతనినియతధర్మము. నిరీశ్వరవాద మతనియాధ్యాత్మికవిద్య. తరతరములనుండి తన వంశీయులచేఁ బోషింపఁబడుచున్న పెక్కుజైననిలయములతఁడు రూపుమాపి జైనభక్తుల వెడలనడిపి వృత్తుల హరించెను. జైనులందఱు తమగ్రంథసముదాయముతో వర్ధమానపురసంస్థానమును శపించుచు జినమతాభిమానియగు తైలపదేవుని యాశ్రయమునకుఁ జనిరి. గోకర్ణుఁడు బాల్యమునుండి జినమత

ప్రివర్తకులయందు విశ్వాసము, గౌరవము గలవాఁడు. పలు మాఱు భీమరాజుతో జైనులవృత్తి హరించుట శ్రేయోదాయకము కాదని వాదించియు గోకర్ణుఁడు కృతార్థుఁడు కాఁజాలఁడయ్యెను. వాగీంద్రుఁడుగూడ నొకకాలమున వర్ధమానపుర నివాసియే. భీమరాజు దుర్మార్గముల కేవగించి తన యాధిపత్యముక్రింద నున్న పదునొకండు జైననిలయవాసుల వెంటఁగాని యరణ్యమధ్యమున నొకవిహార మేర్పఱచి యందు నివసించెను. భీమరాజు నెడ గొన్ని సద్గుణములు లేకపోలేదు. రాజకీయములలో నితరులతోడాశింపఁడు. పితికితన మతఃడెఱుంగఁడు. పాటువడి పనిచేయుటలో మిగుల నేర్పరి. ప్రజాపాలనమునం దతనిలక్ష్యము దృవ్యార్జనంబె.

నేఁడు భీమరాజు వర్ధమానపురమునకు బహిర్భాగమునఁ గల యొకవిశాలమందిరమున నేకాకియై యాలోచనమున మునింగియుండెను. అతని మనోభావము లన్నియు నాన్యమునఁ బ్రతిబింబితంబు లగుచుండెను. మాటి మాటి కేదియో యస్ఫుటముగ వాకొనుచుండెను. భీమరాజు వసించినభవనమును విలాసనిలయమందురు. అందు భీమరాజుదక్క నొరు లేగ ననుజ్ఞలేదు. గోడలనిండఁ గ్రీడాపటములు శృంగారతరంగితముగఁ జిత్రింపఁబడియుండెను. ప్రతిపటమునను భీమరాజు నాయకుఁడుగను దదితరకాంతలు నాయికలుగను లిఖింపఁబడిరి. నాలుగువైపుల నిలువుటద్దములు, మణిదీపములు తనరారుచుండెను. ఆ చిత్రపటములు భీమరాజుహృదయమును దొల్లింటివలె నాకర్షించుటలేదు. ఆ విలాసనిలయము భీమరాజున కానందకరముగ

లేదు. తనలోఁదాను పాతాళలోకమునకుఁ బోవుచుంటిననియు, నున్నతశైలమునుండి క్రిందికిఁ ద్రోయఁబడితిననియు, రాజసమ క్షమున ఘోరదండనమునకుఁ బాల్పడితిననియుఁ దలంచికొని యులికిపాటుతోఁ దెలివిఁగొనుచుండెను. అతని హృదయ దృష్టికి మలయవతి, తెలవదేవపుత్రి, గోకర్ణుఁడు, వాగీంద్రుఁడు పిశాచములవలెఁ గానబడుచుండిరి. ఆ యావేగము, ఆ తొట్రుపాటు, ఆ స్తబ్ధభావము, ఆ యోచన, పిశాచావేశలక్షణము లనుటలో సంశయ ముండదు.

భీమరాజాలోచనసముద్రమున మునింగియున్న యీ యదనున నొకయువతి యాతని నాలింగన మొనరించెను. తిరిగి చూచి ముఖభావముల సవరించుకొని భీమరాజు మందహాసముఁ దెచ్చికొని యిట్లు పలికెను. "ఓహో సౌదామినీ? నీవా? ఈ నడిరేయి నిట కెటుల రాఁగలిగితివి. నే నీ విలాసనిలయమున నుంటినని యెవ్వరు బోధించిరి?"

"ప్రియా! నాహృదయము తీసినదారినిబట్టి కనులు మూసికొని నిన్నుఁ జేరఁగలిగితిని. దానిని ప్రణయమె యనుఁడు, మోహమే యనుఁడు, ప్రేమయే యనుఁడు. ఆ త్రిగుణాత్మక యగు శక్తియే న న్నిటకుఁ గొనివచ్చినది. చిరకాలసమావేశమునకు మధురసంభాషణము, ప్రేమమున నొక ప్రణయాంజలి యభిలషించితి."

కామినీ! నీకు యౌవనమువలె నావయుఁ బ్రేమము నైతము విజృంభించుచున్నది. నాహృదయమున నీ మంగళ

మూర్తి ప్రతిష్ఠింపఁబడియుండుటచే నాకీ వియోగవిచారము లేదు. ఇపుడు హృదయాకాశమునఁ గాలాంబుదము లావరించినవి.

"మీరు కాలాంబుదము లని తలంచినది గోకర్ణుని, వాగీంద్రుని నని నే నెఱింగియున్నాను. ఝంఝామారుతతుముందా కాలంబుదము లెంత? ఆ యుభయుల మట్టుపెట్టినఁ గాని రాజ్యమున శాంతికి నిలువనీడ యుండదు."

"సతీ! అది సామాన్యకార్యము కాదు. ఆ యుభయులు కాలముదీఱి మరణించినను బ్రజలు నాయందె ద్రోహముంచి నన్ను మట్టుపెట్టకమానరు. దీని కొక మూలకందము గలదు. దానిని ఛేదించితిమేని మనము కృతార్థుల మగుదుము."

"నీ కా విషయమున సందేహము వలదు. నీవు దేనిని మూలకందముగ భావించితివో యది పల్లవము. తైలపదేవుని పుత్రిక యే కదా? ఆయమ యాయుర్దాయము క్షణభంగురము. సామ్రాజ్యము నొక మార్గమునఁ ద్రిప్పుటకు నే నుండ మిథ్యాభ్రాంతి కేల లోనయ్యెదవు? కాలచక్రము నాకేల నున్నది. వలసినట్లు త్రిప్పఁగలను".

"ప్రియురాలా! నీవు నిజముగ నంతటిదానవె. కర్తవ్యము నెటుల నిర్ణయించితివి? కార్యభారము నెవనిపై నెలకొల్పితివి? ఎట్లు నిర్వహింపనెంచితివి?"

కలఁడుగదా విశారదుఁడు. ప్రొద్దుపోయినది. ఈ తమలపాకుల నమలుఁడు. ఇదిగో, ముత్తెపుసున్నము; కొలఁదిగ నాలుకకు రాసెదను. ఈ మద్యపాత్రము నిరువురము నొకమాటె

త్రాగుదము. వేకువజామున విశారదున కీ జాబు నొసంగి పొలవానకుఁ బంపితిమా, సర్వము చక్కఁబడును.

భీమరాజు పానమత్తుఁడు కాఁడుగాని సౌదామినితో నున్నంతవఱకుఁ గైవులేకున్న నిలువఁజాలఁడు. ఇరువు రొక పాత్రముతో మద్యము సేవించిరి. ఆ పర్యంకమున సరసములు, ప్రణయకోపములు, రహస్యోద్ఘాటనములు, అభినయములు, వికారములు చేయుచుఁ దన్మయులై యుండిరి. ద్వారపాలకు లీ యున్మత్తదశ గమనించి, బైటగొళ్లెములఁబెట్టి వేకువజామున న్మేల్కొలువ వచ్చువఱకు రావచ్చునని గృహముల కేగిరి. ద్వారమున నించుక సందడియయ్యెను. ఎవరో పిలుచుచున్నటుల నలికిడి విన వచ్చెను. భీమరాజు కనులఁ దేలవైచుచు 'సౌదామినీ! పిలిచి తివా?' యనెను. సౌదామిని "నీవు పిల్చియు పిల్చితివా యందు వేల?" యనెను. ఉభయులు నీవు నీ వనుచుఁ బూబంతులతోఁ గొట్టుకొనిరి. వారికి బాహ్యప్రపంచమే తెలియుట లేదు. సర్వము మోహమయమే. మోహసాగరమగ్నుఁడగు భీమరా జెట్టకేలకుఁ దెప్పిరిల్లి సౌదామినితో నిటుల భాషించెను.

'కామినీ! నేఁ డొక యాకస్మికవిపత్తును దొలంగించు కొంటిని. వినియుంటివిక దా!'

'ఏమీ! మహాదేవరాయలు చక్రవర్తి సన్నిధానము నుండి తెచ్చిన సందేశమే కదా! అది యొక విపత్తా?'

'నిజముగ విపత్తే! నాసామ్రాజ్యచ్ఛేదన మాచరింపఁ జక్రవర్తి యీసూచనము గావించెను. నేను మెలకువతో నేఱుదాటి తెప్పఁగాల్చితిని.'

'ఏమీ! మహాదేవరాయల మట్టుపెట్టితిరా?'

భీమ:—అది ముందు జరుగవలసినపని. దానికిముందు కొంతగ్రంథము జరుగవలయును. మణిసౌధమున మహాదేవ రాయల శయనింపఁజేసి దుర్వాయుప్రయోగము గావించితిని. మణిదీపములు కాంతి తొలంగెను. మహాదేవరాయలు మాంద్యమున నొడలు మఱచెను. యంత్రసాహాయ్యమున నట నున్న పర్యంకముఁ గ్రిందనున్న కారాగారమునకుఁ జేర్చితిని.

సౌదా:—ఇఁక రుద్రదేవుఁడు మనచేతిలోని బొమ్మయే. ఈ విషయము గోకర్ణుఁ డెఱింగిన ననేకవిపత్తులు ప్రాప్తించును. అతఁడు విరోధిపక్షపాతిగదా!

అతఁడు నేఁటిరాత్రినుండి కందూరున కేగనున్నాఁడు. గోకర్ణునకుఁ గొలఁదికాలములో మహాదేవరాయలకంటె దుర్గతి బ్రాప్తింపఁజేయవలయును. దాని కిది యదనుగాదు. ప్రజలంద ఱాతనిపై భక్తిగ నున్నారు. భక్తిని ద్వేషముగా మార్చితిమేని యెంతపనినైనఁ గావింపవచ్చును.

ఇంతలో ద్వారము తెఱువఁబడెను. గోకర్ణుఁ డా మందిరములోనికిఁ జేరి ముందునకుఁ జూచెను. భీమరాజు మిగుల నున్మాదావస్థలో నుండెను. సౌదామిని కౌఁగిలించికొని మందహాసముతో నేదియో యవ్యక్తముగ మాటలాడుచుండెను.

గోడలపై నలంకరింపఁబడిన ప్రతిపటంబునను సౌదామినీభీమరాజుల శృంగారచేష్టలు చిత్రింపఁబడి నిలువుటద్దములలోఁ బ్రతిబింబించుచుండెను. గోకర్ణుఁడు నిదానించి

చూచెను. నిజముగా నితఁడు భీమరాజేనా యని పశీలించెను. అతని కెట్టి సంశయమును కలుగలేదు. ముందున్న మోహనమూర్తి సౌదామినియేనా యని మఱలఁ బరిశీలించెను. క్రమ్మఱఁ బరిశీలించెను. ఒక భీమరాజు, ఒక సౌదామిని కాదు. భ్రమించితినను కొనుటకు దర్పణములలో భీమరాజసౌదామినులు, తల్పమున భీమరాజసౌదామినులు, చిత్తరువున భీమరాజసౌదామినులు, చిత్రమున భీమరాజసౌదామినులు. గోకర్ణుఁ డీ ఖ్రిదర్శనసందర్శనమున నిశ్చేష్టుఁడై పోయెను. అతనిహృదయమున భావనాశక్తి, యుక్తాయుక్తవివేచనము నశించెను. తన హృదయస్థమగు ననుమానము నిజమయ్యెను. క్షణము నీ పటులె యచేతనుఁడై నిలువఁబడెను. సౌదామినీ! సౌదామినీ! నీవుమాతృదేవివి. నీకళంకచరిత్రము భారతదేశమున . నాచంద్రార్కస్థాయి కాఁగలదు. భీమరాజా! కేవలము మోహావేశమునఁ బశుధర్మమవలంబించియున్నాఁడవు. పరలోకమున నీవొందు పాటులు భారతవ్యక్తికి జనించిన యే పాపాత్ముఁడును బొందఁజాలఁడు. ఛీ! ఛీ! ఈపాపపంకమున నే నింకఁ బడియుండఁజాలను. నే నిదియ కందూరుసంస్థానమున కేగుచున్నాఁడ. ఈ పాపపుజరిత్రము గాంచి నీ సంస్థానమున వసింతునేని మీ పాపములో నాకును బాలువచ్చితీరును. మీ దుశ్చరిత్రము దేశదేశములయందు శాశ్వతము కాకపోదని గోకర్ణుఁడు విలాసమందిరమును దాటి, బయటికి వచ్చి యంధకారమున నెటో వెడలిపోయెను. భీమరాజు, సౌదామినియు నాత్రముగఁ బర్యంకము వదలి గోకర్ణా! పోయిన నొట్టు సుమా! క్షమింపుము. విన్నపము నాలింపు'మని

యంధకారమున కభిముఖులై విలాసనిలయము వీడి బయటికి వచ్చిరి. భీమరాజా యంధకారమునఁ దిరిగితిరిగి గోకర్ణునిఁ బిలిచి పిలిచి వేసారి సౌదామినిని కౌఁగిలించుకొని 'సోదరా! గోకర్ణా! క్షమింపుమని బతిమాలెను. నేను సౌదామినినని యాయమ తొలంగి మఱల గోకర్ణాన్వేషణమునకు బయలు వెడలి వెదకి వెదకి, భీమరాజును బట్టి గోకర్ణా! 'గోకర్ణా! క్షమింపుము క్షమింపు'మని బతిమాలదొడంగ నాతఁడు తన నామ మెఱింగించి తొలంగిపోయెను. ఇటులు రాత్రి యంతయు నుభయులు జాగర మాచరించి మత్తు వదలుటచేఁ దెల్లవారునరికి నెవరి గమ్యస్థానములకు వారు చేరిరి. ప్రతినిమిషమునకును గోకర్ణునికఠిన వాక్యము లశనిఘాతములవలె నా యుభయుల హృదయములలో వేదనఁ గలిగించుచుండెను. మాటిమాటికి సహజసౌమ్యమగు గోకర్ణుని ప్రేమమూర్తి వారి హృదయములలోఁ బ్రళయరుద్రావతారమువలెఁ గానఁబడుచుండెను.



# ఏడవ ప్రకరణము.

సౌభాగ్యవతి భీమరాజున కేకాత్మజ. ఆ యమకుఁ బదు రెండు సంవత్సరముల వయస్సుండవచ్చును. గోకర్ణునియొద్ద జనవుగఁ దిరిగియుండుటచే సహింస, సత్యవ్రతము, సర్వసమత్వము నీ యమకు సహజగుణము లయ్యెను. గోకర్ణునివలె నీయమసైతము భీమరాజుదుర్గుణములఁ బలుమా అసహ్యముతో సేవగించుచుండును. భీమరాజునకుమాత్రము పుత్రికపై నంతగాఁ బ్రేమభావముగాని, ద్వేషభావముగాని లేదు. సామినితో నేల యైకమత్యముగ నుండవనిమాత్రి మామెను పలుమాఱు మందలించుచుండును. సౌభాగ్యవతి ప్రత్యుత్తరము చెప్పక తండ్రియొద్దనుండి తొలంగిపోవుచుండును.

గోకర్ణుఁడు వర్ధమానపురము వదలి కందూరున కేగి కొన్ని వత్సరములు గడపెను. ఆయన వర్తమానము తెలియుట లేదు. కొంద ఱాతనినిగూర్చి తెలిసికొనవలయునని యాతుర పడుచుండిరి. వర్ధమానపురమున ననేకవిధములగు ప్రవాదములు కలవు. మహాదేవరాయలతో హనుమకొండ కేగెనని కొందఱు, భీమరాజుచేఁ గారాగారమున బంధింపఁబడెనని కొందఱు, మరణించెనని మఱికొందఱు, చెప్పుకొనుచుండిరి. ఈప్రవాదములన్నియు సౌభాగ్యవతి యాలించెను. ఇందేదియు నా యమకు విశ్వసనీయముగఁ దోఁచుటలేదు. గోకర్ణుఁడు కానరాకుంటకు నీ ప్రవాదము లన్నింటికి సంబంధించిన వేఱు కారణ ముండియుండు నని యాయమ తలంచెను. అంతటితో

నాయమహృదయమున కూఱట కలుగలేదు. భీమరాజు చండశాసనముచే నఱచేతులలోఁ బ్రాణము లుంచుకొని కాలక్షేపము చేయు సాధువులగు పౌరుల కీ యంశము విచారింపఁ దగిన స్వాతంత్ర్య మెక్కడిది?

సౌభాగ్యవతి గోకర్ణునివృత్తాంతముఁ దెలిసికొనఁదలంచి చెలికత్తెయగు మంజరికొఱకు వర్తమానముఁ బంపెను. కాని మంజరి యెంతసేపటికిని రాదయ్యెను. సౌభాగ్యవతికి జ్ఞానము రాకముందే యాయమకు మాతృవియోగము సంభవించెను. గోకర్ణుఁ డా బాలికను మిగుల గారాబముతోఁ బెంచెను. నిన్న మొన్నటివఱ కాయమ గోకర్ణుని నాన్నా! యని పిల్చుచుండెడిది. తరువాతఁ దోడిబాలికలవలనఁ దాను భీమరాజుపుత్త్రిక నని తెలిసికొనెను. నేఁటికిని గోకర్ణుని సౌభాగ్యవతి నాన్నాయని పిల్చుచుండును. భీమరాజు పలుమాఱు మందలించి సౌభాగ్యవతి కెన్నిమాఱులో గోకర్ణునితో నంతగాఁ జనవు వలదనియుఁ నతఁడు రాజద్రోహపరాయణుఁడనియు బోధించెను. పరిశుద్ధాంతఃకరణురాలగు సౌభాగ్యవతి యా బోధనమును పెడఁజెవినిబెట్టి తండ్రియాజ్ఞను ధిక్కరించెను. భీమరాజున కీసందర్భమునఁ గుమారితపైఁ గఠినభావమేర్పడెను. సౌభాగ్యవతి హృదయ మీ యదనుననే గోకర్ణుని పవిత్రాంతఃకరణముపై నాధారపడెను. సౌభాగ్యవతి ప్రతిసాయంకాలమున నుపవనమున కేగుచు గోకర్ణుని సందర్శించు నాచారము కలదు. ఆయన యెచటి కేగుచున్నను గుమారికిఁ దెల్పి యాయమయాన నొంది నియత కాలమునకు వచ్చు నాచారము కలదు. గోకర్ణునకుఁ

ప్రయాణావశ్యకత యున్నట్లు మున్నెన్నఁ డాయమ వినియుండ లేదు. రాజ్యవ్యవస్థలు సాకల్యముగఁ దిలకించుచున్న సౌభాగ్యవతికి గోకర్ణుఁడింత కాలము కానరామికి విపరీతభావములుకలిగె ననుటలో నాశ్చర్య మేమి కలదు? గోకర్ణుఁడు సౌభాగ్యవతికిఁ బినతండ్రియే కాదు, జనకుఁడు, దేశికుఁడు, మిత్రుఁడు. కానసే భక్తిశ్రద్ధలు. కానసే యీ యాందోళనము.

మంజరి వచ్చువఱకు సౌభాగ్యవతి జినేంద్రపురాణము నుజదువుచుండెను. అందు వాగీంద్రచూడామణి యొనరించిన మతవ్యాఖ్యక్రము, జిన దేవునియాదర్శములు గల ఘట్ట మనిన నాయమ కెంతయో యభిమానము. హృదయమున శాంతి లేనపుడామె తఱచుగ నాగ్రంథమును బఠించుచుంట కలదు. నేఁడు గోకర్ణునివృత్తాంతము తెలియమిచేతను, మంజరి ప్రియభాషణముల కెడమగుటచేతను జినేంద్రపురాణపఠనావశ్యకత సంభవించెను.

మంజరి మెల్లగ వచ్చి సౌభాగ్యవతిని దర్శించెను. ఆయమ యాందోళనమును గ్రహించెను. ఈ హృదయావేగమున కంతకు గోకర్ణుని వర్తమానము తెలియకపోవుటయే హేతువని యామె యూహించియుంటచే 'సోదరీ ! గోకర్ణచక్రవర్తిగారి వృత్తాంతము తెలియదయ్యెను. ఆ విషయమై విచారించుచుంటచే నారాక కాలన్యము జరిగినదని మంజరి వాకొనెను. సౌభాగ్యవతి, మనస్సులో మాటిమాటికి మంజరివలన శుభవర్తమానము వినవచ్చు నని తలంచుచు శాంతించెఁ గాని యీయమ శాంతి భగ్నమయ్యెను. ఆశాలత వాడిపోయెను.

సౌభాగ్యవతి రాజ్యస్థితిగతు లెఱుంగని ముద్దరాలు కాదు. మంత్రకూటారణ్యమున జరిగిన సహగమనము మొదలు కథాంశమంతయు నీయమ యెఱింగియే యుండెను. కాననే యింత యాందోళనము. విద్యావిషయములోఁ జాల సంశయములు గోకర్ణునివలన వారించుకొనవలసిన యావశ్యకత కలదు. తన భవిష్యజ్జీవితనౌకను సంసారసముద్రమునఁ ద్రిప్పఁగల నావికుఁడా గోకర్ణుఁ డొక్కఁడే. ప్రపంచవ్యామోహము నెఱుంగని సౌభాగ్యవతికిఁ గరుణారసస్వరూపుఁడగు గోకర్ణుఁ డొకఁడే సర్వస్వము. అతఁడే శ్రేయస్కాముఁడు.

మంజరి తనదూరదృష్టి నంతయు వినియోగించి గోకర్ణుఁ డేగినది గరుడపంచమినాఁ డని గ్రహించెను. నాఁటిరాత్రి విలాసభవనమువైపు పోవుచుండెనని యా భవనపాలకులు దెల్పిరి. ఈ రెం డంశముల నూఁతగాఁ గొని గోకర్ణుని జీవితము గ్రహింపవచ్చునని మంజరి యూహించెను. ఊహాపర్యవసాన మొకతఱిఁ బ్రమాదమైనఁ గావచ్చునని యామె తలంచెను. సౌభాగ్యవతి నీ రెండుసాధనములతో నోదార్పవచ్చునని నమ్మెను. మంజరి గ్రంథపఠనము ముగించి తనవైపు తిలకించు చెలితో 'సఖి! గోకర్ణుఁడు గరుడపంచమినాఁటి యుదయమునుండి మన కగుపడుటలేదు. ఆ వెనుకటిరాత్రి మాత్ర మాయన విలాసభవనమువైపు పోవుచున్నటులఁ దెలిసిన దనెను. సౌభాగ్యవతి హృదయమున నొకవిధమగు శాంతి కలిగెను. ఈ యుభయాధారములతో గోకర్ణుని వృత్తాంతముఁ దెలిసికొనవచ్చునని యామె తలంచి మంజరితోఁ 'చెలీ! విలాస

భవనమున కేగుదము రమ్ము. అచట మన కుపయుక్తములగు సాధనములు లభింపవచ్చును; లేదా, నిర్బంధితుఁడై యున్నచో నాతని దర్శించి కృతార్థులము కావచ్చునని చెప్పి యిరువురును నీలవస్త్రము నవకుంఠనముగఁ దాల్చి చీఁకటులు పెచ్చరిల్లని యా ప్రదోషసమయమున నంతఃపురమువదలి యొకకాలిబాట ననుసరించి వెడలిరి. చెలులజంట యెట కేగ సంకల్పించెనో దానిని విలాసభవన మని, విలాసమందిరమని వ్యవహరింతురు. నేఁడు విలాసభవనము దీపికాశూన్యమై యంధకారమునకు రక్షకస్థానముగ నుండెను. అగ్రభాగమున మొలచిన యొక జువ్విమొక్క నాశ్రయించి ఘూకసతి మధ్యమధ్య నుచ్చైస్స్వరముతో నభాగ్యదేవత నాహ్వాన మొనరించుచుండెను. మంజరియు, సౌభాగ్యవతియు విలాసభవనమును సమీపించిరి. గవాక్షమునుండి మినుకు మినుకుమను దీపము వెలుఁగు కానబడుచుండెను. వయస్సుచెల్లినయొక పరిచారకుఁడు గృహముచెంత నున్న యొకపూరిగుడిసెలో నివసించుచు నటఁ గాచికొని యుండెను. వృద్ధుఁడీ యువతుల నిరువురఁగాంచి కఠినస్వరముతో నెవరు మీరు? ఇచటకేల వచ్చితిరని ప్రశ్నించెను. మంజరి మిగుల జాణ. వృద్ధునితో నించుక తర్కించి కథాంశము నెఱుంగఁదలంచి 'యేమయ్యా! రాకూడదా? ఏల గద్దించుచున్నారు. రావలసియే వచ్చితి' మని పల్కెను.

ఆఁ రాకూడదు. పెద్దదొరవారి యంతఃపురము వారు దక్క నితరులు రాకూడదు. ఇది జవదాటిన శిరశ్ఛేదనమే.

నీకా!

నా కేల? దొరవారియాన జవదాటిన పొగరుబోతులకు.

మంజ:—గోకర్ణుఁడు దొరవారు వచ్చిరిగదా! వారి నేమి చేసిరో మమ్ము నంతియు చేయుదురు. మేము బాటసారులము. మిగిలి వచ్చితిమి. ఈరేయి నిట విశ్రమించితీరెదము.

గోకర్ణు నిట రానిచ్చినందులకుఁ బెద్దదొరవా రిద్దఱు భటుల కురిశిక్ష వేయించినారు. ఆ రాత్రి గోకర్ణుండు చిక్కినట్లైన వాండ్రతోఁబాటు జరిగియుండెనదే?

అంతవఱకు వచ్చిన మేమును దప్పించుకొని పోవుదుము. చచ్చువాఁడవు నీవే! నీవడ్డుపెట్టిన మే మాగుదుమా?

ఆగకున్న మి మ్మేమిజేసినను నన్నాటంకపఱచువారు లేరు.

మంజరి, వృద్ధుఁడు నిటుల భాషించు సమయమున సౌభాగ్యవతి విలాసమందిరములోనికిఁ బ్రవేశించి నాలుగువైపులఁ దిలకించెను. అం దొకపర్యంకముపైఁ గొన్ని వాడిన పూలచెండ్లు నొకలేఖయుఁ బడియుండెను. ఒకచెండును, లేఖను జేకొని ప్రసంగమధ్యమున సౌభాగ్యవతి బయటికి వచ్చెను. మంజరితో వృద్ధుఁ డిటులఁ జెప్పుచుండెను.

"అయ్యా! మనస్సులో నుంచుకొనఁదగిన రహస్యము బైటపడిన మాకంతములు పోవును. ఇప్పటికి నా కెనుబది సంవత్సరములు నిండవచ్చినవి. ఇఁక నైదాతేదులకంటె నెక్కుడు

కాలము జీవింపను. జీవితశేషమునిటులె గడపితినా కృతార్థుఁడను." నాకేల యిబ్బంది కల్పింతురు. మీతోఁ బ్రవను మీరు పొందు.

సౌభాగ్యవతి యులికిపడి "మంజరీ! ఏమి యప్రియము విని యుండవుగదా! బాబుగారు కుశలముగ నున్నటులెగదా! వెలవెల బోవుచున్నావేమి? చెప్పవా?" యనెను.

మంజరి కొంచె మాగి 'యమ్మా! యీ ప్రసంగము నీ సాక్షిగ మీ బాబయ్యగా రగు గోకర్ణునకు సంబంధించినది కాదు. గతానుగతికతచే లోకాభిరామాయణములోనికి దిగితిమి. ప్రసంగమధ్యము నీ వాలించుటచేఁ బూర్వోత్తరసందర్భములు తెలియక భ్రమపడితివి. బాబయ్యగారు కందూరునకు వెళ్ళినటు లొక ప్రవాదము కలదనియు, సత్యమని విశ్వసింపవచ్చుననియు వృద్ధుఁడు వాకొనుచున్నాఁ డని మంజరి వాకొనెను.

సౌభాగ్యవతి మంజరితోఁ 'జెలీ! ఏల వృద్ధునకుఁ జిక్కుఁ దెచ్చిపెట్టి రాజశాసన ముల్లంఘింపవలయును? ఇంత పట్టనములో విదేశీయులమగు మనయిరువురకుఁ దల దాఁచుకొన నెలవు లేకపోవునా?' అనుచు రెండుమూఁకలు వృద్ధున కొసంగి యిరువురు యువతులా యంధకారగర్భమున నంతర్హితలై నిజమందిరమున కేగ సంకల్పించుకొనిరి.

---

# ఎనిమిదవ ప్రకరణము.

ఏ గృహమునుండి కారాగృహమునకు మహాదేవ రాయలు చేర్పఁబడెనో దాని నానందనిలయ మని కొందరు వ్యవహారింతురు. సౌభాగ్యవతియు, మంజరియు నానందనిలయ హార్మ్యమునఁ జేరిరి. గవాక్షము లన్నిటిని దెఱచి విశాలమగు నాగృహమధ్యభాగమున నొకపీఠముపై నిరువు రాసీనులై యొక తాళీదళలేఖను బరిశీలించుచుండిరి. అందలి వర్ణములు స్ఫుటముగాఁ గానవచ్చుటలేదు. క్రిమిదష్టభాగము లెక్కుడుగ నుండుటచే వర్ణనిర్ణయము సాధ్య మగుటలేదు. ఉభయులు జాగరూకతతో నాలేఖ నంతయుఁ బరిశీలించిరి. "వసుంధరయు గోకర్ణుఁడు" అను వర్ణములు మాత్రము పోల్చుకొన వీలుగ నుండెను. లేఖపైఁ "బాలవాస" యను వర్ణములు ద్యోతకము లగుచుండెను. భ్రష్టములగు వర్ణములకు మాఱుగ నూతన వర్ణములఁ జేర్చి కడ కిటుల బఠించిరి.

"పాలవాస దేశాధీశ్వరునకు—వసుంధరయు గోకర్ణుఁడును వధ్యులు. వాగ్దానమును జెల్లించుభారము నీపైఁ గలదు.

—సౌదామిని."

లేఖఁ జూచినవెంటనే మంజరీసౌభాగ్యవతు లులికిపాటు నొందిరి. కాలచక్రముఁ ద్రిప్పుచున్నది సౌదామినియే యని సతు లిరువురు తెలిసికొనిరి. ఇంతవఱకు సామాన్యముగఁ దలంచుకొనుచున్న సౌదామినిని మృత్యుదేవినివలెఁ దలంపవలయు

నని యిరువురును నిశ్చయించుకొనిరి. తమ జీవితములు సైతము ఏనాఁటికేని సౌదామినీహస్తగతములని వారికి గట్టిగఁదోఁచెను. మంజరి సౌభాగ్యవతితో 'సఖీ! విచారింపవలసిన యగత్యము లేదు. ఏలయందువా? తమయుద్దేశప్రకారము మీాజనకుఁడు, సౌదామినియు నీలేఖ నంపలేదు. పాలవాన దేశాధీశ్వరున కీ జాబు చేరలేదు. చేరినచో వసుంధర యిదివఱకె కడతేఱి యుండును. దానినిబట్టి గోకర్ణుఁడు సైత మట్టి విపత్ప్రాప్తి నొందెనని నిశ్చయింపవలసివచ్చెడిది. నిన్నటి దినముననె కందూరురాజ్యమున వసుంధర క్షేమముగా నున్నదనియు, వర్ధంతి జరిగినదనియు, నొకపరిచారిక చెప్పిన'దని వాకొనెను.

సౌభాగ్యవతి:— ఓహో వసుంధరయనఁ దైలపదేవుని పుత్త్రియా? కందూరురాజ్య యువరాజ్ఞియా? గోకర్ణుఁడు సైతము కందూరురాజ్యముననే యుండియుండవచ్చును. ఈ లేఖను మనవాండ్రు వ్రాయుటకు ముఖ్యసంకల్పము వసుంధరా గోకర్ణులు కందూరులో నున్నారు. వధించుట సులభమనియే. నేఁడు గాకున్న నిట్టి విపరీతావస్థ స్వల్పకాలమున కేని వారికిఁ బ్రాప్తించితీరును. సఖీ! కర్తవ్యమెద్ది?

'ఇఁకనె మనము కనుగలిగి మెలఁగవలయును. పాల వానలో మన గూఢచారి నొకని నుంపవలయును. మన రాజ్య మున నెప్పుడే మంత్రాంగము జరుగునది తెలుపుట కొక సత్య వ్రతుని నియమింపవలయును. వసుంధరపై, గోకర్ణునిపై-జనకు నకు- సౌదామినికి, ద్వేషము మెండైనది. గోకర్ణుని యొక

స్నికవిపత్తుల వారించితిమా వసుంధర కెట్టియాపదయు గలుగఁ జాలదు. ఇదియె మన కాచరణీయము.’

ఇట్లు సంభాషించు నంతలో నటకు సౌదామిని చేరెను. ఆ యమకు ముప్పదిసంవత్సరముల వయస్సుండవచ్చును. సౌదామినీసందర్శనమున నానతు లిరువు రులికిపడిరి. ఒకరిమొగ మొకరు చూచుకొని తెల్లఁబోయిరి. సౌదామిని యా యిరువురి ముఖములు తేటపాఱఁజూచెను. ఇరువు రేదియో వస్తుమూద మొనరించి చలించుచున్నటుల నాయమ గ్రహించెఁ గాని యభిప్రాయము మాత్రము వ్యక్తము చేయలేదు. సౌదామిని మిగుల ప్రౌఢ. కాననే హృదయస్థమగు భావము సాధారణముగ ముఖమునఁ బ్రదర్శితముకాదు. ఇదియుఁ బరవంచనమున కొకసాధనమె.

సౌభాగ్యవతీమంజరుల చంచలభావము గనిపెట్టి సౌదామిని యనుమానించెను. తాను వచ్చినపని తెలుపుట కదియె తరుణమని తలంచెను. నతు లిరువురను జూచుచు సౌదామిని యిటుల వాకొనెను. “మొన్ననేకదా భీమరాజు సౌభాగ్యవతి చిత్రపటము వ్రాయించినది. అది యీ యానందభవనమున నుంపఁబడినదని భీమరాజు సెలవిచ్చుచున్నాఁడు. అదిగో! ఆ పటములమధ్యఁ గల యంతరముననే యా రూపపటము నెలకొల్పఁబడినది. కొలఁది దినముల క్రిందివఱ కది యిటనే యున్నటులఁ బరిచారికలు చెప్పుచున్నారు. ఇంతలో నది యదృశ్యమగుటకు సౌభాగ్యవతియో, మంజరియో లేక, యాయుభయులకు సంబంధించిన మఱియొక వ్యక్తియో హేతువై యుండు

వని దూరదృష్టిగలవా రూహించుచున్నారు. ఇందు మీయభి
ప్రాయ మేదియో తెలిసికొనుటకై భీమరాజు పక్షమున వచ్చి
తిని. సత్యముఁ జెప్పి ప్రాణములఁ గాపాడుకొండు."

సౌభాగ్యవతీ మంజరులు నిరుత్తర లైరి. రూపపట్టము
లేనిమాట సత్యమె. సౌదామిని సంభాషణమున కనేకాంత
రార్థములు కలవు. దానికి భావము వేఱు. అభిప్రాయము వేఱు.
ఏపాపము నెఱుంగ మని యా యిరువురు చెప్పనెంచిరిగాని
యది సౌదామిని విశ్వసింపదు. కాన మౌనమే ప్రత్యుత్తరము.
మంజరి మౌనముద్ర త్యజించెను. తెలిచి తలఁచి యడుగుచున్న
సౌదామిని నోరు నెటులేని మూయించి పంపవలయునని
యామె నిశ్చయించుకొనెను. సౌదామిని సామాన్యురాలు
కాదు. అదరింపులకు బెదరింపులకుఁ బాపమునకు జంకునది
కాదు. కడకు సౌభాగ్యవతిని మధ్యవర్తినిగ నుంచి వారిరువు
రిట్లు సంభాషించిరి.

ఆ పటము విషయమై మా కేమియుఁ దెలియదు. సౌభా
గ్యవతి నిజస్వరూపము నాకనులముం దున్నప్పుడు నాకుఁ బట
ముతో నేమి పనియుండును? అటులె తన స్వరూపపటముఁ
దిలకింపవలసిన యగత్యము మా సౌభాగ్యవతికిఁ గూడ లేదు.
దీని నెవరు వ్రాయించి యిటఁ బ్రతిష్ఠించిరో వారికె యిందు
కొద్దిగనో గొప్పగనో సంబంధ ముండియుండును.

'భీమరాజు తీయించెనందువా? నేనుదీయించితినందువా?
మా యిద్దరు రెగడా ఇప్పుడు దొంగలు?'

'నే నావిషయము నిపుడు నిర్ణయింపఁజాలను. కాని నీమాటలఁబట్టి చూడ మీ యిరువురిలో నొక్క రిందుఁ బాల్గొని యుందు రని వాకొన నాకెట్టి సంశయమును లేదు.'

'ఏమే! క్రిందుమీఁదు దెలియక భాషించుచున్న దానవు. నీకు, నాకుఁ గల యంతర మెఱింగి సంభాషింపుము. మమ్ము దొంగ లనిన నీనాలుక చీలికలుకాకున్న చూచెదను.'

'పరమున యముఁడు చీలికలె గావించునో యుప్పు పాతరలలో నూఱవేయునో చూచెదము లెమ్ము. ఈయధికార దౌర్జన్యములకే నేను వెఱతునా? పాపమునకు వెఱతును. ని న్నెఱుఁగను, నీపట మెఱుంగను. పొమ్ము.'

సౌదామిని కోపము మేరమీఱెను. కన్నులెఱ్ఱవాఱెను. పెదవులు కంపించెను. ముఖమున నెన్నియో విపరీతభావనలు ప్రదర్శితము లయ్యెను. మంజరి యీ పరివర్తనమును దిరస్కార దృష్టితో నొక్కమాఱు చూచి నవ్వెను. సౌభాగ్యవతి మంజరి ముఖముచూచి పక్కున నవ్వెను. సౌదామిని కోపాతిశయముచే నున్మత్తురాలయ్యెను. ఆ యున్మత్తావస్థలో దా నెవ్వతెయో యేవిషయ మెంతవఱకు భాషించెనో మఱచెను. సౌభాగ్యవతికి మంజరి కా సౌదామినీచర్య మిగుల నసహ్యాజనక మయ్యెను. ఇఁక నాయమతో సంభాషించిన నెటుల మాఱునో యని యాచోటు విడిచి యిరువురు వెడలిపోయిరి. సౌదామిని హృదయములో నిల్కడకుఁ దావులేదయ్యెను. కేతనపటాంచలము వలె నాయమహృదయ మదరుచుండెను. తాను సంపూర్ణముగ

సౌభాగ్యవతిచే, మంజరిచేఁ బరాభవింపఁబడితి నని తెలిసికొ నెను. పరాభవదుఃఖముకంటెఁ బ్రతిక్రియాలోచనమె యామెకు దుర్భరమయ్యెను. భీమరాజున కీయంశము నంతయు నెఱింగించి తగిన శిక్ష విధింపకున్నచో నాపేరు సౌదామినికాదని యామె ప్రతిజ్ఞయొనర్చెను. ఆ ప్రతిజ్ఞ శూన్యహర్మ్య మాలకించి ప్రతి ధ్వనితో మాఱుపలికెను. తన్నింకను మంజరి గేలిసేయుచున్న దేమోయని ముందునకుఁ జూచెను. మంజరీసౌభాగ్యవతు లాసీ నలైన స్థానము శూన్యముగ నుండెను. అట నొకచోఁ గొన్ని వాడినపూవులు, చెంత నొక తాళీదళము కానవచ్చెను. సౌదా మిని యా తాళీదళమును బరీక్షించెను. ఆ యమకుఁ గలిగిన వీరావేశమునకు మేరలేదు. విలాసమందిరమున కేగకున్న వీరల కీలేఖ యెట్లు లభించియుండును? మంజరియో, సౌభాగ్యవతియో విలాసమందిరమునుండి యీలేఖ దెచ్చియుందురు. లేఖకా దిది, కత్తి. ఈకత్తితో వీరిగొంతులు కోయకున్న నేను రాచపుట్టువు పుట్టలేదు. నన్నీ యుభయులు తిరస్కరించుటకీ లేఖయే ప్రథమకారణమైయుండును. మఱల వారిరువురు లేఖాన్వేషణ మునకు రాకముందె భీమరాజుచెంతఁ గథాంశము నివేదించి ప్రతిక్రియ చేయుటకు ముందంజ వేయవలయుననుచు సౌదా మిని లేఖతో హర్మ్యము వదలిపోయెను..



# తొమ్మిదవ ప్రకరణము.

సౌదామినిని వదలి సౌభాగ్యవతీమంజరు లొక క్రీడా సరోవరముచెంతఁ గూర్చుండియుండిరి. నాలుగువైపుల నాలు గున్నతములగు హర్మ్యములు కలవు. అందొకటి యాస్థానము మఱియొకటి యంతఃపురహర్మ్యము, వేఱొకటి రాజబంధువుల నివాసగృహము, ఇఁక నొకటి యానందనిలయము. ఈ నా లుగు హర్మ్యములమధ్యనున్న కమలాకరమే మన కథానాయ కుల కాశ్రయమైనది.

ఆ వికచారవిందముల యందము, ఆ సరోవరనిసర్గ రామ ణీయకము, ఆ జలవిహంగముల క్రీడనము లీయువతీయుగ్మ మును దనియించుటలేదు. సృష్టియందలి ప్రతిమనోహరవస్తువు వారి యాలోకనమునకుఁ బాత్రమగుటలేదు. వారు చర్చించు విషయము చదువరు లెఱింగియుందురు. సౌదామిని దుర్ణ యముకంటెఁ జర్చనీయాంశము వారి కేమి కలదు! భీమరాజు సౌభాగ్యవతి చిత్తరువును వ్రాయించినది మంజరి యెఱుం గదు. సౌభాగ్యవతి యంతకుమున్నె యెఱుంగదు. చిత్రనిర్మా ణము నెఱుంగని యువతు లెటుల హరింపఁగలుగుదురు? ఏపాపము నెఱుంగని యీ యువతులకు వేఱుభయము లేదు గాని, సౌదామిని కఠినస్వభావురాలు. భీమరాజున కంతరంగస్థా నము. ముం దెట్టియిక్కట్టులు సంభవించునో యనునదియె వారల భయకారణము. ఎన్నివిధముల యోజించినను చిత్తరు

వెవరు హరించియుందురను ప్రశ్నకు సదుత్తరము తోcచ దయ్యెను. ఇది భీమరాజుసౌదామినుల కృత్రిమమై యుండదని సతులిరువురు గమనించిరి. ఎన్నివిధముల యోజిరిచినను వివాద బీజము వారికి గోచరింపదయ్యెను. చిత్రపటము వ్రాయించు టయు, నది కానరాదని వెదకుటcయు బొలవాసదేశాధీశ్వరితో మంత్రాంగము లాచరించుటయు, సౌభాగ్యవతి కనుమానా స్పదములుగా నుండెను. ఏదియో పరిణయ ప్రయత్నములె యీ యన్వేషణమునకు బీజ మని యిరువురు గ్రహించిరి. పొలవాసదేశాధీశ్వరుcడు సౌభాగ్యవతికి వరుcడను కింవదంతి చాలకాలమునుండి దేశమునం దంతటను బ్రాcకెను. భీమరాజు ప్రవాదము వినినపుడు "జనవాక్యం తు కర్తవ్యం" అని పలు మాఱు వాకొనినటుల మంజరి సౌభాగ్యవతికి నివేదించెను. గోకర్ణుc డీ ప్రవాదము వినినపుడెల్లc దీవ్రముగ ఖండించుచు నిట్టి తుచ్ఛదాంపత్యమునకుc జోళవంశీయు లంగీకరింపరని పలు మాఱు వాకొనుచుండెను. సౌభాగ్యవతికి, గోకర్ణుc డేనాcడు పొలవాస దేశాధీశ్వరుని నిరసింపసాగెనో నాcటినుండియె సంకల్పము దృఢపడెను. పొలవాస దేశాధీశ్వరునిపై నొక విధమగు ద్వేషభావ ముదయించెను. దీనిని బాపవలయు నని యానందభవనమునిండ నాతని స్వరూపపటముల భీమరాజు నెలకొల్పెను. నాcటనుండి యామె యా మందిరమునc గల చిత్రపటముల సందర్శించుటయే మానుకొనెను. కావుననే తన స్వరూపము నట నెలకొల్పుటయు, దాని నన్యులు హరిం చుటయు నా యమ కెఱుంగదు. మంజరి సౌభాగ్యవతికిc

బ్రతిబింబమె గాన నాయమయు నీయంశమున నపరిచితురాలె. చిత్రపటము నేలఁ యానందనిలయమున స్థాపించిరో, దానిని నెవరు హరించిరో తెలిసికొనవలయునని సతు లిరువురు నిశ్చయించిరి. వారికి యథార్థము గ్రహించుటకునై తము తగు నాధారములు ద్యోతకము లగుటలేదు. పొలవాస మండలాధీశ్వరునికొఱకు చిత్రపటము లిఖంచియుందురనియుఁ బిమ్మట దాని నితరులు హరించియుందు రనియు నిరువు రేకముఖముగ నిశ్చయించుకొనిరి.

సౌభాగ్యవతి పెదవి కొఱకికొని యాత్రముతో సఖీ! మఱచితిమిక దే. విలాసభవనమునుండి తెచ్చినలేఖను బ్రమాద వశమున నానందభవనమున విడచివచ్చితిమి. సౌదామిని చూచెనేని విపత్తు కలిగీఱును. ప్రతిక్రియ యేమి? విలాస భవనమున కితరు లేగరాదని మాతండ్రిగారు శాసించియున్నారు. శాసనాతిక్రమణము వారి కెట్టికోపమును గల్గించునో, సౌదామిని యెట్టి దుస్తంత్రముఁ బన్నునో యనెను. మంజరి చలింపలేదు. 'అమ్మా, సౌభాగ్యవతీ! ప్రమాదమె జరిగినది. తీవ్రభావమున నున్న సౌదామిని కీలేఖ మిగులఁ దోడ్పడఁ గలదు. మిగిలినదాని కేమి చేయఁగలము? మనము దాటి వచ్చినపిమ్మట నాలేఖను సౌదామిని గ్రహించియే యుండును. దానివలన రానున్న విపత్తునకు సిద్ధముగా నుందము. ముందు మనము యోజింపవలసిన దది కాదు. ఆనందనిలయముననీమధ్య నెవరేని వసించిరా! అం దెవరేని చిత్రపటములఁ బరిశీలించిరా. యను సంశయము మనకు విచారణీయము. సాధారణముగ

నట విడిసినవారి కాపటమువిషయ మంతయో యింతయో తెలిసియుండును. ఈ యంశము హార్మ్యసంరక్షకులవలన దెలియవచ్చును.' అని యుభయులు ద్వారముచెంత కేగిరి. అట నొక యువకుఁడు నిలిచియుండెను. మంజరి వానిని జూచి 'దామోదరా! మొన్నటిఫాల్గునమాసము మొదలుకొని యీ హార్మ్యసంరక్షకుఁడుగా నెవ రుండిరో తెలుపఁగలవా? రాజపుత్రిగా రీయంశము తెలిసికొనఁగోరి నాచే నడిగించుచున్నా' రనెను. దామోదరుఁడు, 'అమ్మా! గోకర్ణయ్య దొరవారును మలయవతమ్మగారును నీ మేడ విడిచి దాదాపు సంవత్సరముపయి గొన్ని నెలలైనది. నాఁటనుండి యిం దెవరును నివసించుటలేదు. కందూరునుంచి వచ్చినపిమ్మటఁ గొన్నిదినములు గోకర్ణయ్యగా రుండిరి. ఇంతలో హానుమకొండనుండి చక్రవర్తిగారి తమ్ముఁడుగారు దయచేసిరి. వారి కీమేడలో విడిది చేయుటచే గోకర్ణయ్యగా రారాత్రినుండి వెళ్ళిపోయిరి. అంతకుఁ దక్క నాకుఁ దెలియ' దని సవినయముగ వాకొనెను.

మంజరి దామోదరునితో—ఓయీ! ఇపుడు చక్రవర్తిగారి తమ్ముఁడుగా రెచట నున్నారు? నీ కేమేని తెలియునా?

దామోదరుఁడు మాఱుపలుకక వెడలిపోయెను. సౌదామినిశంక సకారణమైనదనియు, నాస్వప్నోపపటముతో యువకుఁడగుచక్రవర్తిసోదరున కించు కేనిసంబంధముండకపోదనియు సతు లిరువురు నిశ్చయించిరి. వారిదుర్బలమగు నాశాతంతువు బలపడెను. శూన్యహృదయమున శాంతిసమీరము వీచెను. మహాదేవరాయలు చక్రవర్తిసోదరుఁడని సతులిరువు రెఱుంగు

దురుగాని యాతని నెపుడును సందర్శించియుండలేదు. అతఁడీ సంస్థానమున కెన్నఁడు వచ్చెనో తిరిగి స్వదేశమున కేనాఁడు చేరెనో తెలిసికొనినఁ జిత్రపటకథ సంపూర్ణముగ నెఱుంగ వచ్చునని యిరువురు యువతు లూహించిరి. ఈయూహ సులభసాధ్యమైనది కాదు. దీనికిఁ గొంత దూరదృష్టి, దూరశ్రవణము కావలసియుండెను. సతు లిరువురు మహాదేవరాయ లెట నుండెనో తెలిసికొనినచో నాశాలత చివురించునని సంకల్పించుకొనిరి. ఆస్థానమునకో, వ్యవహారశాలకో యొక విచారకుని బంపి మహాదేవరాయ లెందుండెనో తెలిసికొనుటయే కర్తవ్యమని వారికిఁ దోఁచెను.

సంధ్యాకాల మయ్యెను. చిఱుమబ్బుతునుకలు వివిధ మనోజ్ఞవర్ణములతో నేత్రపర్వ మొనర్చుచు మనోహరముగ గానరాఁ దొడంగెను. ఆకాశమంతయు సరోవరమునఁ బ్రతిబింబితమై సంతోషజనకముగ నుండెను. సంజకావి దిగంతముల కెగఁబ్రాఁకెను. శుభ్రహర్మ్యములపైఁ బ్రతిబింబించు నాకావి చాయ యనిర్వాచ్యమనోజ్ఞముగఁ గానఁబడుచుండెను. శకుంతసంతతులు శాఖాగ్రములఁ జారుదీరి గీతికలఁ బాడసాగెను. ఈ ప్రకృతివిలసన మాయువతులహృదయము నాకర్షింపఁజాలక పోయెను. వారిభావదృష్టిలో సౌదామిని, గోకర్ణుఁడు, మహాదేవరాయలు కానవచ్చుచుండిరి. అవ్యవస్థమగు నాహృదయములకుఁ బ్రకృతిసౌభాగ్యముల సందర్శించి యానందించునంతటి నిల్కడ యెక్కడిదిః ఆలోచనలీనమగు హృదయమున కన్నియు శూన్యస్వరూపముశే.

దూరమునుండి యొకగానము వినవచ్చెను. స్త్రీలహృదయములు సుకుమారములు, ప్రకృతి పరవశములు, రసప్రలుబ్ధములు. వారిహృదయము నా ప్రకృతివైచిత్ర్యముకంటె గానామృతము త్వరగ నాకర్షించెను. ఇరువురిభావము లొకమాత్రె యీ మనోహరగానముతో నేకీభవించిపోయెను. ఇపుడు శౌన్యహృదయములతో సౌభాగ్యవతీమంజరు లొకచో నిలిచియుండిరి. క్రమముగ వారిరువురు తమ భావములేగిన త్రోవ ననుసరించి కొంతతడ వేగిరి. గానము బయలువెడలుచోటునకు, వారు నిలిచియున్న స్థానమునకు మధ్య నొకహర్మ్యముమాత్ర మడ్డుకలదు. సౌభాగ్యవతీమంజరు లటనుండియే గానామృతము చవి చూడవలసివచ్చెను. భావముల కున్న స్వాతంత్ర్యము బాహ్యాంగకములకు లే దయ్యెను. ప్రశాంతమగు నా సాయంసమయమున సౌభాగ్యవతీమంజరులు సాదరముతో నాలించు మనోహరగీత మిదియే.

ప్రణయముగ్ధాత్ములైన దంపతులమతులు
రసవశంవద మొనరించు రాగమేల
పాడకున్నావు? కోకిలా! పాడుమమ్మ!
రక్తపల్లవపుంజనీరంధ్రమైన
యంటుమామిడికై యేల యాసపడెదు?
వాగురలఁ బన్ని కనుచున్నవాఁడు బోయ
బాహ్యసౌందర్యముల కాసఁబడకు మమ్మ!
అంబురాశిని జనియించె హాలహలము
మెఱుపుఁదీఁగలయందు జన్మించెఁ బిడుగు

సౌఖ్యకరమైన మానసాస్థానమందె
భయద సంకల్పమొక వేళఁ బ్రభవమొందుఁ
గాలమును దైవమును తోడు కాదు కాదు
దూర మారయ సర్వంబు దుఃఖమయమె
తృప్తిఁగొనుమమ్మ నీమాతృదేశమందు
హింసయను ధ్వని యెల్లెడ నెసఁగుచుండ
జైనమతధర్మములు పరాస్తంబు లయ్యె.

గాత్రమాధుర్యముతోఁ గూడికొన్న యా ప్రశాంత గానము వినినంతనె సౌభాగ్యవతి పరవశురా లయ్యెను. ఆ యమ హృదయము రసప్రపంచమున నిర్మగ్నమయ్యెను. వీరశాంతరసములతోనున్న యా గీతిభావ మంతయు నాయమ కనులముందుఁ బ్రత్యక్షమయ్యెను. చెంత నొక రాజయోగి, కష్టసముద్రమున మునింగిన జీవితనౌకపై వసించి తరంగముల ఘట్టనముచే నిరాశ వహించియుండెనని గ్రహించి యా ప్రేమమూర్తిని, ఆ యానందస్వరూపుని, ఆ శాంతవ్రతుని సందర్శింపఁ దొందరపడెను. మంజరి, సౌభాగ్యవతియవస్థా విశేషము లన్నియు గమనించుచుండెను. ఆయమసరళహృదయమున సౌభాగ్యవతి చిత్తవికారములు ప్రతిబింబించుచునే యుండెను. సభలై స్వరము ననుసరించి యిరువురును, బాష్పముఖముగ నించుక సేపు పయన మొనరించిరి.

---

# పదవ ప్రకరణము

మంజరికంటె సౌభాగ్యవతి ముం దడుగు వేయుచు నడుచుచుండెను. ఎదుటనున్న హర్మ్యము నెక్కి వేఱొక మార్గమునుండి దిగిరి. వారికొక విశాలమగు మందిరము కాన వచ్చెను. అది యానందనిలయ మను హర్మ్యమునకుఁ గ్రింది భాగమని వా రెఱుంగరు. ఆ మనోహరగాన మా యావర ణమునుండి బయలుదేరినటుల నిశ్చయించుకొనిరి. కాని ద్వారము లన్నియు వేసియుండెను. నలువురుభటులు మాత్ర మా ప్రాంతములలోఁ గత్తులఁ బట్టికొని తిరుగుచుండిరి. భటుల యాకారములు, వేషభాషలు పరిశీలింప నీ మనోజ్ఞగానములకు వారి గాత్రములు జన్మస్థానములు కావని ద్యోతక మయ్యెను. గాత్రమాధుర్యమును మించిన భావసౌకుమార్యముగల యా గాన మే సుందరాకారుని ముఖముననుండి వెడలెనో పరిశీలింప వంత కంత కాయిరువురకు నుద్వేగ మతిశయించెను. ద్వారముల సమీపించి, యా స్వరమునకు జన్మస్థానము బరిశీలింపఁ దలం చిరిగాని వారి యుత్సాహమునకు ద్వారపాలుర నిర్బంధము సారెసారె కాటంకము గల్గింపవచ్చునని తోఁచెను. మంజరి యంతలో ద్వారపాలకులఁ జూచి రాజపుత్రికగారు విహార మున కిటకు దయచేసి యున్నారు. మీరు కొంచెము దూర మునకుఁ దొలఁగిపోవ సెలవైనదని వాకొనెను. ద్వారపాలురు భయాతురులై ' అమ్మా! ఇది కారాగృహము. దొరవారి సెలవు

లేనిది మే మీ చోటు విడిచిపోరాదు. కాని మీయాజ్ఞ జవ దాటరాని దగుటచే వెళ్ళుచున్నారమని దృఢమగు తాళములచే ద్వారములు బంధించి నలువురుభటు లా యావరణము దాటి దూరముననున్న గుమ్మములకడఁ జేరిరి.

మంజరీసౌభాగ్యవతులు గదు లన్నియు సందర్శించిరి. ద్వారముననున్న యినుపచువ్వలనుండి యే గదిని దిలకించినను నందు వెలుఁగు గానరాదయ్యెను. ఆ యంధకారమున నేవ్యక్తి యిమిడియున్నదో యా మనోహరగాన మే కారాగారభాగమునుండి బయలువెడలెనో నిర్ణయింప సాధ్యము కాదయ్యెను. ఇంతలో నొక గదిలోనుండి యించుక దీపఁపువెలుఁగు గవాక్షరంధ్రములనుండియు, ద్వారసంధులనుండియు వెలికిఁ బ్రాఁకెను. యువతు లిరువు రా ద్వారము నాశ్రయించి లోననున్న దీపము వైపునకు దృష్టిని బ్రసరింపఁజేసిరి. అట నొకవ్యక్తి వారలకు దృగ్గోచరమయ్యెను. మలినవస్త్రాచ్ఛాదనముతో, శిరోవకుంఠనముతో నున్న యా వ్యక్తి స్త్రీయో పురుషుఁడో నిర్ణయింప వీలుకాదయ్యెను. ఆవ్యక్తి దీపమున కభిముఖముగఁ గూర్చుండి ధ్యాననిశ్చలదృష్టితోఁ బురాకృతమునకు విచారించుచున్నటులఁ గానబడెను. ద్వారముననున్న యా యువతుల కా వ్యక్తి వెనుకభాగముమాత్రము కానఁబడుచుండెను. చెంత నున్న గోడపై నేవియో వర్ణము లా దీపపువెలుఁగునఁ గనవచ్చుచుండెను. దూరదృష్టి కా వర్ణస్వరూపములు వ్యత్యస్తములుగ నుండెను. దీపఁపువెలుఁగు సైతము స్ఫుటముగాఁ గనుపడుట లేదు. ఇంతలో నాసమీపమున మఱియొకదీపము వెలిగింపఁ

బడెను. దీపికాద్వయకాంతులచే నాగది యంతయుఁ బట్ట పగటివలె నుండెను. అవుడా గోడపైఁగల వర్ణముల మంజరి చూచి సహజగాత్రమాధుర్యముతో "మహాదేవరాయా! నీకీ కారాగారవాసము జన్మాంతమువఱకు భీమరాజుచే విధింపఁబడెనని పఠించెను. సౌభాగ్యవతి నిలువున నీరై పోయెను. చక్రవర్తి సోదరునకా మహాదేవరాయలకా యీ దుర్దశ యని యామె పరితపించెను. మహాదేవరాయల పవిత్ర నామ మాయమ వినియెయున్నది. ఏరాజపుత్త్రుఁడు మున్నా నందనిలయమున వసించెనో యాతఁడు నేడు కారాగృహమున దిక్కుచెడి పరితపించుచుండెను. ఇది భీమరాజొనరించిన దుండగ మని యాయము కా లేఖనమువలన స్పష్టమయ్యెను. మంజరి హృదయ మా వికటప్రదర్శనసందర్శనముచే నశాంతిసంకుల మయ్యెను. మహాదేవరాయలవంటిలక్ష్మీపుత్రునకా? ఈదురవస్థయని యాయమయుఁ బరితపించెను. ఆకూర్చున్న వ్యక్తి మహాదేవరాయలై యుండునా? యని యిరువురు యోజించిరి.

ఇంతలో నావ్యక్తి ద్వారమువైపున నందడి యగుట యేలయని ముందునకుఁ జూచెను. అది పురుషవ్యక్తియని సతులు తెలిసికొనిరి. ఆ విశాలనయనములీరు, ఆ విశాలమగు ఫాలభాగము, మొగలిరేకువలె మృదువుగ, సుకుమారశోభిత ముగ, సహజ మనోజ్ఞవర్ణాభిరామముగ నున్న శరీరముఁగల యా పురుషవ్యక్తి తప్పక హనుమకొండసామ్రాజ్యపాలకుని సోదరుఁడనియు, మహాదేవరాయలనియు నిశ్చయించిరి. పవిత్ర మగు నా యాకారము సందర్శింపఁగనే జనించిన యీ

యూహ కాదన నేరితరము? అతఁడు మహాదేవరాయలైనచోఁ గారాగారమున నుండ వలసిన దురవస్థ యేల తటస్థించె నను సంశయము వారి నంతగా బాధింపలేదు. ఏలయన వా రిరువురు బాల్యమునుండియు భీమరాజు దుర్మార్గజీవితమును దిలకించుచున్న వారే. కారాగృహాభిత్తిపై స్పష్టముగ వ్రాయఁబడిన యీ వర్ణసముదాయము మహాదేవరాయలు కారాగృహమున నిర్బంధింపఁబడినటుల బోధించుచునే యుండెను. చిత్రపటము కేల నూని సహజశాంతమును బ్రదర్శించు నుడువులతో, 'సౌభాగ్యవతీ! నీవు భీమరాజపుత్రివా? ముండ్లలో గులాబిపూవులు కలవు. రాళ్ళలో రత్నములు కలవు. సర్పఫణములపై మణిగణము కలదు. నీజనకుని దుర్వృత్తము నెఱింగిన నేను నావిజ్ఞానము వృథా యొనరించి నిన్నుఁ గఠినాత్మురాల వని వాకొనఁజాలను. నాజీవితచరిత్రము నీకు నివేదించితినేని కృతార్థుఁడ నగుదునేమో! నీవలన నాశూన్యజీవితము శాశ్వతముగఁ గవీశ్వరులు ప్రబంధములలో లిఖించు నదృష్టము ప్రాప్తించునేమో అని మహాదేవరాయలు తన్మయుఁడై విచారమున నేదియో యనుకొనెను.

సౌభాగ్యవతి యంతయు నాలించెను. అతఁడు మహాదేవరాయ లనియు, చిత్రపటము నీతఁడె సంగ్రహించెననియు దెలిసికొనెను. మంజరి ద్వారపాలకులు వచ్చుచుండిరేమో యని యవ్యవస్థచిత్తముతో నాలుగువైపు లరయుచు "మహాదేవరాయా! నీకీ కారాగారవాసము జన్మాంతమువఱకు భీమరాజుచే విధింపఁబడెను" అని బిగ్గఱగఁ బలికెను. మహాదేవ

రాయల ధ్యానము, సంకల్పబలము, ఆశాతంతువు, శాంతి ముద్రి యదృశ్య మయ్యెను. భీమరాజుయొక్క వికృతాకారము, గోకర్ణుని శాంతమూర్తి, యాతని దృష్టిపథమున కడ్డముగఁ బ్రదర్శితమయ్యెను. అంతలో నాస్వరూపద్వయ మదృశ్యమై యా స్థానముననే రెండుదివ్యమంగళవిగ్రహములు కానఁబడెను. సుస్వరూప సందర్శనముచే మహాదేవరాయలు ప్రకృతము మఱచెను. అతఁడు భ్రాంతుఁ డయ్యెను. తన హస్తమున నున్న సౌభాగ్యవతీప్రతిచ్ఛందము ద్వారమున నేల చేర్పఁబడెనని యాతఁడు సంశయించెను. హస్తమునఁ బ్రతిబింబము కలదు. ద్వారమున నొక ప్రతిబింబ మున్నటులె యాతఁడు కడకు విశ్వసించెను. విశాలములై సోగలు దేఱి నీలములగు కనీనికలు గల చూపులు, సహజసౌందర్య విభవాభిరామమై మనోజ్ఞముగ, రామణీయకముగ నున్న యాననము, పాండురచంద్రికాపూరమును బరిహసించు శరీరకాంతి, వినీలములు సహజకుటిలములు నగు ముంగురులు, పవిత్రలక్షణాభిరామముగ నున్న యునికిఁగల సౌభాగ్యవతి స్వరూపము మహాదేవరాయల కానందజనక మయ్యెను. కొంతసేపటివఱకు మహాదేవరాయలుగూడ చిత్రరువువలె నిలిచిపోయెను. క్రమముగ నాతని నిశ్చలవ్రతము సడలెను. సాధ్వీలక్షణోపేతము, సౌకుమార్య సౌందర్యమిళితము నగు మంజరీవదనము దర్శింపఁగనే మహాదేవరాయల సంకల్పము దృఢపడియెను. సతీయుగళమును జూచినంతనే మహాదేవరాయలు తాను స్వర్గమున నుంటిననియు, భీమరాజు తనపాపములకుఁ బ్రతిఫలముగఁ దీవ్రయాతనల నందుచుండె

ననియు, గోకర్ణుఁడు శాశ్వతసాయుజ్యము ననుభవించుచుండె ననియు, దేవతాపురంధ్రులు తనను సందర్శింపవచ్చిరనియు భావించెను. స్వల్పకాలమునకె తన్మనోయోజ్జనకములగు నీ వ్యర్థ భావన లన్నియు నంతరించెను. సౌభాగ్యవతిని మహాదేవ రాయలు సప్రేమముగ సందర్శించి, 'సుకుమారీ! యీ దీనుని కటాక్షింపకుము. సహజమృదుల మగు నీ హృదయము నేల వెతలపా లొనరించుకొందువు. మీ జనకుఁ డీ తరుణమున సందర్శించెనేని మీయిరువురి కెట్టి వెతయేని కలిగితీరు నని వాకొనెను. సౌభాగ్యవతి హృదయము నీరమ్యెను. చక్రవర్తి తరువాత చక్రవర్తియంతవానినోట భీమరాజు దుండగము చే బయలువెడలిన యా శాంతవాక్యములు హృదయమున కశని ఘాతములవలె నుండెను. తా నంతకుము న్నాలించిన గీత మంతయు నాయము కర్థ మయ్యెను. సౌభాగ్యవతి "మంజరీ! ఇఁక మనకుఁ గర్తవ్యము కలదా" యని వాకొనెను. మంజరి మహాదేవరాయలవలనఁ గొన్నియంశములు తెలిసికొనఁ గోరెను. సహజమగు వ్రీడాభావము నాయమ సరకుఁ జేయ దయ్యెను. పిమ్మట మంజరి మహాదేవరాయలతో మృదు మధురస్వరమున నిట్లు భాషించెను.

'ఆర్యా! నీకీ కారాగారవాసము నేల మా భీమరాజు విధించెనో దయతో సెలవిత్తురా?

'అమ్మా! నే నా విషయమునె చాలకాలమునుండి యోజించుచున్నాఁడను. కడకుఁ దన దుర్మార్గవృత్తిని దెల్పుట కని యెంచితిని. ఇం దెంతవఱకు సత్యముగలదో!

గోకర్ణుడు మీ కీ యవస్థ విధింపఁబడెనని యెఱుంగునా ?

'నేనె యెఱుంగను; ఇతరు లెటు లెఱుంగఁగలరు. యంత్రసాధనముచే ఆనందమందిరమున నున్న నా పర్యంకము క్షణములో నీ కారాగృహమునకుఁ జేరినది. నేను కనులు విప్పినప్పటికీ సౌభాగ్యాతురవం క్తి దృగ్గోచరమై భవిష్యజ్జీవితమును బోధించెను.

సౌభాగ్యవతి యెంత యన్యాయ్య మెంత యన్యాయ్యమని వేఁడి నిట్టూర్పువిడచి యామ్లానవదన యయ్యెను.

'సముద్రబంధనమున శ్రీరామునకు స్వల్పజీవములగు నుడుతలు సాహాయ్యపడిన వని వింధుము. ఈ స్వల్పవ్యక్తులవలన మీ కేమేని సాహాయ్య మావశ్యక మైన సెలవిండు. మా యునురు లొడ్డి మిమ్ము రక్షింతుము.'

'నే నేసంకల్పముతో వచ్చి యీ యవస్థకు లోనైతినో యీ లేఖయందు సాకల్యముగ లిఖించి యున్నాఁడను. సావకాశముగ నున్నపుడు పఠింపుఁడు. ఇపు డావశ్యక ధర్మ మొకటి కలదు. నా యవస్థ నెవరేని హనుమకొండ కేగి రుద్రదేవ చక్రవర్తికిఁ, గందూరున కేగి గోకర్ణునకు నెఱింగింప వలయును.

గోకర్ణుఁడు కందూరులో నుండెనని మీ రెటుల. నిర్ణయింపఁ గల్గితిరో యవకాశ మున్న సెలవొసంగుదురు గాక! మిగిలిన మేము నిర్వహింతుము.

'ఆ యంశ మంతయు నిందుఁ గలదు.

ఇంతలో ద్వారమున సందడి యయ్యెను. కొంతసేపటికి సౌదామినియు భీమరాజును కారాగృహాభిముఖులై రాఁ దొడంగిరి. మంజరి యది గ్రహించి యిది యంతయు సౌదామిని యొనరించు నిందజాలమే యనుచు మహాదేవరాయ లొసంగిన లేఖనుఁ మెల్లఁగ సౌభాగ్యవతి కొసంగెను. ఆయమ దానిని చీరెచెఱంగున బంధించి మహాదేవరాయలను సప్రేమముగ సందర్శించి సెలవాయని ప్రార్థించెను. ఆ వినయమధురమును, ప్రేమరసముగ్ధమును నగు సౌభాగ్యవతిరూపము మహాదేవరాయల హృదయమున హత్తుకొనెను. ఆ యదనున మహాదేవ రాయల ముఖమునఁ నొక మందహాసము కందళించెను. ఇరువురి హృదయములు క్షీరోదకన్యాయముగఁ గలిసిపోయెను. 'సతీ! నీపతిచ్ఛందముతో జీవితము నీ కారాగృహమున గడుపనున్న నన్ను గ్రహింతువుగద!' యని మహాదేవరాయలు వచించెను. నిరుత్తరయై సౌభాగ్యవతి నిలిచియుండెను. మంజరి కెట్టి యూవేశమును లేదు. ఆయమదృష్టియంతయు నరుదెంచు భీమరాజుపై, సౌదామినిపై లగ్నమొనరించి యటు చూచుచుండెను. మంజరి - మెల్లఁగ, - 'సౌదామినియు, భీమరాజును వచ్చుచున్నారు. మనము పోవుదము రమ్మ' అని సౌభాగ్యవతిని హెచ్చరించెను. అంతలో 'నోహో సౌభాగ్యవతీమంజరులా! విలాసనిలయమునుండి కారాగారమును బరిశీలింపవచ్చిరి కాఁబోలును? ముందు మహాదేవరాయలతో భాషించి పిమ్మట వీరివృత్తాంతము కనుఁగొనవలయు' నని భీమరాజు వాకొనెను. 'అంత కాంత మేల? ముందె వీరల

వృత్తాంతము తెలిసికొనరాదా? కారాగృహమున నున్న మహా దేవరాయ లెటకుఁబోవు నని సగర్వముగ నత్యాతిశయముతో సౌదామిని వాకొనెను. మంజరీసౌభాగ్యవతులు మెల్లగ నట నుండి వెడలిపోయిరి.

---

# పదునొకండవ ప్రకరణము.

సౌదామినియు, భీమరాజును గారాగృహద్వారము చెంత నిల్చి చూచుచుండిరి. మహాదేవరాయలు ముందునకుఁ జూచి 'వర్ధమానపుర దౌర్భాగ్యరాశియగు భీమరాజా? ఛీ! నీ వంతఃపురములో విషయలంపటుఁడవై బ్రతుకవలసినవాఁడవు. తగుదు నని తలచూపవచ్చితివా? 'యని కరవాలమును ఫినరివైచెను. వేగవశమున నది ద్వారబంధమునకుఁ దాఁకి రెండు తునియ లయ్యెను. సౌదామిని "ఓరి ఘాతుకుఁడా! బంధితుఁడ వయ్యు నిటుల విజృంభించుచున్నాఁడవే! స్వేచ్ఛగ నున్న నీదుండగమునకు మేరయుండునా?" యనెను. భీమరాజు భయభ్రాంతుఁడై కరవాలము తనకుఁ దగిలిన దనియనుకొనెను. అతని నిబ్బర మంతయు సన్నగిల్లెను. ఆత్మసంరక్షణమె యతని కాచరణీయముగఁ దోఁచి గృహాభిముఖుఁ డయ్యెను. సౌదామిని బిగ్గఱగ 'ఆర్యపుత్రా! పోకుము పోకుము. దొంగ పట్టు పడినాఁడు. సౌభాగ్యవతి ప్రతిచ్ఛంద మీతనియొద్దనే కాన వచ్చుచున్నది. రమ్మురమ్మని పిలిచెను. భీమరాజు తిరిగి చూచి సౌదామినీ! ప్రాణమునకుఁ దెగించిన యీ బంధి

తునితో మనకేమి పని? చిత్రపట మొసంగినందులకు, మహా దేవరాయలతో భాషించినందులకు మంజరీసౌభాగ్యవతులు దోషిణులై యున్నారు. వారల దండింపవలయునుగాని శిశు తునితో మనకేమి పని?' యనిభీమరాజు పోవుచునేయుండెను. మహాదేవరాయా! నీగతి యిఁకముం దున్నది. సౌభాగ్య వతిని గామింతునని మురియుచున్నావు కాఁబోలును. నీవు కామించునది మృత్యుదేవతనే! "రాజద్రోహమునకుఁ బాల్ప డుచుంటివిగా?" యనుచు సౌదామిని మహాదేవరాయలు చెప్పు ప్రత్యుత్తరమునేని వినక భీమరాజు పదాంకముల ననుసరించి నిర్గమించెను.

సౌభాగ్యవతియు, మంజరియు సౌదామినీభీమరాజుల కంటెఁ జాల ముందు బయలుదేరి యొకమందిరమునఁ జేరిరి. వారిహృదయములలో ధైర్యమునకుఁ దావు లేదు. భీమరాజు వలనఁ దమ కాపద నిశ్చయమనియు,సహజపరుషస్వభావయగు సౌదామిని యెంతటి విపత్తునేని కలిగింపక మానదనియు నిరు వురు నిశ్చయించుకొనిరి. ఆకస్మికవిపత్తులఁ దొలఁగించుకొన నేరితరము? సౌభాగ్యవతి యొకలేఖఁ దీసి దీపఁపువెలుఁగునఁ బఠించుచుండెను. మంజరి చెంతనుండి యా లేఖఁ జూచుచు సౌభాగ్యవతి పెదవులచప్పుడుచే లేఖభావము గ్రహించుచు నిలిచియుండెను. లేఖపఠనము పూర్తి యయ్యెను. కర్తవ్యము నుభయులు నిర్ణయించుకొనవలసిన యవసరము కలదు. లేఖను భద్రము చేయవలసిన పని యొకటి కలదు. పాఠకుల కీ లేఖను గూర్చి తెలుపవలసిన విశేషాంశములు లేవు. మహాదేవ

రాయలు కారాగారమున నీలేఖ నీ యువతుల కిచ్చినయంశము మఱచియుండరు. భీమరాజువలన రానున్న యాస్మిక విపత్ఫలము నిర్ణయించుకొనినపిమ్మటఁ గర్తవ్యమునుగూర్చిచర్చించు నాసతు లిరువురు నిశ్చయించుకొనిరి. అంతలో "సౌదామినీ! నీ వా రెండుహార్మ్యములఁ జూచితివి. నే నా రెండుహార్మ్యములఁ జూచితిని. ఇఁకఁ బరిశీలింపవలసిన చామందిర మొకటియే. అట కిరువురము బోవుదము.' అను వాక్యములు వినయ్యెను. సౌదామినితో 'భీమరాజు మనకొఱకె వెదకుచు వచ్చుచుండెను. లేఖ భద్రముచేయువే!' యని మంజరి సౌభాగ్యవతితో వాకొనెను. సౌభాగ్యవతి లేఖను బదిలపఱచువఱకు సౌదామినియు, భీమరాజును సమీపించిరి. సౌభాగ్యవతి నేలఁ జూచుచు నిలిచి యుండెను. మంజరి సౌభాగ్యవతి కించుక చాటున నిలచి యధోవదనముతో నుండెను. సౌదామినియు భీమరాజును జేరియొక యాసనముపైఁ గూర్చుండిరి. యువతు లిరువురు నవనతవదనముతో నా మందిరమును వదలిపోవ సంకల్పించి మెల్లఁగ నాలుగడుగులు వేసిరి. ఇంతలో భీమరాజు కఠోర స్వరముతో 'మేము మీకొఱకెవచ్చియున్నారము. ఎక్కడకును బోవ వీలులేదు. సౌదామినీ! వారి నిరువురను నిచటికి లాగుకొని రమ్ము.' సౌదామిని యా మాట బయలువెడలుటయె తడవుగ నుఱుకుచుఁ బోయి మంజరీ సౌభాగ్యవతులఁ వ్రేలుజడలఁ జేతికి మెలియవేసికొని లాగికొనివచ్చి భీమరాజు ముందు నిలువబెట్టెను. కొంచెము సేపా నలువురు నిశ్శబ్దముగా నుండిరి.

మంజరీసౌభాగ్యవతుల కవమానభరముచే నిబిడాశ్రు వులు కనుఁగవనుండి జలజల రాలుచుండెను. అశ్రుమలినము లగు దృక్ప్రచారములచే బాహ్యప్రపంచము, భీమరాజు చండ శాసనముచే, సౌదామినిదుర్ణయముచే హృదయ ప్రపంచము, నా యిరువురు సతుల కంధకార బంధుర మయ్యెను. కాని హృదయదృష్టికి, బాహ్యదృష్టికి వికృతములగు భీమరాజ సౌదామినీస్వరూపములు గోచరించుచునేయుండెను. సౌదా మిని కోపాతిశయము మాటిమాటికిఁ బెచ్చుపెరిగెను. అతి శయితమగు నా కోపావేశము నా యమ సహింపలేకపోయెను. భీమరాజుతో 'ఆర్యా! న్యాయము విచారించి యీ దోషిణుల శిక్షించుట మీ విధియైయుండ నేల మీనమేషములు లెక్కిం చుచు మిన్నకుందురు? ఇది రాజధర్మమునకు మిగుల విరుద్ధ' మని పల్కెను. భీమరాజు మదగజము; సౌదామిని యంకు శము. భీమరాజు స్తబ్ధభావమున కిప్పటికిఁ జలనము కలిగెను: ఒకమాఱు హుంకరించి కంఠము సవరించుకొనెను. పిదప భయంకరస్వరముతో నిట్లు పలికెను. "ఓ దోహాచిత్తలారా! మీ యందుఁ గొన్ని దోషము లాపాదింపఁబడి యున్నవి. ఆనందనిలయమున నున్న చిత్రపటము తొలఁగించి మహాదేవ రాయల కొసంగినది మీ రిరువురె. విలాసనిలయమున కేగ నెవరికి నాజ్ఞలేకున్నను మాఱువేసమున నట కేగి యచటి రహస్యలేఖం గొనివచ్చినది మీ రిరువురె. అంతతోఁ బోక నేఁటి సాయంకాలమునఁ గారాగారమున బంధింపఁబడిన దోషితో నిరువురును మంత్రాంగము చేయుచున్నారు. ఈ

దోషములు మూఁడు సహింపరానివి. అన్యులనైన నీలోపము లొనరించినందులకు శిరశ్ఛేదనము చేయింపవలసినదె గాని గర్భమోహము, వాత్సల్యము నూఁతగాఁగొని యంతటి కఠిన శిక్ష విధింప సందేహించుచున్నాను. ఈ విషయములో మీ రేమి ప్రత్యుత్తరముఁ జెప్పికొందురో త్వరలో ముగింప వల యును. ఇపుడు నేను న్యాయాధిపతి ననియు, మీరు దోషిణు లనియుఁ దెలిసికొని మాటలాడుఁడు. మనకుఁగల బాంధవ్య సంబంధము లన్నింటిని విచారణానంతరమునఁ జూచు కొందము." భీమరాజు పరుషముగ నిర్దయముగ నిట్లు వా కొనెను. సౌదామిని మందహాసవదనమును జలింపఁ జేయుచు నాఁ డానందనిలయమున నవ్వినపుడు, విలాసనిలయమున నడుగుబెట్టినపుడు, కారాగారవాసునితో మంత్రాంగములు చేయునపుడు లేని భయావేశము, చలనభావము నేఁ డేల కలుగవలసి వచ్చెనో ? ఇవి యన్ని మాయవేసములు, టక్కరి చేఁత లని మంజరీసౌభాగ్యవతుల నధిక్షేపించెను.

సౌభాగ్యవతి కా సౌదామినీసంభాషణము వినినంతనె యొడలెఱుంగరాని యంతటికోపము వచ్చెను. రాజావలంబ నముఁగల యాయమను సౌభాగ్యవతి యేమి చేయఁగలదు ? ఆవేశము నడఁచికొని యిటుల భాషించెను.

"ఆరోపింపఁబడిన దోషములు సత్యములో, యసత్య ములో నేను నిర్ణయింపఁ బనిలేదు. భీమరాజా! నిన్ను నేను జనకుఁడని చెప్పికొన సిగ్గుపడు చున్నదానను. సౌదామినీ సమావేశముచే నీ జీవితము కళంకితమైనది. హృదయకాలుష్య

ముచే నీ వాక్యములలో భూతదయ, సర్వసమత్వము నశించు చున్నది. ఆనందనిలయమున విడిది యొసంగుటచే మహా దేవరాయలు చిత్తరువును బరిగ్రహించితినని యొప్పుకొని యున్నాఁడు. చిత్రపటాన్వేషణమునకు బయలువెడలి కారా గారమున నిలిచితిమి. విలాసనిలయ మనిన పాపనిలయమని మే మెఱుంగక యందుఁ బ్రవేశించితిమి. జీవన్ముక్తి ప్రసా దింపవచ్చును. మా బ్రదుకులు మీచేత నున్నవి.

సౌభాగ్యవతీ! నీలోపము లన్నింటిని నేను క్షమించె దను. నీవు సౌదామినిపై మాతృభక్తి నుంచుము. ఆయమ శైశవమునుండి నిన్నుఁ బ్రేమించి పెంచినది. అభిరూపవరుని యాయమ నిశ్చయించెను. అతఁడె పాలవానమండలేశ్వరుఁడు. కులశీల వయోరూపవిభవముల నీ కతఁ డర్హుఁడు. ఇట్లని భీమ రాజు పాలవానమండలేశ్వరుని పటము విసరి సౌభాగ్యవతి ముందుఁ బడవేసెను. గాలికదితొలఁగి మంజరివైపునకుఁ బడెను. మంజరి దానిని కాలితో సౌభాగ్యవతి వైపునకుఁ దన్నెను. సౌభాగ్యవతి, దానిని సౌదామిని వైపునకుఁ దన్ని వేసెను.

భీమరాజున కా యవినయచర్య విపరీతమగు కోపమును గల్గించెను. తనయ చేయు యవినయప్రదర్శనముకంటె మం జరి యొనరించిన సాహసకృత్యము మఱింత యాగ్రహకారణ మయ్యెను. భీమరాజు కోపాతిశయమునఁ దొట్రుపడుచున్న వాక్యములతో నిట్లనెను. "గోకర్ణుని, వసుంధరను ప్రాణము లతో నుంచుటచేఁ గలిగిన ప్రతిఫల మిది. ఇఁక సహించితినేని నారాజ్యమునకుసైతము దురవస్థ రానున్నది. వర్ధమానపుర

రహస్యములు సౌభాగ్యవతీమంజరుల మూలమున విరోధుల కర్ణములకుఁ దాకు సూచనలు కాన్పించు చున్నవి. వసుంధరా గోకర్ణుల వధింప సంకల్పించినదియు, మహాదేవరాయల బంధించినదియు నీయిరువు రెఱింగియున్నారు. వీ రిరువురు సామ్రాజ్య క్షేమాభిలాషిణులు కారు. దూరదృష్టి లేక, గోకర్ణుని మాయా వాక్యములకు, మహాదేవరాయల యాకారవిశేషములకు వీ రిరువురు ముగ్ధలైరి. కావున మంజరీసౌభాగ్యవతుల కెడఁబాటు ముందుఁ గల్గింపవలయును. సౌదామినీ! నీవు మంజరిని బంధింపుము. నే నింతలో సౌభాగ్యవతి నాయానంద భవనహర్మ్యమున బంధించి భటులఁ గావలియుంచి వచ్చెదను.' అని భీమరాజు సౌభాగ్యవతిచేతి కొక పాశమును బంధించి విచారపడుచున్నను మంజరికొంగు పట్టికొనినను, క్షమింపక వధ్యపశువును గొంపోవునట్లు లాగికొనిపోయెను. మంజరిని బంధింప సౌదామిని యొక పాశమును దెచ్చి కరమునకుఁ గట్టఁబోయెను. మంజరి యాత్రముతో నా పాశమును వదలించుకొని సౌదామినిని దిట్టముగ బంధించి యటనుండి వెడలిపోయెను. భీమరాజు సౌభాగ్యవతి నొకమందిరమున బంధించి, నిర్దయస్వాంతముతో మంజరిని బంధింపఁ బూర్వ వసతికిఁ జేర వచ్చెను. సౌదామిని బంధింపఁబడెనని యాతఁ డెఱుంగఁడు. మంజరియే బంధింపఁబడె నని భీమరా జూహించి 'సౌదామినీ! సౌదామినీ!' యని పిలిచెను. అవమానభరమున సౌదామినికి మఱుమాట నోటరా దయ్యెను. స్తబ్ధభావముతో నటులె పడియుండెను. సౌదామిని సౌభాగ్యవతిని బరాము

ర్శింపఁ బోయియుండునని తలఁచి భీమరాజు 'మంజరీ! పొలవాన దేశాధీశ్వరుని పటమును పాదతాడన మొనరించినందుల కిదిగో సత్కార'మని కాలికొలఁదిగఁ దన్నెను. సౌదామిని యా పాదతాడనమునకు సొమ్మసిల్లి యీదురవస్థలో మఱి యొక యవస్థాంతరమా యని హీనస్వరముతో వాకొనెను. మంజరీ! ఇప్పటికి నీకు దేహశుద్ధి యైనది. వాక్ఛుద్ధి కావలయు నని మొగము వైపున భీమరాజు మఱియొకతన్ను తన్నెను. ఇంతలో నొకవ్యక్తి యటకు హఠాత్తుగఁ బ్రవేశించి నాపేరుఁ జెప్పి మఱియొక తన్నుఁ దన్ను మనెను. అది సౌదామిని స్వరముగ నుండవలసినది. భీమరాజు మంజరి స్వరముగ నిర్ణయించుకొని వెనుకకు మఱలిచూచెను. నిజముగ నామె మంజరియే. ఐన బంధింపఁబడిన దెవరు? ముందున్న దెవరు? అను సంశయమును జంచలభావముతోఁ బలుమాఱు చర్చించెను. బంధితురాలై సౌదామిని సొమ్మసిల్లి పడియుం డెను. మంజరి మందహాసపూరితవదనముతోఁ బాపమునకు బ్రతిఫలము జరుపఁబడినదనెను. భీమరాజు నిశ్చేష్టుఁడయ్యెను. తన ప్రాణపదము, తన జీవితసర్వస్వము, తన దురాచార దుర్మంత్ర పరవధాదుల మూలబీజము, దోషిణివలెఁ గఠిన శిక్షకుఁ బాత్రు లయ్యెను. ఆ యవసరముననే మంజరి పరిహసించి మిగుల నవమానించెను. ఆ కోపాతిశయముచే మంజరిని భీమరాజు చంప నుద్దేశించెను. కేల వాలు లేదు. చెంతఁ జేతిక్రింద మంజరిలేదు. భీమరాజు పరుగెత్తి మంజరిని బట్టుకొని సౌదామినిచెంత కీడ్చి తెచ్చెను. అంతలో నాతని

కోపము చల్లారునా? మంజరియందు రానురాను దోషము లతిశయించుచుండెను. మరణశిక్ష విధించినను మంజరిదోష ములకుఁ బ్రతిఫలము కాఁజాల దని యాతఁడు నిశ్చయించు కొనెను. మంజరిని బంధింపవలయును. సౌదామిని నోదార్ప వలయును. భీమరాజు తన యుత్తరీయముతో మంజరిని భంధిం చెను. ధైర్యముతో భీమరాజా! నీయుత్తరీయము నన్ను బంధించు చున్నదని భ్రాంతినొందకుము. నాసాత్త్వికజీవితమే నన్ను బంధిం చుచున్నది. నామాతృదేశభక్తియే నన్ను బంధించుచున్నది. నశ్వరమగు నీబాహ్యదేహమును బంధింపఁగలవు గాని స్వేచ్ఛాభిలాయిష్ఠమగు నాహృదయమును బంధింపలేవు. నీవు చేయు ప్రతికార్యమునకును ముందు యముఁడు నీకంటె సర్వ స్వతంత్రుఁడని మాత్రము తలంచుకొను' మనియెను.

భీమరాజునకా వాక్యములు రుచించునా? ఇంతటిసాహస ప్రసంగ మొనరించినందులకు భీమరాజు మంజరిని బాద తాడన మొనరింప వలసినదె కాని ముం దాతని భాగధేయము బంధింపఁబడియుండెను. ఆ బంధవిముక్తి గావించువఱ కాతఁడు చైతన్యశూన్యుఁడె. భీమరాజు సత్వరముగ సౌదామిని బంధము లన్నింటిని విప్పివేసెను. పాదతాడనములచే నాయమ నిస్పృహ నొందెను. చాలసేపటికిఁ దెప్పిఱిల్లి, 'ప్రియా! ఎంతయవస్థఁ గల్పించితివి? నీపాదసేవ ప్రాప్తముంటచే జీవించి తిని గాని, లేకున్న నిదివఱకె పరలోకముఁ జేరి యుందు' నని సౌదామిని యనెను. మంజరికిఁ గావలసినయవస్థ సౌదా మినికి దైవము విధించెను. ఇట్లు సౌభాగ్యవతికి రానున్న

యవస్థ భీమరాజనుభవించుటకు దైవ మనుగ్రహింపకపోఁడు. అనుచుండఁగనే మంజరిని భీమరాజటనుండి యీడ్చికొని పోయెను.

---

# పండ్రెండవ ప్రకరణము.

సౌదామిని చాలసేపటికిఁ గన్నులవిచ్చెను. అపుడ భీమరాజునకుఁ బ్రాణము వచ్చెను. ప్రేమభరమే యనుఁడు, మోహాభరమే యనుఁడు, పిశాచావేశమే యనుఁడు - భీమ రాజు నిర్విణ్ణుఁడై వలవల నేడ్చుచు 'సతీ! నన్నుఁ గరుణింపు' మని సౌదామినిని గట్టిగఁ గౌఁగిలించుకొనెను. సౌదామిని మెల్లఁగఁ జీరచెఱంగుచే భీమరాజు చెక్కుల నివిరెను. ఇరు వురు నొకరైరి. హృదయములు రెండును గలిసిపోయెను. అను నయ రసప్రపంచమున వారు మునిఁగిపోయిరి. అంతలో మంజరి వారల నుత్తీర్ణులఁ జేయనెంచి యిట్లనెను. "ఛీ! ఛీ! నేనీ పాపప్రదర్శనము చూడఁజాలను. ప్రేమమయ మగు నీ విశ్వమున నిట్టి వికృతిసమ్మేళనము పశుధర్మము. నన్ను వధింపుఁడు. లేదా విసర్జింపుఁడు. ప్రీడాశూన్యులై మీరొనరించు ప్రేమావేశకృత్యములు పరములేదని నేను పరికింపఁ జాలను. మంజరి యిట్లు ముక్తకంఠముతోఁ బల్కఁగనే సౌదా మిని పూర్వవిజ్ఞానము నార్జించెను. తన బంధనము, రాజు చేసిన పాదతాడనము స్ఫురించెను. సద్యస్స్ఫురణముచే యాతన

లన్నియుఁ దిరుగఁబెట్టెను. ఆ కోపపరిణామముచే సౌదామిని రాక్షసివలె నుండెను. అపాంగమధురములగు చూపులులేవు. మందహాసకందళితమగు వదనము కాదు. మృదుస్వరావృత మగు వాక్కుకాదు. ఆయమ నిజమగు సౌదామినియేనా యని భీమరాజు సైతము తలంచెను. మంజరీనిర్బంధమునకు సౌదామిని స్వీకరించిన యీ రాక్షసభూమిక మొత్తము మీఁద భీమరాజునకు నయనానందకరమైన దనియే సాహసించి చెప్పవచ్చును. 'ఎంతవఱకీశాంతవ్రతము. ధర్మవిద్రోహము, ప్రభుద్రోహము, గావించు మంజరి నెంతసేపింక సహింపవలయును. ఆపెను ద్వరలో యమసదనమునకుఁ బంపకున్న సౌభాగ్యవతిని సర్వవిధముల భ్రష్టురాలిని జేసి మన రహస్యజీవితములు దేశములఁ జాటితీరును. పైగ నీ యమవలన మనకుఁ బ్రాణాపాయము తప్పదు. కర్తవ్యము సెలవీయరేమి?' యని సౌదామిని భీమరాజును మందలించెను.

భీమరాజున కేమియుఁ దోఁచినది కాదు. క్రోధావేశము చాలవఱకుఁ దగ్గెను. యుక్తాయుక్త యోజనమునకు సమయము చిక్కెను. సౌదామినియాజ్ఞ నెంతవఱకు నిర్వర్తింపవలయునో యాతనికిఁ దోఁచుట లేదు. మహామంత్రి పుత్రియగు మంజరిని శిక్షించినచో రాజ్యమున నెంత యలజడి కలుగునో సౌదామినిభావ మీయదనున నెంతవఱకు స్వీకరణయోగ్యమో యాతనికిఁ దోఁచలేదు. కొంచెము సేపు విచారించి 'సౌదామినీ! మంజరి యెంత ఘోరశిక్షకేని యర్హురాలెకాని శిక్షారంభమున దేశకాల

పాత్రములు యోజింపవలెను. శిక్షాన్మృతి మిగుల నున్నత మైనది. ఒకపుడు అల్పశిక్షవలనను మఱియొకపు డధిక శిక్షవలనను సామ్రాజ్యభ్రష్టులైన రాజుల ననేకులఁ జూచి యున్నాను. ప్రజాశక్తి యేకమైన రాజు చేయునది లేదు. నేఁడు-మనస్థితి మగుల సందిగ్ధముగ నున్నది. నిశ్చయమునకు గోకర్ణుఁ డెచటికిఁ బోయినది తెల్పుమని ప్రజలు నన్నుఁ గఠిన ముగఁబల్కుచున్నారు. అటులె మంజరివిషయమున సౌభాగ్యవతి విషయమున మనము ప్రజలకు వెఱవవలయును. మంజరి యొకసామాన్యగృహస్థుని పుత్రికకాదు. మంత్రిపుత్రి. మంత్రికి మనరాజ్యమున నెక్కుడు పలుకుబడి కలదు. అతఁడు ప్రజలఁ దిరుగఁదీసిన మనము చేయునది లేదు. కాన నిది యంతయు యోజించి మంజరిని శిక్షింపవలయును. మంజరిని బంధించి తిమిగదా! ఆయమ నొక గోతములోఁ గట్టివైచి చుట్టుగట్టిగఁ దాళ్లతో బంధించి యొక కొండమీఁదినుండి దొర్లింతము. ఆ కాకుడుచే మంజరి పరలోకము నలంకరించును. ప్రజలు మనల ననుమానింపక యిది చోరులకృత్య మని నిర్ణయింతురు. సౌదామినీ!యీయూహ నీకెంతవఱకు మోదమని భీమరాజు ప్రశ్నించెను. మంజరీవధ కిదియు నొకయుపాయమే యని దూరముగఁ గానవచ్చుచున్న గోతమును సౌదామిని తెచ్చెను. భీమరాజు మంజరి నందుఁ జేర్చి చివర బిగించి దృఢమైన పాశ ముతో నా గోతమును బిగించికట్టెను. ఇఁక నాబంధితవ్యక్తిని శైలాగ్రమునుండి దొరలింపవలసిన దెటు లని యిరువురు యోచించిరి. ఊపిరియాడక మంజరి యందు మరణించి

యుండు నని సౌదామిని నిశ్చయించికొని దీనిని విలాస భవనమునకుఁ జేర్చితిమా యటనుండి గృహపాలకు లవశిష్టమును నిర్వహింపఁగల రని సూచించెను. అప్పటికిఁ జంద్రుఁడస్తమించెను. అది శుద్ధపంచమి కాన వారియుద్యమమునకుఁ జంద్రుఁ డెట్టి నిర్బంధము కలిగింపలేదు. ఆ ఘోరతమోరాశియే సౌదామినీభీమరాజులకు సర్వవిధముల సాహాయ్యపడెను. మెల్లగ వా రిరువురు బంధితవ్యక్తిని హస్తములమీఁద నుంచుకొని దొంగత్రోవలఁబట్టి యొకజాము సేపటికి విలాసనిలయమునకుఁ జేర్చిరి. అట వృద్ధుఁడగు ద్వారపాలకుఁ డొకఁడె యుండెను. భీమరా జాతనిని గాంచి ఓరీ! గూఢమున కేగి నే నాజ్ఞయొసంగితి నని యిరువురఁ దలారివాండ్రఁ బిలిచికొనివచ్చి యీ మూఁటను దీసికొని వెళ్లి భేతాళుని కొండపై నుండి దొర్లింపుమని చెప్పుము. ఇపుడె నీస్వాధీనముచేయుచున్నాఁడ ననియెను. ఆతఁడు కొంచెము సంశయించి 'నేను గూఢమునకుఁ బోయివచ్చువఱకు మీస్వాధీనమునందె యుంచికొనుట యుక్తము. బహిరంగస్థలమున నీమూట నుంచఁజనదు.' అని వృద్ధుఁడు మెల్లఁగ గూఢమునకు వెడలిపోయెను. భీమరాజా గోనెను దొర్లించుచు విలాసభవనము గుమ్మములోనికిఁ జేర్చి ద్వారము బంధించి సౌదామిని హస్తముఁ బట్టుకొని యొకపర్యంకముపై నధివసించెను. సౌదామిని యా చేయి వదల్చుకొని భీమరాజుతో నిటుల సంభాషించెను.

'ఇప్పటికి మంజరి కడ తేఱినది. గోకర్ణుని, వసుంధర నిటులె కడతేర్చి కందూరురాజ్యమును హరింపవలయును.

పిమ్మట సౌభాగ్యవతిని బొలవానదేశాధీశ్వరున కీయవల యును. అప్పటికిఁ గండూరు, వర్ధమానపురము, బొలవాన దేశములూ కలిసిపోవును. రుద్రదేవచక్రవర్తి మనపైకి రా వెలచును. సాహసించి రాను సంకల్పించెనేని మహాదేవ రాయలు మా కారాగృహమున నిర్బంధితుఁడై యుండెను. మీరు మమ్మెదిరింతురేని యాతని వధించెద మని వర్తమాన మంపుదము. రుద్రదేవచక్రవర్తి మనదురంతములకు సహించి మనకు స్వాతంత్ర్యము నొసంగి మహాదేవరాయలఁ దీసికొని పోవును. ఇది ముందుజరుగఁదగిన పని.'

భీమరా జీవిధానము నంతయు నామోదించి తల నాడించుచు నటు లొనరింపకున్న రాజ్యభ్రష్టుల మగుదు మని సౌదామినితోఁ దెలిపెను. అంతలోఁ దలారులు ద్వారమున సందడిచేసిరి. భీమరాజు నిర్బంధితవ్యక్తిని వారి కొసంగి 'యిం దొక చోరుఁ డున్నాఁడు. ఇప్పటికి మరణించియుండును. మీ కా జోక్య మేల! బేతాళునికొండమీఁదినుండి దీనిని గ్రిందికి దొర్లింపుఁడు. ఇది తెల్లవాఱులోపల నెఱవేర్చి వచ్చిన మీ యిరువురకు గొప్ప బహుమానమిత్తు నని భీమరాజు వాకొనెను. తలారు లామోదించి యా బంధితవ్యక్తితో నిర్గమించిరి.



# పదమూఁడవ ప్రకరణము

వర్ధమానపురమున గోకర్ణమహారాజు స్థాపించినశాంతి యింకను జలింపలేదు. భీమరాజున కడ్డమువచ్చి ధర్మపరిపాలనమునకు ముందంజవైచి ప్రజారంజకముగఁ బరిపాలనధర్మముల శాసించు గోకర్ణుని వృత్తాంతము కొంతకాలమునుండి పౌరులు వినుటలేదు. గోకర్ణుఁడు ప్రజల కాఱవ ప్రాణము. ప్రజలకు, రాజునకుఁ గల పరిపాలనధర్మములలోఁ గలుగు నక్రమముల వారించు గోకర్ణుఁడు లేకపోవుటచేఁ బౌరులకు సాహస మతిశయించెను. భీమరాజీయాందోళనమున కారంభమునఁ దన కఠినమగు రాజనీతి నాచరణములోఁ బెట్టక తప్పినదికాదు. ప్రజ లందఱు పరిపాలనలోపముల నుగ్గడించి యాంధ్రసామ్రాజ్యమున కేగి తమ దురవస్థల విన్నవింప సంకల్పించుకొనిరి. భీమరాజీ సందు గ్రహించి గోకర్ణమహారాజుగారు, వాగీంద్రచూడామణి రాఁబోవుజినవర్ధంతి నిచటఁ జరుపుదురఁట. ప్రజలు శక్తికొలఁది సాహాయ్యపడవలయునని నగరమున జాటింపఁజేసెను. ప్రజ లది విశ్వసించి గోకర్ణవాగీంద్రచూడామణుల యాగమనమునకుఁ జంద్రచకోరన్యాయముగ నిరీక్షించుచు శాంతముగ నుండిరి.

వర్ధమానపురమున మంజరీసౌభాగ్యవతులు వధింపఁబడిరను నొకప్రవాదము జనించెను. మహామంత్రికి మంజరి యేకపుత్రి. ఇందెంతవఱకు యథార్థము గలదో తెలిసికొనవలయునని భీమరాజువద్దకు మహామంత్రి వచ్చి నిలిచెను. భీమ

రాజు సింహాసనమున నాసీనుఁడై యుండియు నాఁడు మహ మంత్రి కర్ణాననముఁ జూపఁ డయ్యెను. పుత్రికావాత్సల్యమునఁ దా నాయగౌరవమును బాటిసేయక మహామంత్రి రాజసమ్ముఖమున నీపౌరుని విజ్ఞప్తి యొందు కలదని చేతులఁ గట్టికొని భీమరాజును సమీపించి వినయవినమదంగుఁడై నిలువఁబడెను. భీమరాజు మహామంత్రిని జూచి యాగ్రహోదగ్రుఁడై 'రాజద్రోహీ! ఏమని యాస్థానమునకు వచ్చితివి? మంజరీ సౌభాగ్యవతుల కున్నతాశ్వముల నొసంగి విరోధిసంస్థానములకు నీవు పంపితివని గూఢచారు లెఱింగించుచున్నారు. అశ్వశాలలో నాయిరువ్వు రధిరోహణము గావించు నశ్వములు కానవచ్చుట లేదు. భటు లడుగుజాడలఁ బట్టి యా యశ్వముల నెక్కినవారు నీగృహమునకు వచ్చినటులఁ బదాంకములు కలవనియు రాత్రి వీచిన గాలిచే నా చిహ్నము లంతరించెననియు వాకొనుచున్నారు. నీసంబంధ మంతయో యింతయో లేకున్న నాపుత్రియు మంజరియు నింతటి యరాజకమునకుఁ బాల్పడరు. ఒక మాసములో నా యిరువురివృత్తాంతములఁ దెలిసికొని సంస్థానములో నివేదింపకున్న నీకు మరణదండనము విధించితీ రెద' నని భీమరాజు మహామంత్రిని బెదరించెను. ఏపాపము నెఱుంగని మహామంత్రి యేమిప్రత్యుత్తరము నీయఁ గలఁడు? ఒకటి సరికల్పించికొన మఱియొకటి యయ్యెను. పవిత్రహృదయుఁడగు మహామంత్రికి భీమరా జొనరించిన ప్రసంగ మంతయు విచారజనక మయ్యెను. ఎవరో రాజద్రోహులు మంజరీసౌభాగ్యవతులకు దుర్బోధఁ గావించి దేశాం

తరమున కనిపి భీమరాజుతో మహామంత్రియే దోషి యని కొండెములు చెప్పియుండు రని యతఁడు నిశ్చయించుకొనెను. ఈ రహస్యభేదనమునకు మార్గ మేదిరా? యని యతఁడు యోజింపసాగెను. రహస్యభేదనమునకై శక్తి కొలఁది ప్రయత్నించి మాసాంతమున దాను గ్రహించిన యంశములు నివేదింతుననియు నీవిషయమున సంస్థానాధిపతులు వినినది యథార్థముకాదని విజ్ఞాపనము గావింపవలసివచ్చినందులకు క్షమింపుఁడనియు మహామంత్రి నివేదించి కొలువుకూటమును వదలి తనగృహమున కేగెను. భీమరాజు వర్ధమానపురమునను సంస్థానమునకు సంబంధించిన యన్నిగ్రామములను "సౌభాగ్యవతీ మంజరులు దేశపర్యటనమున కేగిరి. వారేమార్గమున నెట కేగినది తెలుపువారికి రాజ్యములోఁ గోరుకొనిన గ్రామము సర్వస్వాతంత్ర్యములతో నొసంగఁబడు' నని చాటింపఁజేసెను. పౌరు లందఱు సౌభాగ్యవతీమంజరులు వధింపఁబడి రను ప్రవాదము నిరాధారమనియు పుణ్యక్షేత్రసందర్శనార్థము పోయి యుందురనియు నిశ్చయించుకొనిరి. రహస్యభేదమునకు సంస్థానమునకుఁ జెందిన ప్రతిపౌరుఁడు శక్తివంచనములేకుండఁ బాటుపడి ప్రభుకృపాపాత్రులగుటకుఁ బ్రయత్నము తీవ్రముగఁ జేయుచుండిరి. భీమరాజీయాధారముతో నధర్మవిజృంభణము చేయఁ బ్రయత్నించెను. సౌదామినీబోధ లన్నియు నాతనికి సర్వవిధముల ఫలదాయకములవలెఁ గానబడుచుండెను. తన రాజనీతిచేఁ బౌరులలో నెట్టియశాంతి లేకుండఁ జేయఁగల్గితినని భీమరాజు గర్వించెను. ఈ గర్వాతిశయమె యతని హానిక

దుష్కార్యములకుఁ, బాపప్రవర్తనములకు నభయహస్తము నొసంగి వెన్నుదట్టి పురికొల్పఁదొడంగెను. సంకల్పసాధ మున వసించుట కిప్పటికిఁ బ్రథమసోపానము నెక్కఁగల్గి ననియు నాకాశహర్మ్యమును నిర్మింపవచ్చుననియు భీమరాజు నిశ్చయించుకొనెను.

భీమరాజు తన కార్యక్రమ మంతయు నొకవిధముగ ముగించెను. ఇఁక గొన్ని యవశిష్టములు కలవు. ఆ విషయము లలో సౌదామిని యాజ్ఞాపాలనముచేఁ గృతార్థుఁడు కానచ్చు నని భీమరాజు సంకల్పించికొనుసమయమున నచటికి మువ్వురు భటులు వచ్చిరి. రాజామువ్వురను సాదరముగ బహూక రించి పేరు పేరువరుసలఁ బిల్చి యాసనములఁ జూపి 'రాజభక్త లారా! రాజ్యమునకు మీరు మొదటినుండి క్షేమము సంత రించుచున్నారు. గోకర్ణాదులు మిమ్ముఁ బ్రజాద్రోహులని వ్యవహరించుచున్నారని మీరు విచారింపఁజనదు. శిశుపా లుఁడు శ్రీకృష్ణుని దూషింపలేదా! కౌటిల్యులకు రాజ్యాంగ వేత్తలందఱు నిటులె కానవచ్చుట సహజము. పరిపాలనమున మాత్రమున నేను ప్రభుఁడను మీరు పౌరులుగాని యీ సా మ్రాజ్యరక్షణభారము వహించుతఱి మన మందఱము సోదరు లము. సోదరులారా! మన కాచరణీయకార్యములు పెక్కులు కలవు. దేశ మంతయు జైనమతప్రవిష్టులు పాడుచేయు చున్నారు. క్షత్రియజాతికి బ్రాహ్మణజాతికి సంబంధింపని జైన ధర్మమును వెలఁగఁబెట్టు గోకర్ణునిచేతనే యీ రాజ్యమున కిన్ని యరిష్టములు ప్రాప్తించినవి. ఈ యంశము రాజ్యతంత్

జ్ఞులగు మీకొంట్లకు విశేషించి తెలుపనవసరము లేదు. ఆంధ్ర సామ్రాజ్యాధిపుఁడు మన కెగ్గాలోచించుచున్నటుల జనశ్రుతులు కలవు. ఈచిక్కులు నవరించుకొనుటకు సౌభాగ్యవతిని పొలవాసదేశాధీశ్వరున కొసంగుటయే కర్తవ్యము. కావున మీముగ్వురకు మూఁడుకార్యముల నియోగించుచున్నాను. ఒకరు కందూరున కేగి గోకర్ణుని దుస్తంత్రములు కనిపెట్టి యా రాజ్యము దుర్బలముగ నున్నయదను మా కెఱింగింపవలయును. అట్టి యదను చిక్కువఱకు రాజ్యమునఁ బ్రజలకుఁ బాలకులకు భేదాభిప్రాయములు కల్గింపవలయును. మఱియొకరు పొలవాస కేగి సౌభాగ్యవతి గుణగణముల నా దేశ పాలకుఁడగు కీర్తివర్మకు నివేదించి సౌదామిని యొసంగిన లేఖయు నీచిత్రపటము నొసంగి మేము పరిణయప్రయత్నములో నుంటిమనియుఁ దన ప్రత్యుత్తరమె యాలస్యమనియు నివేదింపుఁడు. ఇది మిగుల గుప్తముగ జరుగవలసినపని. వేఱొక రాంధ్రసామ్రాజ్యమున కేగి యచటి రహస్యముల గ్రహించి భేదనీతి నవలంబించి నకాలమున గూఢచారులచే రహస్యవార్తలఁ దెలియఁబఱుపవలయును. రుద్రదేవచక్రవర్తి యేకాలమున నేరాజ్యముపైకి దాడివెడలునో నాకుఁ దెలుపుచుండవలయును. ఈ ధర్మతంత్రయమును శక్తిత్రయముగ మీరు భావించి యవకాశమును, నవసరమును

బట్టి ముప్ఫ్వ రేకాంతగోష్ఠి నాంధ్రసామ్రాజ్యమునవే నెర వేర్పవలయు ననముగ్గురును భీమరాజుపాదముల కెఱఁగి కొలఁది కాలములోఁ బర్యవసానము నివేదింపఁగలమని భీమరాజు ప్రీతిపూర్వకముగ నొసంగు కౌఁగిలింతలతో నానందించి నిష్క్రమించిరి. భీమరాజు తన బహిఃప్రాణమగు సౌదామిని పదాంకముల ననుసరించి యంతఃపురమునఁ బ్రవేశించి పాప జీవితము గడపుచుండెను.



శ్రీ

# వసుంధర.

## ద్వితీయభాగము.

## మొదటి ప్రకరణము.

ఆంధ్రసామ్రాజ్యమునకు ముఖ్యస్థానము హనుమకొండ. ఇల నెఱకు దేవరాజు మాధవవర్మ లోనగు పూర్వరాజులు కోటలఁ గట్టి స్వతంత్రముగ నాంధ్రదేశమును బాలించిరి. కాలవశమున నా సామ్రాజ్య మంతరించెను. ఆ పవిత్రక్షేత్రము చోడరాజన్యులకు, రాష్ట్రకూటులకుఁ గాలక్రమమున సంక్రమించెను. పిమ్మటఁ బశ్చిమచాళుక్యచక్రవర్తులపరాక్రమమున నాంధ్రదేశమును జయించి సామంతుల నందందు నిల్పి రాజ్యపరిపాలనము గావించిరి. అట్టి సామంతులలోఁ గాకతీయచక్రవర్తు లొకరు. కాకతి యను జైనదేవతను బూజించుటచే వీరికిఁ గాకతీయులను నామము కలి

గెను. త్రిభువన మల్లవిక్రమాదిత్యుని కాలమువఱకుఁ గాకతీయులు రాజప్రతినిధులుగ నుండి శౌర్యసాహసములచే నాంధ్ర రాజ్యమునంతయు శాంతిమంతముగఁ బాలించిరి. క్రమముగఁ ద్రిభువనమల్లవిక్రమాదిత్యుని వంశ మంతరించెను. సామంతులందఱు స్వతంత్రులై రాజ్యకాంక్షతో సంగ్రామరంగముల నలంకరించిరి. ఆ సమయమున హనుమకొండలో రాజప్రతినిధిగ నున్న ప్రోలరాజు సైనికబలము వృద్ధిపఱచి విజృంభించిన మండలేశ్వరుల నడఁగఁద్రొక్కి యశాంతిఁ దొలగించి పలుమాఱు జైత్రయాత్రలకమిత సేనాసాహాయ్యముతో నేగి తైలపదేవుని బంధించి గోవిందరాజును జయించి గుందరాజును జంపి జగద్దేవుని బాఱఁద్రోలి పూర్వమండలేశ్వరులస్థానములలో నూతనుల నియోజించి యందఱను దన కరిగాపులుగఁజేసి యాంధ్రసామ్రాజ్యము నిర్మించెను. ప్రోలరాజు జీవిత మంతయు రాజ్యస్థాపనముతోడను యుద్ధయాత్రలతోడను గతించెను. పితృరాజ్యము కాలక్రమమున రుద్రదేవ చక్రవర్తి హస్తగత మయ్యెను. ప్రోలరాజుకాలమునఁ దూర్పున సముద్రము దక్షిణమున శ్రీశైలము పశ్చిమమున గళ్యాణపురి ఉత్తరమున మాల్యవంతము సరిహద్దులుగాఁ గల దేశమంతయు నాంధ్రసామ్రాజ్య మను పవిత్రనామముచే వ్యవహరింపఁబడుచువచ్చెను.

మన కథాకాలమున నాంధ్రసామ్రాజ్యమును రుద్రదేవచక్రవర్తి పాలించుచుండెను. రుద్రదేవుఁడు సర్వమతములయందు సమబుద్ధిఁగలవాఁడు. తండ్రివలె నీతఁడు జైన

మతాభిమాని కాకపోయినను జైనమతద్వేషిమాత్రము కాఁడు. పితృదత్తములగు జైనవృత్తులన్నియు సాదరముతోఁ బరిపాలించుచు వచ్చెను. శైవమతము మనిన నీతని కెక్కుడభిమానము. కాననే వీరశైవమతప్రచారకుఁ డగు పాలకురికి సోమనాథున కనేకవిధముల మతసంగ్రామములలోఁ గెలుపొంద నొసంగెను.

చక్రవర్తియగు రుద్రదేవుఁ డాంధ్రుఁడు. ఆంధ్రవాఙ్మయకోవిదుఁడు. ఆంధ్రదేశ నాయకుఁడు. త్రిమూర్త్యాత్మకమగు నాంధ్రతేజోవిభవము గల రుద్రదేవచక్రవర్తికి విద్యాభూషణుఁడను బిరుదనామము గలదు. చక్రవర్తి కర్ణాటాంధ్ర సంస్కృతవాఙ్మయములలో నభినివేశ మార్జించి యనేకగ్రంథ రాజములు భాషాత్రయమున విరచించెను. రుద్రదేవుఁడు శాంతిమంతముగ రక్తపాతము లేకుండ నాంధ్రరాజ్యమును బాలింపఁదలంచెను. సామంతమండలేశ్వరు లగు చాళుక్యులు, చోడులు, పల్లవులు చేయు దుండగములచేఁ జక్రవర్తికి ఖడ్గధారణము చేయక తప్పినది కాదు. రాజవర్మ తన ధర్మపురిమండలముపై నొసంగవలసినుంకమును సకాలమునఁ జెల్లించుట మానివేసెను. భీమరాజు వన్ను గట్టి కొన్ని సంవత్సరములు గడచెను. పైఁగా నారాష్ట్రమునకు రాయబారమున కేగిన మహాదేవరాయ లెంతకును దిరిగి రాలేదు. కందూరు రాజ్యము ప్రాణావశిష్టముగ నున్నది. దీనికి భీమరాజే కారకుఁడు. ఈ దురంతములు రుద్రదేవచక్రవర్తి పట్టాభిషిక్తుఁడైన స్వల్పకాలమునకె ప్రబలెను. రుద్రదేవచక్రవర్తి కన్నింటికంటె మహాదేవరాయలవిషయమై మిగుల యాందోళనము జనించెను.

ంవత్సరములు గడచుచుండెను. అతఁ డధిష్ఠించిన యశ్వము
ంస్థానమునకుఁ జేరెను. నేన చాలకాలముక్రింద నే వెనుకకు
ంఱలివచ్చెను. సంధియో, సంగ్రామమో నిశ్చయము చేసికొని
మ రాజునందర్శనము చేయుటయె తడవుగ రాఁదగిన మహా
వరాయలు రామిచే రుద్రదేవచక్రవర్తి లోలోనఁ బరిత
ంచుచుండెను.

మహాదేవరాయలు చక్రవర్తికి సహోదరుఁడె కాదు,
డిభుజము, మంత్రి, క్షేమాభిలాషి. ఇన్ని బాధ్యతలు గల సోద
ఁడు కానని క్రంతల కేగి వర్తమానమేని తెలియకున్నఁ గల్గు
నారము కేవల మనుభవైకవేద్యము. చక్రవర్తి సోదరుని
ంనికిఁ దెలిసికొనఁ దీవ్రయత్నములు చేయనిశ్చయించికొనెను.
దరుఁ డింక వచ్చునింక వచ్చునని చాలకాలము నిరీక్షించెను.
గజపరాక్రమశోభితుఁడు, భాతృభక్తిపరాయణుఁడు, సుశీ
ఁడు నగు సోదరుఁడు కార్యాంతరవ్యాప్తిచే నాగియుండుఁ గాని
ఁన్న నింతకాల ముపేక్షించునా? యని చక్రవర్తి నేఁటి
ంకు నిబ్బరించెఁ గాని క్రమముగ నా నిబ్బర మంతరించెను.
క్రవర్తి యాందోళనముతో వివర్ణవదనుఁడై యున్న తరుణ
న సోమనాథకవి యట కేతెంచెను. ఇతఁడు చక్రవర్తికి
ఁధ్యాయి. చక్రవర్తియొద్ద నేవిషయము నేని ఖండితముగఁ
ంవుటకు యుక్తాయుక్తములు శాసించి చెప్పుటకు నీతని
న్న చనవు, సాహసము మతియొకరికి లేదు. ఆకాలమున
ంమంతయు జైనమతాభిమానభూయిష్ఠ మగుటవలనను,
ను శైవమతద్వేషియగుటవలనను సోమనాథుఁడు సర్వజన

రంజకుఁడు కాకపోయెను. కాని విరోధులు సైత మాతని గుణగణముల శ్లాఘించుచుందురు. సోమనాథుఁడు చక్రవర్తిని సమీపించి, వినయముతో నిట్లనెను. 'రాజా! ఏల యాలోచనమునఁ బరవశుఁడవై యున్నాఁడవు. నేను వినఁదగియున్న సాదరమున సెలవిమ్ము. నీయాందోళనమునఁ బాలుపంచికొని శక్తియున్నఁ బ్రతిక్రియఁగావింతును' రుద్రదేవుఁ డేకాంతమున నుండుటచే నంతరంగము బహిర్గతము కాలేదు గాని యిందు గుప్తము కావింపవలసిన రహస్యమేమియు లేదుగదా! సోమనాథునకు మహాదేవరాయలు వర్ధమానపురమున కేగుటయు, సైన్యము తిరిగి వచ్చుటయు, నశ్వము బెదరివచ్చుటయు నివేదించెను. సోమనాథున కీ రహస్యభేదనమునకు మార్గములు కన్పింపవాయెను. మహాదేవరాయల వృత్తము కొంచెమేని, గొప్పయేని వర్ధమానపురముననె గ్రహింపవచ్చును. ఆరహస్య సూత్రముతోఁ బరమార్థమును సాధింపవచ్చునని నిశ్చయించుకొని "రాజా! ఈ రాజభక్తుని కాజ్ఞయొసంగెదరేని మహాదేవరాయల వృత్తాంతము గ్రహించి తిరిగి రాఁగలఁడు. సోమనాథుఁడు మీ కొక సహాధ్యాయియే కాఁడు; భటుఁడు, పౌరుఁడు, దేశికుఁడు గూడనై యున్నాఁడు. మహాదేవరాయలు నా కంతరంగ మిత్రుఁడు. పాలకుని శాంతి గాపాడుటకాక, మిత్రాన్వేషణము సైతము నాకు ధర్మమై యున్నది. ఆజ్ఞయే తడ" వని వాకొనెను. రుద్రదేవచక్రవర్తికి మహాదేవరాయల వియోగముచేఁ గలిగిన వెతకంటె సోమనాథుని వీడ్కొనుటయే మిగుల వెతగ నుండెను. కాని

సంవత్సరములు గడచుచుండెను. అతఁ డధిష్ఠించిన యశ్వము సంస్థానమునకుఁ జేరెను. సేన చాలకాలముక్రిందనే వెనుకకు మఱలివచ్చెను. సంధియో, సంగ్రామమో నిశ్చయము చేసికొని భీమరాజసందర్శనము చేయుటయో తడవుగ రాఁదగిన మహాదేవరాయలు రామిచే రుద్రదేవచక్రవర్తి లోలోనఁ బరితపించుచుండెను.

మహాదేవరాయలు చక్రవర్తికి సహోదరుఁడె కాదు, కుడిభుజము, మంత్రి, క్షేమాభిలాషి. ఇన్ని బాధ్యతలు గల సోదరుఁడు కాననిక్రంతల కేగి వర్తమానమేని తెలియకున్నఁ గల్గు విచారము కేవల మనుభవైకవేద్యము. చక్రవర్తి సోదరుని యునికిఁ దెలిసికొనఁ దీవ్రయత్నములు చేయనిశ్చయించికొనెను. సోదరుఁ డింక వచ్చునింక వచ్చునని చాలకాలము నిరీక్షించెను. సహజపరాక్రమశోభితుఁడు, భ్రాతృభక్తిపరాయణుఁడు, సుశీలుఁడు నగు సోదరుఁడు కార్యాంతరవ్యాప్తిచే నాగియుండుఁగాని లేకున్న నింతకాల ముపేక్షించునా? యని చక్రవర్తి నేఁటి వఱకు నిబ్బరించెఁగాని క్రమముగ నా నిబ్బర మంతరించెను. చక్రవర్తి యాందోళనముతో వివర్ణవదనుఁడై యున్న తరుణమున సోమనాథకవి యట కేతెంచెను. ఇతఁడు చక్రవర్తికి సహాధ్యాయి. చక్రవర్తియొద్ద నేవిషయమునేని ఖండితముగఁ దెలుపుటకు యుక్తాయుక్తములు శాసించి చెప్పుటకు నీతని కున్న చనవు, సాహసము మఱియొకరికి లేదు. ఆకాలమున దేశమంతయు జైనమతాభిమానభూయిష్ఠ మగుటవలనను, తాను శైవమతద్వేషియగుటవలనను సోమనాథుఁడు సర్వజన

రంజకుఁడు కాకపోయెను. కాని విరోధులు సైత మాతని గుణగణముల శ్లాఘించుచుందురు. సోమనాథుఁడు చక్రవర్తిని సమీపించి, వినయముతో నిట్లనెను. ‘రాజా! ఏల యాలోచనమునఁ బరవశుఁడవై యున్నాఁడవు. నేను వినఁదగి యున్న సాదరమున సెలవిమ్ము. నీయాందోళనమునఁ బాలుపంచికొని శక్తియున్నఁ బ్రతిక్రియఁ గావింతును’ రుద్రదేవుఁ డేకాంతమున నుండుటచే నంతరంగము బహిర్గతము కాలేదు గాని యిందు గుప్తము కావింపవలసిన రహస్యమేమియు లేదుగదా! సోమనాథునకు మహాదేవరాయలు వర్ధమానపురమున కేగుటయు, సైన్యము తిరిగి వచ్చుటయు, నశ్వము బెదరివచ్చుటయు నివేదించెను. సోమనాథున కీ రహస్యభేదనమునకు మార్గములు కన్పింపవాయెను. మహాదేవరాయల వృత్తము కొంచెమేని, గొప్పయేని వర్ధమానపురముననె గ్రహింపవచ్చును. ఆరహస్య సూత్రముతోఁ బరమార్థమును సాధింపవచ్చునని నిశ్చయించుకొని “రాజా! ఈ రాజభక్తుని కాజ్ఞయొసంగెదరేని మహాదేవరాయల వృత్తాంతము గ్రహించి తిరిగి రాఁగలడు. సోమనాథుఁడు మీ కొక సహాధ్యాయియే కాఁడు; భటుఁడు, పౌరుఁడు, దేశికుఁడు గూడనై యున్నాఁడు. మహాదేవరాయలు నా కంతరంగ మిత్రుడు. పాలకుని శాంతిగా పాడుటకాక, మిత్రాన్వేషణము సైతము నాకు ధర్మమై యున్నది. ఆజ్ఞయే తడ” వని వాకొనెను. రుద్రదేవచక్రవర్తికి మహాదేవరాయల వియోగముచేఁ గలిగిన వెతకంటె సోమనాథుని వీడ్కొనుటయే మిగుల వెతగ నుండెను. కాని

భ్రాతృప్రేమముం దా యంతరంగ వికృతులు, స్నేహధర్మములు నిలువలేదు. రుద్రదేవుఁడు మిత్రుని కాజ్ఞ యొసంగుచు 'నార్యా! 'వర్ధమానపురము మొదలుకొని యావలి దేశమంతయు జైనమతస్థుల కాటపట్టు. నీవు జైనమత ద్వేషివి. వీరశైవ మతస్థాపకుఁడవు. సామ్రాజ్యమున శాంతి స్థాపింపఁబడిన పిమ్మట మతసంగ్రామములలోఁ బ్రవేశింపవచ్చును. ముందు మహాదేవరాయాన్వేషణమె ప్రధానలక్ష్యముగ భావించి విధానము నెఱవేర్పు" మనెను. సోమనాథుఁడు "ఆహా! నిర్బంధితుఁడ నైతిని గదా" యనుచు సెలవు గోరి నిర్గమించెను.

చక్రవర్తిహృదయము పరిపరి విధములఁ బోవుచుండెను. చిన్నతనమునఁ బితృవియోగము గల్గెను. మాత సహగమన మాచరించెను. కనులఁ గానని కందువగు మహాదేవరాయలచక్రవర్తిని మిగుల గారవమునఁ బెంచెను. మాటిమాటి కాతని హృదయదృష్టికి సోదరుని యాకారము గనుపించుచుండెను. అస్వస్థహృదయముతో నాయన యాస్థానమున క్షణమునేవేని నిలువఁజాలఁ డయ్యెను. చంచలమగు తన హృదయము చూపినదారి నాతఁ డప్రయత్నముగ నడువసాగెను. ఆ యవస్థాంతరమునఁ జక్రవర్తికి గమ్యాగమ్యము, యుక్తాయుక్తము, ధర్మాధర్మము నిరూపించు భావనాశక్తి నిశితముగ నున్న దని వాకొనఁజాలము. రుద్రదేవుని వెంట వసుచారానుగుణముగ భటవర్గము బయలువెడలెను. ఏకాంతవాసమునకు నలవాటుపడిన యా చక్రి

వర్తికిఁ బరిచారసంసర్గ ముచితముగఁ దోఁచదయ్యెను. కనుల తోడనె యనుయాయివర్గమును వెనుకకు మరల్చెను. చక్రవర్తి యశ్వశాలకు ముందు వెళ్లి తురంగము లన్నింటిని జూచెను. యజమానిమచ్చికచే వాల మించుక యెత్తి శిరమును గదలించుచు నశ్వము లన్నియు సకిలించెను. అశ్వముల సందర్శనముతోఁ జక్రవర్తి కా ప్రీతికరయుగములలోఁ గొన్ని గడచెను. ఆ యవస్థలో ముందు గడుపవలసిన కాలమెక్కుడని మాత్రము స్ఫురించుచుండెను. అశ్వశాలలోఁ జివరనున్న శ్వేతాశ్వమె మహాదేవరాయ లధిష్ఠించినది. చక్రవర్తి దానిని సమీపించి 'తురంగమా! సోదరునివృత్తాంతము నెఱింగింతువా?' యని మేను చఱచెను. సహజమగు ప్రభుభక్తిప్రదర్శనముచే బరిపాలకు నది తృప్తిపఱచెను. తురగముకంఠమున నొక సువర్ణహారము మెఱయుచుండెను. చక్రవర్తి దానిని జాగరూకతతోఁ దీసి యశ్వపాలకులఁ బిల్చి యీ హార మెచ్చటి నుండి వచ్చినదని ప్రశ్నించెను. అశ్వపాలకులు చక్రవర్తితో తురంగ మీ హారముతోనే లాయమునకుఁ జేరినది. హారమును దీసి సమ్ముఖములో నుంపయత్నించితిమి గాని మే మెన్ని విధములఁ బ్రయత్నించినను సాధ్యము కాదయ్యెను. చిన్న దొరవారు కట్టించిరేమో యని మేము మిన్నకుంటి మని యశ్వపాలకు లెఱింగించిరి. చక్రవర్తి యా హారమును బరిశీలించి యిది మన సంస్థానములోనిది కాదు. హారవృత్తాంతముతో నాసోదరుని జీవిత మించుకేని సంబంధించి యుండనగు నని చక్రవర్తి యశ్వశాలనుండి యా హారముతో నిర్గమించెను.

సమీపమున బాలసముద్రమను నొక తటాకముకలదు. తటాకతీరమున మాధవవర్మ స్థాపించిన రొయొక జయ స్తంభము చెంతనొక జీర్ణాలయముగలదు. చక్రవర్తి యాలయములోనికేగి, లింగమును సందర్శించి, యా హారమును నందీశ్వరుని కంఠముస కలంకరించి యర్చకులతో నిట్లు జెప్పెను. యాత్రికులెవరేని యాలయమునకు వచ్చినపు డీ హారమును గుఱించి చేయుప్రసంగములను శ్రద్ధతో నాలించి యాస్థానమున నెఱింగింపవలయును. ముఖ్యముగ వర్ధమానపురము, కందూరుప్రాంతముల నుండివచ్చు శైవభిక్షుకులకు, జైనభిక్షుకులకు నీ హారమునుపాయాంతరముచే జూపి ముఖ్యాంశముల నెప్పటి కప్పుడు నివేదింపవలయును". చక్రవర్తియాలయమును వదలి బాలసముద్రప్రాంతమునుండి రాజమందిరాభిముఖుఁడై బయలు వెడలెను. అప్పుడు చక్రవర్తిహృదయమున భృత్యులవలన నెట్టికార్యము నేని సాధింపవచ్చు నను నూహాజనించెను. ఆ యూహను దన మధురకవితాధారచేఁ గొంతసేపటికి

ఉ. "కొందఱ మేలమాడుటలు కొందఱి వావులుదీర్చిపిల్చుటల్
కొందఱ ముద్దుఁజేయుటయుఁ గొందఱ నెయ్యపుఁజూపు
చూచుటల్
కొందఱి నాత్మభావ అమన్ననభృత్యులందు ని
ట్లొందఱ నన్నిభంగుల నృపాగ్రణి వశ్యులఁజేయఁగాఁ
దగుఁ."

అను నొక పద్యముగా మార్చి దానినె పఠించుచు ఆస్థానము నలంకరించి యా పద్యమును సభాసదుల కెఱింగించి

భావము నుద్బోధించెను. లేఖకుఁడా పద్యమును నీతిసార ములోని రాజధర్మాధికరణమునఁ జేర్చెను.

---

## రెండవ ప్రకరణము.

హనుమకొండకు సమీపమున నొకచిన్న గుట్టకలదు. అచటఁ బద్మాక్షియను నొక దేవత కలదు. మొదట నాట వికులా దేవిని బూజించుచు నొకచిన్న యాలయమును నిర్మించిరి. పిమ్మట జైనులు దాని నభివృద్ధిపఱచి భక్తిశ్రద్ధలతో నాలయమించుక యభివృద్ధి పఱచిరి. కాలక్రమమున నాప్రాంతమున జైనమతము వ్యాప్తిలోనికి వచ్చుటవలనను, సామ్రాజ్యస్థాపకుడగు ప్రోలరాజు జైనమతాభిమాని యగుటవలనను మన కథాకాలమునఁ బద్మాక్షియాలయము మిగుల వైభవోపేతముగ నుండెను. జైనులు తమ పురాణములలోఁ జేర్పఁ బడిన యిరువది నలుపురు శాసన దేవులలోఁ బద్మాక్షి నొకతెగాఁ భావించిరి. శైవులు కాళియొక్క యవ రావతార మనిరి. జైనమతవ్యాప్తిని సోమనాథకవి తన హేతువాదముతో నడంచి పద్మాక్షిని భద్రకాళియని వ్యవహరించెను. రుద్రదేవ చక్రవర్తి యీ మతాందోళనమునఁ దటస్థుఁడుగా నుండుటవలనను, శైవులసాహస మతిశయించుటవలనను జైనుల కాయాలయమునఁ గ్రమముగ స్థానములేదయ్యెను.

ప్రోలరాజుమంత్రి స్థాపించిన శిలాశాసన మొకటి పద్మాక్షీదేవ్యాలయమునఁ గలదు. రుద్రదేవుని పూర్వులంద ఱా దేవిని భక్తిశ్రద్ధలతోఁ బూజించిరి. కావుననే చక్రవర్తి యపుడపు డేకాంతముగఁ బద్మాక్షీ దేవాలయమునకేగి వచ్చుచుచుండును. సోమనాథకవి యపుడపుడు బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, బసవరగడ లోనగు స్వకీయగ్రంథములఁ బురాణము చెప్పి, పామర జనమునకు భక్తిశ్రద్ధలు గలిగించి పద్మాక్షీ భద్రకాళియవతారమని యపుడపు డుద్బోధించుచుండును. ఆ కాలమున సోమనాథునిపై జనసామాన్యమునకు భక్తిశ్రద్ధలు కలవు.

ఈశ్వరపరత్వము దెలుపు నితని గ్రంథభాగములు వినుటకై పరతెంచిన శైవసమూహముతో నావృతమై పద్మాక్షీయాలయము నేత్రపర్వముగ నుండును. నే డా యాలయమున నొకసన్యాసిని దేవిసమీపమున వసించియుండెను. సహజమగు నా సన్యాసినిసౌందర్యము కాషాయవస్త్రధారణమువలనఁగాని, శుష్కోపవాసమువలన గాని నింతయేని తగ్గియుండలేదు. ధ్యాననిశ్చల దృష్టితో, నేకాంతనిష్ఠతో, నవయౌవనమం నే పరమార్థముకొఱకు సంన్యాసిని వ్రయ మొనరించుచున్నదో యెవరికిని దెలియదు. హృదయదృష్టికి గానవచ్చు నేపరమాణు స్వరూపమునో, ఏ స్థూలవిగ్రహమునో యుపాసన మొనరించి ధ్యానముతో నచట నాసీనురాలై యుండెను. హనుమకొండప్రజల హృదయములయం దా సన్యాసినిపై భక్తి శ్రద్ధలు మెం డగుటచేఁ

వారలు ఫలములు, పాలు నా సన్యాసిని కొసంగి పోవు చుండిరి. నిరాహారవ్రతమె నియతిఁగాఁగల యా సన్యాసిని వారదత్త పదార్థము నంతయు దేవికి నివేదన మాచరించి, యందుఁ బ్రాణధారణమున కావశ్యక మగునంతవఱకె స్వీకరించి దినములు గడపు చుండెను. ఎవరును నా సన్యాసి నితో భాషింప సాహసింపరైరి. అది దేవతాశైలమనియు, దేవతలు దివ్యకుసుమములతోఁ బద్మాక్షిని పూజింతురుగాన రాత్రికాలమున నాలయము నిర్మానుష్యముగ నుండవలయు ననియు విశ్వసించు జానపదులకు సన్యాసినిసాహసము, నిషాతి శయము, ఏకాకినిగ నాలయమున వసించుట విస్మయజనక ముగ నుండెను. క్రమముగఁ బద్మాక్షి మానినీరూపముగ నాలయము నలంకరించెనను ప్రవాదము జనించెను. ఆ శాంత తేజము, ఆ ధ్యానమోహనసుందరాననము, ఆ భక్తివైరా గ్యముల స్ఫురింపఁజేయు వేషభాషలు ప్రజల కానంద జన కము లగుటచే ననేకులు వచ్చి పద్మాక్షిని, సన్యాసినిని సంద ర్శించి మ్రొక్కి వెడలుచుండిరి. సన్యాసిని మ్రొక్కుల నందు కొనుట లేదు. భక్తులఁ గడకంటనేని సానుగ్రహముగఁ దిల కించుట లేదు. అది సన్యాసవ్రత ప్రభావమే. క్రమక్రమ ముగఁ బద్మాక్షి దేవళమొక శాంత్యాశ్రమముగ మాఱి పోయెను. సమీపముననున్న జైనవిగ్రహములలో సన్యాసి నియు నొక విగ్రహమువలె నట స్థావర మేర్పఱచికొనియెను. జైనభక్తులు, శైవులు సన్యాసినిని సందర్శించి వెడలు చుండిరి. భయదవ్యాఘ్ర భల్లూకాది దుష్టమృగాకరమగు

నా శైలమున నహింసయను ధ్వని మాఱుమ్రోగుచుండెను. సన్యాసిని యా శైలమున నధివసించి సంవత్సరమునకు మూఁడు మాసములు తక్కువ. గ్రామమునుండి ఫలాహార భిక్ష తనకుఁ జేరనినాఁడు మాత్ర మాయమ సంజవేళ తంబురా మీటుచు మధురగాన మొనరించుచు రాజవీథిని బయలు వెడలుచుండును. ఎవఁ డేకోలఁదిభిక్ష నొసంగినను భక్తిశ్రద్ధలతోఁ జేకొని కొండపైకిఁ జేరి యట భుజించి కాల మును గడపుచుండెను. మిట్టమధ్యాహ్నము వేళ యా శైలమున ప్రకృతి, సహజ శాంతముతో సన్యాసినికి సహాధ్యాయినివలె నిశ్శబ్దముగ నుండును. సన్యాసిని యా సమయమునఁ బద్మాసీ సమున్నతమున నాసీనయై యాముష్మికబోధకములగు పవిత్ర గ్రంథములు పఠించుచుఁ దా నార్జించిన విజ్ఞానసారము మాతృభాషలో లిఖించుచుఁ గాలక్షేపము నొనరించుకొను చుండును. పరు లెవరేని యా శాంతసమయమున నాలయ మున కేతెంతురని ద్వారముల బిగించి సన్యాసిని మధ్యాహ్న మంతయు దేవిసమక్షమున నేకాంతముగ గడుపుచుండును. రాజమందిరమున విజయభేరి మ్రోఁగిన సమయమున కాయమ ద్వారములఁ దెఱచి యుచితస్థానము నలంకరించి పూర్వరీతితపో నియమములతోఁ గాలముగడుపుచుండును. బ్రహ్మచర్యపవిత్ర తేజ ముతోఁ బ్రకాశించు సన్యాసిని శాంతమూర్తి విషయలోలురకు వైరాగ్యమునుబ్రసాదింపఁజాలి నయనానందకరముగ నుండెను.

నాఁడు నగరవాసు లెవ్వరును భిక్షఁ దెచ్చియొసంగనందున తంబురా గొని సన్యాసిని వానుమకొండ రాజవీథులలోఁ బర్య

టనము నాచరింప బయలువెడలెను. అప్పటికి బాగుగఁ బ్రొద్దు కుంకలేదు. పసిబాలు రందఱు నాయమవెంట నిశ్శబ్దముగ వచ్చుచుండిరి. ఆ గానము బాలుర నాకర్షించెనో, యందలి భావమె యాకర్షించెనో తెలిసికొనుట యసాధ్యము. ఆర్యమ గేయము పసిబిడ్డలకు సైతము గ్రాహ్యమగు మృదుమధుర శైలిలో నుండెను. ఒక్కొక్క గృహముకడ రాగ మాల పించి, యొక గృహముకడఁ బల్లవి నారంభించి, వేఱొక గృహ ముకడ గీతము ముగించుచు యోగిని సంచరించుటచే నా గాన రసము, ఆ భావసంపద గృహాంతర్వాసుల కంతగ నాకర్షింపఁ జాలదయ్యెను. నాఁడు భీష్మైకాదశియగుటచే నుపవాసదిన మని సాహసించి యేగృహస్థుఁడేని భిక్ష యొసంగఁడాయెను. పుణ్యదివసముగాన సన్యాసిని నగరసంకీర్తనమునకె బయలుదేరి యుండునని గృహస్థులు నిర్ణయించుకొని ద్వారముకడ కేతెంచి సగౌరవముతోఁదిలకించి పౌరులు వెనుక కేగుచుండిరి. యోగిని ప్రతిగృహస్థుని దిలకించుచు, వారిని సాదరముగఁ జూచుచు రాజవీథికిఁ జేరెను. ప్రతి ద్వారముకడ నించుకించుక సేపు నిలుచుచు సన్యాసిని,కడకు రాజమందిరము కడ కేతెంచి యటఁ దన మధురగానముచే, యువతీవర్గము నాకర్షించెను. సన్యాసిని రాజద్వారమున కభిముఖముగా నిలిచి యీలా లేత పంజరావికిఁ బ్రాణముపోయునటుల యువతికదంబము తన్మయు లగునటుల మృదుస్వనముతో నించుకసేపు గానమొనరించి నిలిచియుండెను. రసప్రపంచమున మునింగిన శ్రోతలు బాహ్యప్రపంచము మఱచి శ్రవణములు, హృదయము భావన

గీతముపై, రాగముపై, సన్యాసినిశాంతస్వరూపముపై లగ్న మొనరించి చుట్టు నిలిచి యుండిరి. సన్యాసిని యా జనమధ్య మున నిలిచి గళమెత్తి పాడుచున్న మధురగీతమిది.

"జోడుకోడలరీతి సోదరుం డీవు
నరుగుచుండెదరుగదా, బలరామ!
ఒక్కండవై యేల యున్నాఁడ విచట
పలుతెఱంగుల నిట్లు బలవించెదేల
వేఁడినిట్టూర్పుల విడిచెదవేల
శోకతప్తుండవై చూచెదవేల
అదిగో! తృణావర్తుఁ డనుజుఁ డేగొనియె
బంధించె నదె కాలపాశంబుచేతఁ
గొనిపోవుచున్నాఁడు కూ్రరాశయమున
గోపికాంకములందుఁ గులుకుచిన్నారి
నందునిచిరతరానందఫలంబు
శ్రీకృష్ణుఁ డేవెతఁ జెందుచున్నాఁడొ?
బలరామ! బలరామ! బ్రతికించుకొమ్మ
అసురుండు మనుజమాంసాశనుం డగుట
దఱచి చెప్పచునుంటి దయజూపుమయ్య."

ఆలోచనాధీనమగుహృదయముతో వార్ధక్యగ్రముసఁ బ్రచారముఁగావించుచున్న చక్రవర్తి యాగీతమునంతయు శ్రద్ధతో నాలకించి యాతురుఁడై ద్వారముచెంతకు వచ్చెను. సన్యాసిని యఱమోడ్పుకనులతోఁ బాదములించుకఁ జలింపజేయుచు దంబుర మీటుచు మఱల బూర్వగీతము నంతయు నొకమాఱు

బాడి యటనుండి యథేచ్ఛముగ వెడలిపోయెను. చక్రవర్తి హృదయము రసతరంగిత మయ్యెను. ఆ సన్యాసిపవిత్రస్వరూప సందర్శనముచేతనే చక్రవర్తి, దివ్యత్వము నొందితినని భావించెను. తాను శ్రవణపుటముల గ్రోలినది గానామృతమొ, యమృతమొ నిర్ణయింపఁజాలు వివేచనాశక్తి యంతరించెను. కాని గీతమందలి భావముమాత్ర మాతని హృదయమును గలఁచివేయుచుండెను. తనభవిష్యజ్జీవితమంతయు నాగీతమున నెలగ్నమై యున్నదనియు, దివ్యవాణి శుభాశుభముల, నాగామి విశేషముల నిటుల నుపశ్రుతిగ బోధించెననియుఁ జక్రవర్తి తలంచెను. తన్మయత్వముననున్న చక్రవర్తి, సన్యాసి యేగిన యంశము నెంతసేపటికో తెలిసికొనెను. శ్రవణములముందా మనోహరగాన మింకను బ్రతిధ్వనించుచునే యుండెను. కనులముందా సన్యాసిమనోజ్ఞమూర్తి కనవచ్చుచునే యుండెను. భావనాశక్తినిమాత్రము శ్రవణములకు, హృదయమునకు వ్యతిరేకముగ యుక్తధర్మమున నియోజించి సన్యాసి యటనుండి కొలఁదిదూరము పోయినటుల రుద్రదేవుఁడు తెలిసికొని దీపశిఖవలెఁ జలించుచు హర్మ్యమున కేగెను.

నిశ్శబ్దము, శాంతిమంతమునగు హర్మ్యాగ్రమున నొక పర్యంకముపైఁ జక్రవర్తి కూర్చుండెను. ఆయననయనముల ముందు వివర్ణవదనుఁడై సోదరుని యాగమనంబు గోరు బలరామునిసుందరాననము, భయవశమునఁ గంపితాంగములతోఁ బరుగెత్తు గోపకాంతల చంచలభావము ప్రత్యక్షమయ్యెను. ఈ ప్రదర్శనమునకు సన్యాసిమధురగానమే కారణమని వక

పాలుఁ జెఱుంగదు. తాదాత్మ్యమున నంతటివివేచన ముండు నా? సన్యాసినీభావగీతము చక్రవర్తికి సంతోషము కంటె నాందోళన మెక్కుడు జనింపఁజేసెను. గీతభావమును యోజించినకొలఁది ననేకవిధములఁ దోఁచెను. ఆ గీతమంతయు దనను గూర్చినదే యనియు, నాసన్యాసిని తన కుచితధర్మము నుద్బోధింపవచ్చిన భరతమాతయనియు నిశ్చయించుకొనెను. ఆయమ నివాసము లెఱింగి రేపటి ప్రాతఃకాలమున సందర్శనమున కేగవలయునని సంకల్పించుకొనెను. ఆ సంకల్ప మంతతోనే యంతరించెను. నిష్కాముకురాలు, యౌవనవతియునగు నా యోగిని, యువకుఁడు, చక్రవర్తియునగు దనతో భాషించుట యసంభవమని యూహించెను. మఱలఁ జక్రవర్తి హృదయము భావగీతము పైకిఁబోయెను. మహాదేవరాయలు బంధితుఁడై యున్నాఁడు. ముందెట్టివిపత్తులకు లోనుగా నున్నాఁడో కాపాడుకొమ్మను సన్యాసినిదివ్యవాణి మానసమును గలఁచివైచెను. ఎంతయోజించినను గీతము తన సోదరునకును, దనకును నన్వయించునటుల భాగవతకథాంశమున కన్వయించుటలేదని చక్రవర్తి నిశ్చయించుకొనెను. కాని యా నిశ్చయము నిలుకడగ నుండలేదు. నాటిరాత్రియంతయు సోదరుఁడు కారాగారమున నెచటనో బంధింపఁబడినట్లును, యోగిని తన మంత్రప్రభావముచే విడిపించి మాఱువేసముచే వెంటఁగొనివచ్చి ద్వారమం దుంచినట్లును, సోదరుని గుర్తింపఁజాలనందులకుఁ దమ్ముఁడు పరిహసించినట్లును కలలఁగాంచుచు రాత్రియంతయు జాగ్రత్స్వప్నావస్థలతో, భ్రమాందోళనములతోఁ గడపెను.

ఇంతలో ద్వారముముందుఁ బ్రభాత మంగళగీతములు. మంగళ వాద్యములు వినవచ్చెను.

---

## మూఁడవ ప్రకరణము.

కందూరురాజ్యము ధర్మబద్ధముగ, న్యాయానుకూలముగ గోకర్ణుఁడు పాలించుచుండెను. ఇంకఁ గొంతకాలము పాలించి యుక్తవయస్సు వచ్చినపిమ్మట సంస్థానమును వసుంధర కొప్పగించి మలయవతితోఁ గలసి జైనాశ్రమములోఁ జేరవలెనని గోకర్ణుని సంకల్పము. వాగీంద్ర చూడామణి వృద్ధుఁడయ్యెను. ఆయన పరిపాలించు జైనపీఠమునకు శారదాపీఠమని పేరు. అచట నమూల్యములగు గ్రంథము లనేకములు కలవు. అందనేకములు శిథిలావస్థలో నుంటచే విద్యార్థులఁ బెక్కండ్రఁ జేర్చికొని వారలచేఁ బ్రత్యంతరముల వ్రాయించుచు నా శారదాపీఠము చెంతనే జీవితశేషమును గడుపుచుఁ గాలక్షేప మొనరించుచుండెను. వాగీంద్రుఁడు కొలఁది కాలముక్రింద గోకర్ణునకు శిష్యముఖమున నొక సందేశము నంపెను. అందలి సారాంశ మిది. "మిత్రమా! గోకర్ణా! రాజపదవి యధర్మజనకము, రాజస చిహ్నమని బాల్యమునఁ బరిత్యజించితివి. జైనాశ్రమ ధర్మములు నీ వలె నెఱింగిన పండితకవి మధ్యరాష్ట్రమున నీ వొక్కఁడవు దక్క యన్యులు లేరనుట నతిశయోక్తిగ భావింపకుము. నా

దేహము పక్వదశకు వచ్చినది. శిష్యుఁడవు, విధేయుఁడవై సందు లకు నేను నిన్నుఁ గోరు గురుదక్షిణ శారదాపీఠమును నా యనంతరము ధర్మపత్నీయుతముగఁ బాలింపుమని. నాయాన సెలవేర్తు వేని కృతార్థుఁడ. ప్రత్యుత్తరము నపేక్షించెద.

వాగీంద్రుని సందేశము గోకర్ణుఁ డాలించి నివ్వెఱపడెను. తన నెంతకాల ముండిరో "సమయము వచ్చినచో నే నొక సాహాయ్యము కోరెదను. కావింపవలయును సుమా" యని వాగీంద్రుఁడు అనుచుండెను. కాని గోకర్ణునకు శారదాపీఠ పరిపాలనమని స్ఫురింపలేదు. శిరసావహించి చేయుదునని వినయముతోఁ బ్రత్యుత్తరము నొసంగుచుండెను. ప్రతిజ్ఞాపాలనము చేయవలసిన యవసర మిపుడు గోకర్ణునకుఁ గలిగెను. వాగీంద్రుని యాజ్ఞ యనుల్లంఘ్యము. గోకర్ణుఁ డిపుడు యోజించు విషయములు రెండు. ఒకటి పీఠపరిపాలనమునకు నే నర్హుఁడనా? యని. ఇదియొక గొప్ప సంశయము కాదు. ఈ సంశయము నివారించుకొనవలసిన యవసరము సైతము గోకర్ణునకు లేదు. తాను ప్రతిజ్ఞాబద్ధుఁడై యున్నాఁడు. అర్హుఁడగుఁగాక, యనర్హుఁ డగుగాక. అది కాలక్రమమునఁ దెలియవలసిన యంశము. అంతియకాని శారదాపీఠము బాలింప నెట్టియభ్యంతరమును దెలుప సత్యప్రతిజ్ఞానిగళబద్ధుఁడగు గోకర్ణునకు స్వాతంత్ర్యము లేదు. వసుంధరకు యుక్తవయస్సు వచ్చుచున్నది. మలయవతి యాయమను సుతనిర్విశేషముగఁ బెంచెను. పౌరులందఱు నేకముఖముగ ననురూపవరునకు వసుంధర నొసంగి పిమ్మటనే శారదాపీఠమున కేగవలయునని గోకర్ణుని,

మలయవతిని నిర్బంధించుచుండిరి. ప్రీడావతియగు వసుంధరయుఁ దనకు సర్వవిధముల జననీజనకులగు నాపుణ్యదంపతులుఁ జైనాశ్రమమున కేగుదురను సంశయము వినినదే మొదలు విచారముతో వివర్ణ వదనయై యుండెను. కనిన మరులకంటెఁ బెంచిన మరులె యెక్కుడని జనసామాన్యము చెప్పునటులఁ బెంచిన ప్రేమముచే గోకర్ణునకు, మలయవతికిఁ గర్తవ్యము తోఁచదయ్యెను. అనురూపవరనిర్ణయము సామాన్యకార్యము కాదు. ఆ విషయమున నెంతికాలము నుండియో గోకర్ణుఁడు, మలయవతి యంతరంగమున యోజించుచుండిరి.

భీమరాజు వసుంధరాశ్రేయోభివృద్ధుల సహించువాఁడు కాఁడు. చండశాసనుఁడు, దురహంకారి యగు భీమరాజు నెఱింగిన హేమండలేశ్వరుఁడేని యీసంబంధమునకు వెఱచుచుండెను. కార్యవాది, శాంతమూర్తి, అహింసావ్రతుఁడగు గోకర్ణుఁ డీ యంశమున గర్తవ్య మూఢుఁడై విచారించుచుండెను. సజ్జనుని సాహాయ్యముకంటె దుర్జనుని సాహాయ్యము ప్రతికార్యమున ముఖ్యము. కావున భీమరాజువాకాసాహాయ్యమును దీసికొన గోకర్ణుఁడు నిశ్చయించెను. మలయవతి మాత్ర మీయంశమున గోకర్ణునకు భిన్నాభిప్రాయము నొసంగెను. సాధకబాధకములు గోకర్ణునకు మలయవతి నివేదించి పూర్వ దుష్కృత్యములు, భీమరాజు తుంటరితనములు జ్ఞప్తికిఁ దెచ్చెను. గోకర్ణుఁడు శాంతవచనములతో మలయవతికిఁ బెక్కువిధముల నుచిత ధర్మ ముద్బోధించి భీమరాజునకు లేఖ పంపుట కంగీకరింపఁ జేసెను. గోకర్ణుఁడు వసుంధరా పరి

ణయభారముచే భీమరాజునకు లేఖనంపుటకు విధిలేక యంగీకరింప వలసినందులకుఁ దనలో విచారించెను. విలాసమందిరములోని కథయంతయు స్ఫురించెను. అన్నియు మఱచి గోకర్ణుఁడు భీమరాజున కొక లేఖవ్రాసి దానితో వసుంధరా ప్రతిబింబము నొకదానిని జతపఱచి యొక జైన భిక్షుకున కొసంగి త్వరలోఁ బ్రత్యుత్తరముఁ దెమ్మని వర్ధమాన పురమునకుఁ బంపెను.

వసుంధర రూపవతి; గుణవతి. వాగీంద్రుఁడు గోకర్ణునకు వ్రాసినలేఖ నాయమ రహస్యముగఁ బఠించెను. తన కచిరకాలమున గలుగనున్న జననీజనకుల వియోగమునకు హృదయము తల్లడిల్లెను. అసహాయస్థితిలోనున్న దనను గోకర్ణమలయవతుల నిర్గమనానంతరము భీమరా జెట్టియవస్థల పాలు గావింపనున్నాఁడో యని చాల విచారము నొందెను. దుఃఖమునంతయు హృదయములోనె నుంచుకొనవలసి వచ్చెను. ఇంకను గోకర్ణుని యభిప్రాయము తెలియలేదు. వాగీంద్రుని లేఖ గుప్తముగా గోకర్ణుఁడుంచెను. కాన తనభవిష్యజ్జీవితము గోకర్ణుని సమక్షమున నిర్ణయింప వసుంధరకు వీలుకాదయ్యెను. తానుస్సైతమూజైనాశ్రమమునఁబ్రవేశింప సర్వసిద్ధముగ నుండెఁగాని,గోకర్ణు డంగీకరింపఁడని యూయమ యెఱింగియుండెను. గత్యంతర మూయమకుఁ దోఁచకపోయెను. ఆలోచనాధీనహృదయయైయున్న వసుంధరను సమీపించి గోకర్ణుఁడు, మలయవతి ప్రసంగానంతరముచేఁ గాలము గడిచెను. అనురూపవరనిర్ణయమునకు వసుంధరను స్వాతంత్రము

వహించుట యుక్తమని యుద్బోధించిరి. సిగ్గుచే మోము వంచిన వసుంధరను బుజ్జగించి "అమ్మా! నీవు సర్వవిద్యల సారము గ్రహించితివి. ధర్మము లన్నిటిని తెలిసికొంటివి. పరిణయార్హమగు ప్రాయము వచ్చినది. పరిణయ శుభముహూర్తము కొఱకు నిముసము యుగముగ గడుపుచున్నారము. నీహృదయమేప్రణయమూర్తిని ప్రేమించెనో యా పవిత్రునినామము నెఱింగింతువేని కార్యభారమునకు నడుముకట్టుకొని కృతార్థుఁడనయ్యెదను." అని గోకర్ణుఁడు వసుంధరపైఁ జేయివేసి సానురాగముగ సాదరముగ నుద్బోధించెను. మలయవతి కొన్ని స్వరూపపటములఁ జూపి అమ్మాయీ! చూచితివా? ఇతఁడు కోణదేశాధీశ్వరుఁడగు జైత్రపాలుఁడు. ఇతఁడు మేడరాజు; ఆహవతంత్ర కుశలుఁడు. అదిగో! ఆ పటమునఁ జిత్రింపఁబడినవాఁడె మైళగిదేవుఁడు. చాలకాలమునుండియాంధ్రసామ్రాజ్యముతోఁ బ్రతిఘటించి యభిమానధనమును గాపాడుకొనుచున్నాఁడు. అతఁడు దామరాజు; అశ్వగమనకుశలుఁడు; వీరచూడామణి. అతఁడె మహాదేవరాయలు; ఆంధ్రసామ్రాజ్యాధిపుని సహోదరుఁడు; సర్వసర్వంసహాభరణ సమర్థుఁడు. ఇతఁడె రుద్రదేవచక్రవర్తి; ఆంధ్రరాజులలోఁ బ్రకృతమీతనికి సరియగు రాజు లేఁడు; శీలమున, రూపమున, విద్యయందు నీతనితో నే రాజును దులతూఁగజాలఁడు. సామ్రాజ్యాధిపతిగాన సామంతపుత్రికలఁ బరిణయమాడు నని విశ్వసింపఁజాలము. గోకర్ణుఁడు, మలయవతి యనేక చిత్రపటముల యంశమును గ్రమానుసారముగ వసుంధరకు బోధించిరి.

రుద్రదేవచక్రవర్తిస్వరూపపటముఁ దిలకించునపుడు వసుంధరమొగమునఁ గల యానందము, కనుదోయిని గానవచ్చిన వికసనభావము, కెంబెదవిపైఁ గందళించిన మందహాసము, గండభాగముల నిండిన యామోదసూచన, తదితర చిత్రపట సందర్శనమున జనింపలేదని యా దంపతులు తలంచిరి. మలయవతి, వసుంధరచెక్కులు నివురుచు "తల్లీ! నీ విందెవరి ననుగ్రహించెదవు. కులశీలవయోవిభవములలో నీ చిత్రపటములలో నీ రాజపుత్రు లందఱు సమానులు. నిష్కళంకము, అనన్యసక్తము నగు నీ యనురాగమునకుఁ బాత్రుఁ డగువాని పాదములఁ గడిగి నిన్నర్పించి మేము ధన్యుల మగుదుము. మాకు ధన్యత్వము ప్రసాదింపవలసిన విధి ముఖ్యముగా నీపైఁ గలదు. ఏమి మాటాడవు" అని యిటు లెంత తలఁచి యడిగినను మలయవతితో వసుంధర యొక మాటయైనఁ జెప్పక వాలుగన్నుల నొక చిత్రపటముపైఁ బ్రసరింపఁ జేసి నిశ్చలబుద్ధితో నటులె యుండెను. మలయవతి యింక రెండుమారులు ప్రశ్నించి నిరుత్తరయైన వసుంధరను జూచిచూచి మిన్నకుండెను. గోకర్ణుఁడు, మలయవతికి సైగఁజేసి వాలుచూపులచే నలంకృతమగు చిత్రపటమెవనిదో యతఁడె వసుంధరహృదయాకర్షణము గావించిన ధన్యుఁడు. హంసి కాకిని వరించునా? తన కనురూపుఁ డని వసుంధర రుద్రదేవచక్రవర్తినే యేరికొనినది. కార్యనిర్వాహణము మాత్రము సామాన్యమైనది కాదు. అయినను శక్తికొలఁది ప్రయత్నము చేయుదము. అమ్మా వసుంధరా!

నీ ప్రణయపాత్రుఁడు చక్రవర్తియని నిశ్చయించు కొంటిమి. మా నిశ్చయము ప్రమాదవంతము కాదుగదా యని గోకర్ణుఁడు ప్రశ్నించెను. వసుంధర వ్రీడావనతవదనయై గోకర్ణుని వదనమును విలోకించి మిన్నకుండెను. మలయవతి యా సందర్భము గ్రహించి నాథా! ఆభిజాత్యము ననుసరించి కాంతలు యుందురు. మనము జీవితశేషమును వ్యయపఱచి యనంతరకర్తవ్యమున కున్ముఖులము గావలయును. వసుంధరాచిత్రపటమును జక్రవర్తియొద్దకుఁ బంపుదము. చక్రవర్తి రసికుఁడు, బ్రహ్మచారి, యువకుఁడు. ఆయనహృదయము కందూరురాజ్యలక్ష్మిపై మరలెనా మన ప్రయత్నము ఫలించినటులెఁ యని వాకొనెను. ఈ ప్రసంగసందర్భములో దా నటనే యుంట వసుంధర కభిమతముగ లేదు. సంభాషణ మధ్యమునఁ బోవుఁట జననీజనకులకుఁ గష్టముగ నుండు నేమో యని తలంచెను. గోకర్ణుఁడు వసుంధరభావరహస్య మెఱింగి "అమ్మా! పూర్వపాఠ చింతనములకుఁ దరుణ మైనది. దేశికులు వచ్చి నీకొఱకు నిరీక్షించుచుందురు. అదిగో! సహాధ్యాయినులు ధ్యానశ్లోకములు పఠించుచున్నారు. తడవు సేయకు" మనెను. వసుంధర తన యనురాగదృక్ప్రచారము నొకమాఱు రుద్రదేవుని చిత్రపటముపై నెలకొల్పి మందగమనముతో వెడలిపోయెను.

మలయవతికి, గోకర్ణునకుఁ గార్యసాధనమును గూర్చిన భయము మెండయ్యెను. కాకతీయులకుఁ దమ కంతకమున్న సంబంధ బాంధవ్యములు లేవు. నూతన బాంధవ్యమునకుఁ

చక్రవర్తి యంగీకరించునో యంగీకరింపఁడో. సామంతు లందఱాతనికిఁ దమ పుత్రికల నొసంగుదమని రూపపటముల నంపి యున్నారు. అం దెవతెను బరిగ్రహింప నెంచినటులను దెలియుట లేదు. ఈ పరిస్థితులలో తా మెంతవఱకు గృతార్థులము కాఁగలమో యను సంశయ మాదంపతుల హృదయమును కలఁచి వేయుచుండెను. భీమరాజు దుర్మార్గుఁడు. ఈ బాంధవ్యమునకుఁ బ్రతికూలుఁడు. అతనివలన నెట్టి విపరీత దురవస్థ ప్రాప్తింపనున్నదో కానిమ్ము. అన్నియవస్థలకంటె వసుంధరాభిమతపరిపాలనమె సౌఖ్యదాయకమని యా దంపతులు నిశ్చయించుకొనిరి. ఈ యాందోళనముతో వారికి నిముసములు యుగములవలె గడచుచుండెను.



# నాలుగవ ప్రకరణము

వర్ధమానపురరాజ్య మిప్పటికిఁ జాల మార్పులోనికి వచ్చెను. మహామంత్రి నుద్యోగమునుండి తొలఁగించి మంజరీ సౌభాగ్యవతులఁ దెచ్చువఱకతని, గృహమందె నిర్బంధించి, భటులఁ గావలియుంచి భీమరాజు మిగుల జాగరూకతతోఁ దిలకించుచుండెను. గోకర్ణ పక్షపాతులై పరిపాలనమున మార్పుఁ గావలయునని వాదించు ప్రజాసముదాయమును భేదనీతిచేఁ జీలఁదీసి కొందఱ వధించి, మఱికొందఱ నిర్బంధించి కొందఱను రాజ్యభ్రష్టులఁ గావించి తనకఠినశాసనము వాడుకలోనికిఁ దెచ్చి భీమరాజు యమునివలె శిక్షాస్మృతిని ప్రతి దోషమునందుఁ బ్రత్యభియోగమునందు నాచరణములోఁ బెట్టెను. అధర్మమును వారించువారు లేరు. పరిపాలన లోపమును జూపువారు లేరు. న్యాయపరిపాలనమును నెలకొల్పు మార్గములు లేవు. క్రమముగ సౌభాగ్యవతీమహాదేవరాయల నిర్బంధవార్త దేశమునందంతటను బ్రాఁకెను. మంజరిని ఘోర హత్యకు లోనుగావించినది మహామంత్రి మొదలు ప్రతిమానవమాత్రుఁ డెఱుంగును. కాని న్యాయము బోధించువా రేరి? నిర్దోషియగు మహామంత్రినిర్బంధము • తొలగించువా రేరి? రాజ్యమున శాంతి స్థాపించువా రేరి? ప్రజ లందఱు న్యాయాన్యాయవిచారణముల మాని రాజనీతిఁ జర్చింపక ముగ్ధులై స్తబ్ధులై, భయకంపితులై వర్తించుచుండిరి. మహామంత్రిపదవి క్రమముగ సౌదామిని వహించెను. భీమరాజప్రభుత్వమంత

శాంతిగ నుండెనో యిఁకఁ జెప్పవలసిన దేమున్నది. సైనిక వ్యయము వృద్ధియయ్యెను. యుద్ధపరికరసృష్టి నిత్య మహో రాత్రములు జరుగుచుండెను. కర్మాగారములకుఁ దీఱికలేదు. రాజ్యమునుండి పౌరుఁడెటకేగినను రాజుగారి యానతి కావలయును. పరరాజ్యమునుండి రాజుగారియానలేనిది ప్రవేశించిన వానికి శిరశ్ఛేదనమె. గూఢచారులసంఖ్య మిగుల నభివృద్ధి పఱుపఁబడెను. ప్రజలీ పరిపాలనమునుగూర్చి యెట్లుప్రసంగించిన నే చావువచ్చునోయని యాపరిశంసయే మానిరి. భీమరాజును ధర్మపథమునఁ దిప్పఁగల గోకర్ణుఁడు వర్ధమానపురముతో సంబంధము వదలుకొని చిరకాలమైనది.

భీమరాజు, సౌదామిని కొలువుతీర్చి యుండిరి. అటకొక గూఢచారివచ్చి రాజా! యెవఁడో బ్రాహ్మణునివలె నున్నాఁడు. మహాదేవరాయలతోడను, సౌభాగ్యవతితోడను కారాగారముకడమంత్రాంగముచేసియాయుధశాలచెంత, దుర్గములచెంత విశ్రమించుచు దిరుగుచున్నాఁడు. సెలవైనఁ గొనితెత్తు ననెను. భీమరాజు కొందఱురక్షకభటులను దోడొసంగి వెంటనే గొనితెమ్మని యాజ్ఞయొసంగెను. అప్రియత్నముగ, ననాలోచనముగ వానినటనె వధించి శిరము దెమ్మని తెల్పు భీమరాజు నేఁడేటికో కనికరించెనని భటులానందించిరి. సేవా శృంఖలచే బంధితులగుటచే విధిలేక రాజాజ్ఞ నెఱవేర్తురుగాని పాపభీతి, పశ్చాత్తాపము, పరితాపము భటసమూహమునకు లేదన వీలులేదు. భటులు గూఢచారితో నాజ్ఞాపరిపాలనమునకై సత్వరముగ నేగిరి. కొంతసేపటికొక లౌకిక వేష ధారియగు

బ్రాహ్మణుని భటులు కొనివచ్చిరి. బ్రాహ్మణునకు ముప్పది సంవత్సరములకంటె నెక్కుడుండవు. అతఁడు బ్రహ్మచర్యాశ్రమమున నున్నవాఁడగుటచే శరీరము పుష్టిగలిగి స్వర్ణమువలె మెఱయుచుండెను. కంఠమున నొకరుద్రాక్షసరము, కేలనొక తాటాకుపుస్తకము, బంగారుతలగల గజ్జెలగంటము కలదు. బ్రాహ్మణునిముఖమునభయచిహ్నము లేమియులేవు. రక్షకభటులతో నయ్యో! నేను సంస్థానమున కేలయయ్యా! నేనెప్పుడు సంస్థానములలోఁ దిరిగిన వాఁడను కానయ్యా! నాకు రాజుల ముందుఁ జరింపవలసిన రీతులు తెలియవయ్యా! విడచిపెట్టుఁడయ్యా! యని యుద్ఘోషించుచుండెను. భటు లాఘోషవినాలించియు నాలింకనటులనావిప్రు నీడ్చుకొని భీమరాజుముందు నిలువఁబెట్టిరి. మా గూఢచారులు గొప్ప రాజద్రోహిని పట్టుకొనివచ్చిరేయని సౌదామిని బ్రాహ్మణునిజూచి పక్కున నవ్వెను. బ్రాహ్మణుఁడు కూడ సౌదామినివైపునకుజూఁచి పక్కున నవ్వెను. భటుఁడాయుధముతో బ్రాహ్మణుని పొడువబోయి జాగ్రత్త! సంస్థానమర్యాదలననుసరించి ప్రవర్తింపుమని హెచ్చరించెను. బ్రాహ్మణుఁడు నిర్భయముగ నేను ముందే నాకు సంస్థానపుమర్యాదలు తెలియవు, నన్ను వదలి పెట్టుమని ఘోషించితినిగదయ్యా"యనెను. సౌదామినికి కాక భీమరాజునకుసైతమ మా బ్రాహ్మణునివాక్యములు నవ్వు కలిగించెను.

ఈ బ్రాహ్మణుఁ డెవఁడో అమాయకుఁడగు బాటసారి. ఇతని నొక క్రీడావస్తువుగ నుపయోగించుకొని కాలక్షేపము చేయవచ్చునని భీమరాజు నిశ్చయించి, దోషమున్న బ్రాహ్మణు

నకు శిక్ష విధింతునని గూఢచారిని, రక్షకభటులను బంపి వైచెను. బ్రాహ్మణుఁడు చూచిచూచి "కాలుతీపులెత్తుచున్న"వని చెంతనున్న యాసనముపైఁ గూర్చుండెను. సౌదామిని నవ్వుచు "రాజాజ్ఞలేని దటులఁ గూర్చుండరా" దనెను. బ్రాహ్మణుఁడు రోషించి రాజు న న్నీయాసనముపైఁ గూర్చుండవలదని యాజ్ఞచేయలేదే యని సగర్వముగ భాషించెను. భీమరాజు, సౌదామిని నవ్వుచు నొకరిమొగము నొకరు చూచుకొనిరి. ఇంతలో నొక పరిచారకుఁడు వచ్చి మహారాజా! కందూరు నుంచి గోకర్ణయ్యదొరవా రొక జాబును బంపినారు. వార్తా వహుని కేమి సెలవని విన్నవించెను. రమ్మనుము రమ్మనుము. ఆలస్యమేల? యని సౌదామిని పలికెను. పరిచారకుఁడేగిన వెంటనే వార్తావహుఁడు తాను దెచ్చిన లేఖయుఁ జిత్రిపటమును భీమ రాజుచేతి కొసంగి "గోకర్ణయ్యగారు ప్రత్యుత్తరము తెమ్మని సెలవిచ్చినారు." అనియొక ప్రక్క నిలిచెను. భీమరాజు జాబుఁ దీసి సౌదామిని కొసంగి యువతీ! పఠింపుము, ఆలకింతు ననెను. సౌదామిని లేఖను గ్రహించి వర్ణక్రమమును జోల్చి యిది గోకర్ణుఁడు స్వయముగ వ్రాసినటు లున్నది. ఏమియో విశే షములేనిది గోకర్ణుఁడు లేఖవ్రాయఁడు. అయినను చదివి చూచె దనుగాక. అఖండవిభవులగు భీమరాజుఅన్నగారిసన్నిధికి:—

సోదరుఁడు గోకర్ణుఁడు ప్రణామపూర్వకముగ వ్రాయు విన్నపము. వసుంధర పరిణయార్థమగు వహో విభవముతో నలరుచున్నది. వరనిర్ణయమునఁ దాము ముఖ్యముగఁ గార్యభారము వహించి నన్నుఁ గృతా

ర్థుని గావింపవలయును. వసుంధరచిత్రపటము లేఖతో నంపితిని. అర్థాఁడెవరో తెలుపుచు నట్టివాని చిత్త రువు సైత మంపుచు లేని యుక్తమెంచి మీయాజ్ఞఁ బాలింతును.

విధేయుఁడు,

గోకర్ణుఁడు.

వసుంధరకు వివాహమఁట. పేరంటమునకు నేను, పెండ్లి పెత్తనమునకు మీరు బయలు దేరవలయునఁట. గోకర్ణయ్య గారు వ్రాసియున్నారు. ఇంక బయలు దేరరేమి? యని పరిహా సముగ సౌదామిని భీమరాజును జూచుచు నన్నెను. భీమరాజు సౌదామినివైపు దృష్టిని ప్రసరింపఁ జేయలేదు. ఆయమమంద హాసమునకుఁ బ్రత్యుత్తరము నొసంగలేదు. గోకర్ణుఁడు పంపిన చిత్రపటమునుమాత్రము తదేకనిష్ఠతోఁ జూడసాగెను. సౌదా మిని చిత్రపటముదీసికొని "యిది వసుంధరచిత్రపటమా! ఎంత చక్కఁగనుంటివే తల్లి! నీకుఁదోఁచు పెండ్లికావలయునా! నేను చేయింతునులెమ్ము." అని చూచిచూచి భీమరాజున కొసంగెను. సౌదామిని యా చిత్తరువును సప్రేమముగఁ దిలకింపలేదు. ఆయమదృష్టికా చిత్తరువులోని యాకృతి సంతోషదాయక ముగ లేదు. సౌదామిని సౌందర్యమునఁ దనను మించిన యువతిలేదని గర్వించువారిలో నగ్రగణ్యురాలు. అట్టి సౌంద ర్యోన్మత్తదేవతకుఁ బ్రకృతిసహజమగు వసుంధరాసౌంద ర్యమును గాంచి యానందించు నంతటి చిత్తనిశ్చలత యెక్క డిది? అందు వసుంధర యనిన సౌదామినికి ద్వేషము. ద్వేష మున్నచో గుణముగ్రహించువారరుదుగదా! భీమరాజు ప్రత్యు

త్తర మేరూపముననున్న కార్యసాధనమో యోజించు చుండెను. వార్తావహుఁడు సెలవంది, ప్రత్యుత్తరము వ్రాయు నరికి వత్తునని భోజనమునకేగెను. ఉన్మత్తుఁడని తాము నిర్ణయించిన బ్రాహ్మణుఁ డొక్కఁడు దక్క నన్యు లెవ్వరులేని యాస్థానమున సౌదామిని భీమరాజుతో నిటుల భాషించెను.

"రాజవతంసా! మున్ను మనము నిర్ణయించిన కార్యము సాధించుటకు మార్గ మొకవిధమున నిర్ణయించితిని. ప్రకృత పరిస్థితులకు దీనిని మించిన మార్గ మింకొకటి లేదు. నీ వపత్నీకుఁడవు. వసుంధరను నాకె యిమ్మని గోకర్ణునకు లేఖ వ్రాయుము. అంగీకరించెనా? కందూరురాజ్యము మనదే యగును. వివాహాంతమున మనము చేయవలసిన పనుల కన్నింటికి నొకరాత్రి చాలును. ఈ యుద్వాహమునకు గోకర్ణుఁ డంగీకరింపక పోయెనా? సంగ్రామములో వసుంధరను, గోకర్ణుని వధించి కందూరురాజ్యము బలిమిమై లాగికొందము. ఆంధ్రసామ్రాజ్యాధీశ్వరుఁ డెత్తివచ్చెనా? మీ సహోదరుఁడు మా కారాగారముననె యున్నాఁడు. కోట ముట్టడించితివేని చిత్రవధ గావింతుమని వర్తమానము చేయుదము. సర్వవిధముల యుక్తమార్గ మిదియె."

భీమరా జించుకసే పాలోచించి యువతీ! నీ యూహా యుక్తియుక్తముగ నున్నది. అనుచు లేఖ నొకదానిని వ్రాసి వార్తావహుని బిలిపించి గోకర్ణునకుఁ ద్వరలో నందింపుమని యొసంగెను. వార్తావహుఁడు వందనపురస్సరముగ సెలవు నంది వెడలిపోయెను.

సౌదామిని బ్రాహ్మణునితోఁ గాలక్షేపార్థమై యిట్లు భాషింప నారంభించెను.

"ఓయీ బ్రాహ్మణుఁడా! నీ దేగ్రామము? ఇట కేల వచ్చితివి! ముందెచటకుఁ బోవనున్నాఁడవు?"

"నాది హనుమకొండ. శ్రీశైలమునకు శివరాత్రి కేగి యుత్సవము సందర్శించి గృహాభిముఖుఁడనై పోవుచున్నాను."

"కారాగారమువద్ద నేమి పారవేసికొంటివి?"

"దొరవారి గృహములో నేవేని శుభకార్యములు జరుగనున్నవేమో తెలిసికొనఁ దలంచి కారాగృహమని తెలియక యిట కేగితిని. ఒక యువకుఁడు నిర్బంధితుఁడై యుండెను. నా ప్రశ్న కేమియుఁ బ్రత్యుత్తర మొసంగక తిరస్కరించెను. ఆవల వేఱొకచో నొక స్త్రీ బంధింపఁబడి యుండెను. ఆమెయు నటులె ప్రత్యుత్తర మొసంగెను. భటులు నన్ను మెడఁబట్టి గెంటఁబోయిరి."

"ఇట కేల వచ్చితివి?"

"మెడబట్టి నెట్టినందులకు భటులను శిక్షింపుమని మీకు విన్నవించుటకు. నేను బ్రాహ్మణుఁడను. మాయింటి పేరు పాలకుఱికివారు. నాపేరు సోమనాథశాస్త్రి. ఈ సోమనాథశాస్త్రియవమానము తొలంగించితిరా కాశిలో సోమనాథుని బ్రతిష్ఠించినంత పుణ్యము."

భీమరాజున కాబ్రాహ్మణుని సంభాషణము మిగుల నవ్వుబుట్టించెను. నవ్వినవ్వి మంచి మంచిబ్రాహ్మణుఁడవు

చిక్కితివయ్యా! నిన్ను రాజద్రోహిగ మా భటు లూహించి రని పల్కెను.

"ఓయీ! నీకీ చిత్రపటము నొసంగిన నేమి చేసికొందువు?

"పెండ్లి చేసుకొందును. నేను యజ్ఞముచేసి సోమయాజి నయ్యెదను. అప్పటి కీమె సోమిదమ్మ యగును. అమ్మా! బ్రాహ్మణుఁడను. పరిగ్రహణ యోగ్యుఁడను. పటము దయ చేయుఁడు. మీకుఁ గన్యాదాన ఫలము దక్కును. కన్యా దానఫలము దక్కును. చైత్రమాసమున మంచి లగ్నములు కలవు.

"తీసికొనవయ్యా పిచ్చి బ్రాహ్మణుఁడా!" యని చిత్ర పటమును బ్రాహ్మణున కిచ్చివేసెను. బ్రాహ్మణుఁ డానంద ముతో రాజా! నాకు సెలవు నొసంగుదురా? అమ్మా! సెలవు పుచ్చుకొనుచున్నాను. అని బ్రాహ్మణుఁడు వెడలిపోయెను.

భీమరాజు సౌదామినితో సతీ! భటులు, గూఢచారులు కనుగలిగి మెలఁగుచున్నారు. కడ కున్మత్తుఁడగు బ్రాహ్మణుని సైతము బంధించి తెచ్చి మన కొప్పగించినారు. బ్రాహ్మ ణుఁడు నిజముగ బ్రపంచమన నేమో యెఱుంగని యలౌకికశిఖా మణిసుమా! యనెను. గోకర్ణునికంటె నలౌకికశిఖామణియా! యని పరిహాసముతో సౌదామిని వాకొనెను. సతీ! గోకర్ణుఁడు ప్రకృతిజడుఁడుకాఁడు. వాగింద్రిని పాదముఁ బట్టి యట్టి దుస్థితికి, వెఱ్ఱివేదాంతములకు లోనయ్యెను. మన కా ప్రసంగ

ములతోఁ బనిలేదు. ఇరువురము గలిసి నిర్వర్తింప వలసిన కార్యములు కొన్ని గలవు. సేనానాయకులకుఁ గొన్ని యంశములు బోధింప వలసియున్నది. గోకర్ణునివద్దనుండి సందేశము వ్యతిరేకముగ వచ్చినదనుకొని యుపశిష్టము లన్నియుఁ దీర్చి కొనవలయుననుచు భీమరాజు సౌదామినితో నంతిపురికేగెను.

---

# ఐదవ ప్రకరణము.

హనుమకొండరాజ్యమున సైనిక దళాధికారి రుద్రసేనాని. ఇతఁడు రేచర్లగోత్రీయుఁడు. వెలమకులజుఁడు. ఇతని పూర్వు లందఱును కాకతీయ చక్రవర్తులవద్ద సేనానాయకత్వముతోఁ బౌరుషముగ జీవించిరి. రేచర్లగోత్రీయులయెడఁ జక్రవర్తికుటుంబమున కెంత యనరాని యభిమానము. రుద్రసేనానిజనకుఁడు కాటయసేనాని. ఇతఁడు కాకతీయవంశభూషణుఁడగు ప్రోలరాజునకుఁ గుడిబుజమువలె సంగ్రామములలోఁ దోడుపడి యాంధ్రసామ్రాజ్యమును హరింప సర్వసిద్ధముగ నున్న ప్రత్యర్థుల వధించి సామ్రాజ్య పునరుద్ధరణమునకుఁ దోడ్పడెను. రుద్రసేనాని, రాజభక్తియందు, పరాక్రమశౌర్యాదులయందుఁ దండ్రికిఁ దీసికొనిపోవువాఁడు కాఁడు. నియుక్తధర్మమునం దప్రమత్తుఁడై మెలఁగుచు నరాజకులను, వంచకులను నొకకంటఁ గనిపెట్టుచు సామ్రాజ్య క్షేమమునకు జీవిత సర్వస్వము ధారపోయుచు నుండెను.

సన్యాసినియాగమన హేతువు రుద్రసేనాని కనుమానా స్పదముగ నుండెను. ఆయమచర్య పరిశీలింప వలయునని రుద్రసేనాని సన్యాసినికిఁ గానరాకుండఁ గొన్ని దినములు సంచరించెను. ఆయమగీతముల నన్నింటి నాలించెను. సన్యాసిని లేకుండఁ జూచి పద్మాక్షీయాలయమున కేగి యా యమదుస్తు లన్నియుఁ బరిశీలించెను. అందుఁ గొన్ని భక్తి బోధకములగు గ్రంథములుమాత్రము కలవు. రుద్రసేనాని యా దుస్తులను శోధించి పాపము భిక్షుకురాలివిషయమున వృథాగ ననుమానించితిని. ఆయమగీతములలోని భావమె నన్నింతటి సాహసమునకు బురికొల్పెను. యోచించి చూడ నాయమగీతము లన్నియు నాంధ్రసామ్రాజ్య క్షేమదాయకము లనియే తోఁచుచుండెను. పరరాజులదుర్మార్గము నుద్బోధించుటకు ధర్మదేవత యీ రూపమున బయలు వెడలినటులఁ దోఁచుచున్నది. లేకున్న నవయౌవనమున సన్యసించి తన విద్యాప్రభావముచే, మధుర గీతములచే వీరలోకమున కుద్బోధము గావింప నీయమ యేల బయలు వెడలును? అంతటి సాహసము సామాన్యకాంతల కుండుట యసంభవ మనుచు రుద్రసేనాని పద్మాక్షీ దేవళమునుండి బయటికి రాఁబోవుచుండ ద్వారమునఁ గొంచెము సందడియయ్యెను. సన్యాసిని వచ్చుచున్నటులున్నది. సందర్శించి వెడలవచ్చునని రుద్రసేనాని యచటనే కొంచెము సేపు నిదానించి యా సందడిని జాగరూకతతో నాలించెను. అది సన్యాసినియాగమనము వలె స్ఫురింపలేదు.

ద్వారమున నెవరో రహస్యముగ భాషించుచున్నటుల రుద్రసేనాని గ్రహించి యీ యనవసరప్రసక్తి నాకేల యని పోవఁదలంచెనుగాని, ఆంధ్రసామ్రాజ్యము, మహాదేవరాయలు, మంజరి యను వాక్యము లాకస్మికముగా వినవచ్చెను. ఇది సామ్రాజ్యమునకు సంబంధించిన సంభాషణమువలె నున్నది. విననిది బయటకుఁ బోవరాదని యటనె నిలిచి, చెవియొగ్గి వినుచుండెను. విషయము బోధయగుటలేదు. కాని యది రాజద్రోహులసంభాషణ మని రుద్రసేనాని గ్రహించి యొఱనుండి కరవాలము పెఱికి మెల్లగ నింకొక యడుగు ముందునకు వేసి నిలువఁబడెను. ఇపుడు రుద్రసేనానికి వినవచ్చుచున్నది పూర్వ కంఠస్వరము కాదు. భాషించువాని ధ్వని స్ఫుటమైనది. మఱి యొకఁ డాసమయమున 'మెల్లఁగ భాషింపుము. సంన్యాసవేష ధారిణి పాఱిపోవునేమో' యనెను. 'ఆలయాంతరమున గం తయు, బొంతయు సవరించుకొనుట మనము చూచితిమి. ఇం తలో నెచటకుఁ బోవును? త్వరలో యమసదనమున కేగనున్న సంన్యాసిని మనరహస్యము వినిన నేమి? వినకున్న నేమి?' అని వే ఱొకఁడనెను. రుద్రసేనాని ద్వారమున ముప్పురు రాజద్రోహు లుండిరని నిశ్చయించుకొనెను. వారిలో నొకఁ డిటుల భాషించెను.

'రాజుగారి సెలవు నొంది మనము ముగ్గురము కార్య భారములు నిర్వర్తించితిమి. కీర్తివర్మ సౌభాగ్యవతిని బెండ్లాడుదు వనియుఁ గందూరురాజ్యము నరణమొసంగెద నని గోకర్ణుని, వసుంధరను వధింతుననియు వాగ్దానము గావించియున్నాఁడు.

మహాదేవరాయలు దుర్గ్మరణ మొందు మార్గములు నిర్మింపఁ బడియె యున్నవి., కందూరురాజ్యమునుండి వ్యాఘ్రపాదుఁడు, హనుమకొండనుండి రోహణకుఁడు సంపాదించిన రహస్యములు మిగుల నుపయుక్తము లైనవి. సంన్యాసిని వేషముతో నా దొంగరాకాసి యిచటఁ దిరుగుచున్నది. దానిని వధింపక పోయితిమా, మన రహస్యములు బయలుపడిపోవును. పద్మాక్షికి సంన్యాసినిని బలి యొసంగి శిరమును గొనిపోయి మన రాజున కొసంగితిమా మిక్కుటమగు బహుమానము రాఁగలదు.”

ప్రసంగము ముగిసెను. సంన్యాసినిని వధింపవలయు నని మువ్వు రాయుధములఁ దీసికొనిరి. రుద్రసేనాని యది గ్రహించి యాలయములోనికి ముం దడుగిడిన యిరువురు రాజద్రోహుల కంఠముల నొకవ్రేటున నఱికెను. మూఁడవవాని కెదురుగ నేగి కొంతసేపు పోరాడి రుద్రసేనాని తన కరవాలముతో నాతని కంఠమును దూరమునఁ బడునటుల నఱికి, మూఁడు శవముల నొకచోఁ జేర్చి దుస్తులన్నియుఁ బరిశీలించి మూఁడు ఖడ్గములు,మూఁడు పుస్తకములు బయటికిఁ దీసెను. ఒకనియొద్ద బరిణయొకటి కానవచ్చెను. అవియన్నియుఁ దనయొద్ద భద్రము గావించికొని యొక బహిరంగప్రదేశమున నామూఁడుపుస్తకముల సాకల్యముగఁ బఠించి యానందపరవశుఁడై తాను గ్రహించిన వార్త చక్రవర్తికి విన్నవింపవలయునని శవముల నాలయమునఁ జేర్చి ద్వారము బంధించి రాజమందిరమునకు వెడలపోయెను.

రాజభటులు సంన్యాసినిని గొనివచ్చి యాస్థానమునకుఁ జేర్చి చక్రవర్తిముందు నిలువబెట్టిరి. చక్రవర్తి యా సంన్యాసిని వదనము తృప్తిదీఱఁ జూచి 'భటులారా! మీరు దోషనిర్ణయమునఁ బ్రమాదము నొందియుందురు. ఈ సంన్యాసినియెడ నెట్టి నేరము పొరపాటున నారోపించితిరో త్వరగ నా నేరమును సవరించుకొనుఁ'డని వాకొనెను. అంతలో నర్చకుఁ డేతెంచి 'మహారాజా! తాము నందీశ్వరునికంఠమున నలంకరించిన హారము నీయమ హరించినది. ఈయమ దేవాలయమునఁ బ్రవేశించునఱకు హారము కలదు. మఱలఁ దిరిగిపోవునంతలో హారము మాయమైనది. ఇది సంన్యాసినిమాయయే. మేమెన్ని విధముల నడిగినను హారవృత్తాంతము తెలుపదు. దేవరవారె విచారించి సత్యము నిర్ణయింపవలయు'నని తెలిపెను. చక్రవర్తి సంన్యాసినిని జూచి 'అమ్మా! హారము నీవపహరించితివని యర్చకుఁ డభియోగమును దెచ్చియున్నాఁడు. నీవు చెప్పికొను సమాధాన మేది?' యని ప్రశ్నించెను. సంన్యాసిని చాలసేపు మౌనముద్రవహించి నిట్టూర్పువిడచి యిటులఁ బాడెను.

"పాలు వెన్నయుఁ దావి బాలకృష్ణుండు
తనయపరాధ మంతయుఁ గప్పిపుచ్చ
లేఁగతాళ్లుల సడలించి తోలంగ
గోపి మర్దించె గోకుమారికను."

సంన్యాసినిగీతము విని చక్రవర్తి మిగుల లజ్జించెను. 'అమ్మా! దోషనిర్ణయమున భటులు ప్రమాదపడిరి. క్షమింపుమని' యోగినిని సవినయముగ నభ్యర్థించెను. యోగిని యా మాట హాలిం

పక యేదియో పాడుచు నచటనే నిలిచియుండెను. భటులు, నర్చకుఁడు చక్రివర్తికనుసన్న ననుసరించి మఱుమాట తెలుపక వెడలిపోయిరి. సంన్యాసిని మఱల గళ మెత్తి—

"శ్రీ కృష్ణుఁ డేవెతఁ జెందుచున్నాఁడో
బలరామ! బలరామ! బ్రతికించుకొమ్మ
అసురుండు మనుజమాంసాశనుం డగుటఁ
దఱచి చెప్పుచునుంటి దయచేయుమయ్య."

అని పాడెను. రుద్రదేవచక్రవర్తికనుల నశ్రువులు క మ్మెను. హృదయము తల్లడించెను. అతనిమానసము భావనా ప్రపంచమున నదృశ్యమయ్యెను. హా! మహాదేవరాయా! మహాదేవరాయా! యని తలవంచికొనెను. యోగినిమాత్రము విశ్రాంతిలేకుండ నేదియో పాడుచునే యుండెను. అంతలో రక్తవస్త్రములతో నొకవ్యక్తి యాస్థానమునకుఁ బ్రవేశించెను. యోగిని తనగానము నాపక యటులె పాడుచు నావ్యక్తిని సందర్శించెను. చక్రవర్తి భ్రాంతుఁడై 'రుద్రసేనానీ? ఏమియు నప్రియము వచింపవు గద! అప్రియము వచింపవుగద!' యని యాతురతతో వాకొనెను. రుద్రసేనాని యామాటలు వినక మున్నె 'జయము మహారాజా! జయము జయము. రాజద్రోహులు ముగ్గురు మనరహస్యముల గ్రహింప నిటకేగుదెంచిచాల దుష్కృత్యములు సేయుచున్నారు. వారలఁ బద్మాక్షికి బలి యొసంగి యీగురుతులఁ గొనివచ్చినాఁడను. ఈ కరవాలముల మూఁటిని వారలవద్ద సంగ్రహించితిని. ఈ మూఁడు పుస్తకములె వారిదినచర్య తెలుపునవి. ఈ బరిణె వారలలో

నొకనియొద్దఁ గలదు. అం దేది కలదో తామె సందర్శింతురు గాక' యని యట నిలిచియుండెను. రుద్రదేవచక్రవర్తి యా గ్రంథముల నన్నింటిని దిలకించి సేనానీ! నేను గ్రహించిన యంశ మిదిమాత్రమే.

"మహాదేవరాయలు బంధింపఁబడియున్నాఁడు. రుద్ర దేవుని వంచించుట కీ మార్గము నవలంబించితిని. గోకర్ణుఁడు, వసుంధర, యెపుడు వధింపఁబడుదురో యపుడె సౌభాగ్య వతిని నీ కొసంగి ధారపోయుదును. ఆ రాకాసి సంన్యాసిని వేషముతో నిట నున్నది. ఆంధ్రసామ్రాజ్యము దుర్బలముగ నున్నది. కీర్తివర్మ మనకు సర్వవిధముల సాహాయ్యమునకు రానున్నాఁడు."

'ఈ యంశ మీమూఁడుహస్తములలోని సారాంశము. ఇందు వ్యక్తినామములు కానరాకున్నవి. సౌభాగ్యవతి యను నది విశేషణమని తోఁచుచున్నది. గోకర్ణుఁడు ప్రతికూలుఁ డనియుఁ గీర్తివర్మ యనుకూలుఁ డనియు నాముగ్గురి సంక ల్పము. మహాదేవరాయలు బంధితుఁడై యుండె నను వాక్యము విశ్వసనీయమె. సేనానీ! నీ వీముగ్గుర నేల వధింప వలసివచ్చెను?

రుద్రసేనాని చేతుల జోడించుకొని యిట్లనెను. "రాజేంద్రా! నేను సంన్యాసినియథార్థస్థితి గ్రహింపవలయునని చాలకాలము నుండి ప్రయత్నించుచుంటిని. రహస్యభేదమునకు మార్గాం తరములు తోఁపక సంన్యాసిని గ్రామపర్యటనమున కేగిన

యదను గ్రహించి యాయమగంత, వలువలు, శోధింపనెంచి పద్మాక్షీయాలయమునకుఁ జేరితిని. నా కెట్టి యంశము లా పరిశోధనమువలనఁ దెలియలేదు. కాని సంన్యాసిని భిక్షు రాలెయని స్పష్టమైనది. లోన నున్న నన్ను, సంన్యాసినిగ భావించి వధింప నిశ్చయించిన యీముప్పురు మనరాజ్యమును ధ్వంసము చేయవలయు ననుచుఁ బ్రసంగించుకొనుచుండిరి. ఆ యదనున సామ్రాజ్యక్షేమము నపేక్షించి యా ముగ్గురను వధించితిని. వేషభాషలు వాండ్రు మార్చికొనియుండుటచే నెచటివారో నిర్ణయింప వీలుకాదయ్యెను. వాండ్రు దేశము గ్రహించితిమేని మహాదేవరాయలను బంధవిముక్తుని జేయ వచ్చును. గోకర్ణుఁడు, కీర్తివర్మ యనువా రెవరో తెలిసి కొనుట మన కావశ్యకము. రహస్యభేదనమున కిప్పటి కొక విధమగు సాధనము లభించినది. ఆ శవములఁ బరీక్షించితిమేని మఱికొన్ని రహస్యములు సైతము తెలియవచ్చును. సామ్రాజ్య క్షేమముకొఱకీ కార్య మావశ్యకమని స్వతంత్రించి యొన ర్చితిని. రుద్రసేనాని యిటుల మాటలాడి క్షమాఁర్పణము కోరెను." చక్రవర్తి యానందముతో సేనానిని గౌఁగిలించి కొని యిట్లనెను. "మిత్రమా! నీసాహసము శుభప్రదమైనది. ఆ కరండిక నిటు తెమ్ము. అం దేమియున్న దో" యని చక్రవర్తి సేనాని యొసంగిన కరండికఁ బరిశీలించి దానిని తెఱచెను. అం దొక హారము మెఱయుచుండెను. చక్రవర్తి దానిని దీసి "ఓహో! ఈ హారమును నేనునందీశ్వరునికంఠమున నలంకరించి, దీనివిషయములో నెవ రెటుల భాషింతురో తెలుపుమంటిని.

ప్రమత్తులై యర్చకు లెవరు హరించి నదియు గ్రహింపఁజాలక యోగినిని గొనివచ్చిరి. మిత్రమా! ఈ హారవృత్తాంత మెఱుంగవు కాఁబోలును. మహాదేవరాయ లెక్కియేగిన యశ్వ మీమధ్య బెదరివచ్చెను. దానికంఠమున నీహారము కలదు. ఇది రాజద్రోహుల యొద్ద లభించినది. ఇది యంతయుఁ బరిశీలింప రాజద్రోహులు వర్ధమానపురసంబంధులని తోఁచుచున్నది. మహాదేవరాయలు వర్ధమానపురి కేగుటయు, నశ్వ మా మార్గముననే హారముతో బెదరివచ్చుటయు, దానినె రాజద్రోహులు హరించుటయు, లోలోన భీమరాజు తిరుగుబాటు చేయుటయుఁ జూడ నాయూహ ప్రమాదికము కాదని నమ్మకము కలుగుచున్నది." రుద్రసేనాని సంతోషముతో 'రాజేంద్రా! మీయూహ సమంజసముగా నున్నది. పాలకురికి సోమనాథుఁడు వచ్చెనేని రహస్యమంతయు నవగతమై తీరును. అంతవఱకీ హారము, ఖడ్గములు పాత్రములు, నాయొద్దనే జాగరూకతగా నుంచెదను. ముందు మనము పద్మాక్షి దేవళమున కేగి శవములఁ బరీక్షించి యేదేశవాసులో నిర్ణయింతము. మన నిర్ణయము సోమనాథునిరహస్యభేదనమునకుఁ దోడుపడవచ్చు' ననుచుఁ జక్రవర్తియు, రుద్రసేనానియు దక్షిణముగ నున్న పద్మాక్షి దేవళమునకు బయలువెడలిరి. సంన్యాసిని వారివెంటనే బయలువెడలి యాలయమున కేగి చక్రవర్తితో, రుద్రసేనానితోఁ గలిసి యా శవముల నన్నింటిని బరీక్షించి 'భీమరాజు పంచప్రాణములలో మూఁడు గతించినవి; మిగిలిన రెండుప్రాణములు వాయుప్రపంచమునఁ గలియు

వఱకు శాంతి స్థాపింపఁబడ దనుచు సన్యాసిని తంబుర మీటుచు నాట్యముఁ జేయుచు మధురస్వరముతో

"పూతన పసినాఁడె పొలియింపఁబడియె
అల తృణావర్తుండు హరియింపఁబడియె
బకుఁడు స్వర్గమునకుఁ బయనమైపోయె
కంసుఁడా! నీకుఁ బోఁ గాలంబువచ్చె
శ్రీకృష్ణుఁడే నిన్ను ఛేదింపఁగలఁడు."

అని పాడుచు శైలాగ్రమునకు వెడలిపోయెను. రుద్రసేనాని చక్రవర్తితో నీయమ భీమరాజుపరిపాలనమున విసిగి సంన్యాసము స్వీకరించి వర్ధమానపురరాజ్యవిచ్ఛేదనమునకుఁ బాటుపడుచున్న యువతీమణి యని విశ్వసించుచున్నాను. ఈయమ పాడుపాట లన్నియు మనకుఁ గర్తవ్యోద్బోధకములుగ నున్నవనుచు శైలము డిగి రాజమందిరమునకు వెడలెను.

---

# ఆఱవ ప్రకరణము.

సోమనాథుఁడు చిత్రపటమును గ్రహించి తత్క్షణమె వర్ధమానపురి వదలిపోవుచుండెను. త్రోవలలోఁ బెక్కు పాడుబడిన జైననిలయములు, దేవాలయములు కానవచ్చెను. కొన్ని దేవాలయములు నేలలోనికి క్రుంగియుండెను. కొన్నింట విగ్రహములే లేవు. ఒక మైదానమున సుందరతరమగు జైనవిగ్ర

హాము నగమువఱకు విరిగియు లోచనోత్సవకరమగు శిల్ప విలాసములతో గోచరించెను. ఇంకొకచో నిరువదిమూఁడు తీర్థంకరుల విగ్రహములమధ్యనున్న మందహాసవదనుఁడగు జిన మూర్తిరూపము మనోజ్ఞముగ నలరారుచుండెను. శిథిల మయ్యుఁ జిఱునగవువెన్నెలలఁ జిందు ముద్దుమొగము, కల్పితములయ్యుఁ గరుణరసము వర్షించు కనుదోయియు, సహజ సౌందర్యశోభితములై ముడుతలతోనున్న యొడలుగల మహావీరుని ప్రశాంతస్వరూపము శైవమతావేశపరవశుఁ డగు సోమనాథునిహృదయము నాకర్షించెను. ఆలయము లటులె యుంచి యర్చావిగ్రహముల నించుక మార్చి మతపరివర్తనము గావింప వీలుకల్గియు మతాచార్యులు గావించు జైనమత విధ్వంసనప్రచారము తాత్కాలికముగ సోమనాథున కనహ్యమయ్యెను. శిలాఫలకములపయిఁ గలయహింసాబోధక చిత్రములు, లతావలయములు, మహారాజు లొనర్చిన దాన శాసనములు సోమనాథునిహృదయము నాకర్షించెను. అహింసా వాదులగు జైనసాధువులు ఆంధ్రదేశమున నిలువ నీడలేక పోవుటచేఁ గర్ణాటదేశమునకు వలసపోవుటకుఁ దానుగూడఁ గొంతవఱకుఁ గారకుఁడ ననుకొనెను. ఇట్లు శిథిలజైనవిహారముల నన్నింటిని సందర్శించుచు నెటుపోవను దోఁచక యొక మామిడిచెట్టునీడను విశ్రమించి సోమనాథుఁ డేదియో యోజించుచుండెను. అంతలో నొక బాటసారి యామార్గమునఁ బోవుచుండెను. సోమనాథుఁడు పేరెలుంగున నాబాటసారిని బిలిచి 'నీ దేగ్రామము? ఎచటకేగుచుంటివి?' అని ప్రశ్నించెను.

తనది కందూరుసంస్థాన మనియు, నటకే పోవుచుంటిననియుఁ బ్రత్యుత్తరము నొసంగెను. సోమనాథుఁ డానందముతో 'నీవు వర్ధమానపురికి వచ్చిన వార్తావహుఁడవుకావా! నేనుగూడ వచ్చుచున్నాఁడను. క్షణమాగుము, క్షణమాగుమనుచుఁ దన మూటదులిపి చేతఁ బుచ్చికొని 'నాయనా! కందూరిచటి కెంతదూరము? దివాణములోఁ బెండ్లిప్రయత్నములు చేయుచున్నారా'యని బ్రాహ్మణుఁడు బాటసారి నడిగెను. 'అయ్యా! కందూరిచటకుఁ బదిక్రోసుల దూరమున నున్నది. సాయంకాలమగుసరికి మన మేగవచ్చును. వివాహవిషయ మింకను నిశ్చయింపలేదు. అన్నిఁటికి గోకర్ణయ్యదొరవారే యున్నారు' అనుచు బాటసారి, కాదుకాదు వార్తావహుఁడు పోవుచుండెను.

సోమనాథునకు గందూరురాజ్యమున కేగుట యావశ్యకమని తోఁచెను. కందూరురాజ్యము భీమరాజున కెంతవఱ కేకీభవించునో యీసంబంధమునకు గోకర్ణుఁ డభిముఖుఁడగునో కాదో తెలిసికొనినఁ గాని హనుమకొండ కేగరాదని సోమనాథుఁడు నిశ్చయించికొని గమనాయాసముచే సాయంకాలమగుసరికి కందూరున కేగెను. మార్గమధ్యమున వార్తావహుఁడు భీమరాజుదుండగములు, చోడవంశజుల పేరుప్రతిష్ఠలు, గోకర్ణునిధర్మస్వభావము, నాఁటి రాజకీయ పరిస్థితులు సోమనాథున కామూలాగ్ర మెఱింగించెను. ప్రసంగాంతరములతోఁ బ్రయాణము ముగిసెను. వార్తావహుఁడు మార్గాయాసముగ నున్నది. భోజన మొనరించి సంస్థానమునకుఁబోయెదను. ఆ కానవచ్చుచున్నదియె దివాణము. గోకర్ణయ్యదొరవారచ

టనే యుందురు. మీరు దయచేయవచ్చు నని చెప్పి వెడలి పోయెను. సోమనాథుఁడు బడలికగ నుండియు నోపికఁదెచ్చుకొని వార్తావహుఁడు రాకముందె, గోకర్ణునియాంతర్య మెఱుంగవల యుననియు, భీమరాజువార్తకు గోకర్ణుఁ డెటులఁ బ్రత్యుత్తరము నిచ్చునో యెఱుంగవలయు ననియు వేషభావలు మార్చికొని యొక సేలువ ధరించి యాస్థానమున కేగెను.

కందూరు రాజ్యమునఁ బండితులు సంస్థానమున కేగుట కెట్టి విజ్ఞప్తి, యెట్టి యాజ్ఞాపత్ర మవసరము లేదు. సోమనాథుఁడు ద్వారములు దాటి యాస్థానములోనికిఁ బ్రవేశించెను. గోకర్ణుఁడు శిలాఫలకముపైఁ గూర్చుండి యేదియో యోజించుచుండెను. సహధర్మచారిణియగు మలయవతి చెంత నిలిచి సాధ్వీసహజ మగు మృదుస్వరముతో భాషించుచుండెను. చెంతఁ బదు మూఁడు వసంతములు నిండియునిండని యొక బాలిక యా వ్రి సంగమును శ్రద్ధతో నాలించుచుండెను. సోమనాథుఁడు ప్రసం గమధ్యమున వచ్చితినేయని వెనుకకు మఱలఁ బోయెను. గోకర్ణుఁడు లేచి "బ్రాహ్మణోత్తమా! నమస్కారము, దయ చేయుఁడు, దయచేయుఁడని యభిముఖముగఁ గొంచెము దూర మేగి తోడ్తెచ్చి యొక పీఠము చూపి బ్రాహ్మణుఁడు కూర్చుండిన యనంతర మాసీనుఁడయ్యెను. మలయవతియు నాయమ చెంత నున్న బాలయు ఆస్థానము వదలి వెడలిపోయిరి. సోమనాథునకు గోకర్ణుని శాంతప్రసన్న మగు ముఖము చూడఁగనే యుత్సాహ మతిశయించెను. ముఖమువలె వాక్యములు సైతము శాంత ప్రసన్నములుగ నుండెను. మితభాషియగు సోమనాథునకు

గోకర్ణునితో భాషింపవలయునను తలంపు జనించెను. కాని సోమనాథుఁడు సాహసించి భాషింపఁ డయ్యెను. కొంతసేపు వా రిరువురు నటులె ప్రశాంతముగఁ గాలము గడిపి పిమ్మట నిటుల సంభాషించిరి.

"ఆర్యా! మీ రిపు డెచటినుండి వచ్చుచుంటిరి?"

"వర్ధమానపురమునుండి."

"తమనివాసస్థానము నామధేయము, నడుగవచ్చునా?"

"నన్ను సోమనాథుఁ డందురు. మాయింటిపేరు పాలకురికివారు. నానివాసస్థానము హనుమకొండపరిసరగ్రామము."

"తా మిట కేల దయచేసితిరి?"

"విన్నవించుచున్నాఁడను. నేను రుద్రదేవచక్రవర్తి సోమ్యవర్గములోనివాఁడను. మాచక్రవర్తి సోదరుఁడు కందూరు రాజ్యధ్వంసకుఁడగు భీమరాజునొద్దకు రాయబారిగ వెళ్లెను. సంవత్సరములు గడచుచున్నవి. ఆతఁ డింకను దిరిగి రాలేదు. సోదరవత్సలుఁ డగు మా చక్రవర్తి యాందోళనమున నుండి నన్ను జాడ కనుగొమ్మని యీప్రాంతములకుఁ బంపినాఁడు."

"ఏమిది! ఆశ్చర్యకరముగ నున్నది. నేను మహాదేవరాయల వర్ధమానపురమున దర్శించితిని. నాఁటిరాత్రి యటనుండి మఱునఁటిదినము హనుమకొండ కేగ సంకల్పించికొనియెను. ఒక విపరీతపరిణామముచే నే నారాత్రినుండియె యిటకుఁ జేరితిని."

"ఆ విపరీతపరిణామము మహాదేవరాయలకు భీమరాజు వలన రానున్న యవస్థ కాదుగదా!"

"కాదు, కాదు. అది భీమరాజునకు, నాకును సంబంధిం చినది. మహాదేవరాయలవృత్తాంత మేమేమి తెలిసెనా?"

"రాజా! నే నావిషయమై యిపు డేమియు విన్నవింపఁ జాలను. భీమరాజునకు, మాకునుగల వివాదాంశ మింకను బరిష్కరింపఁబడలేదు. కందూరురాజ్యాధీశ్వరుని వధించినందులకు భీమరాజునకు ద్రవ్యదండనము మాచక్రవర్తి విధించెను. ఆద్రవ్యమును గందూరురాజ్యమున కొసంగి తమ సామ్రాజ్యచ్ఛత్రిముక్రిందఁ గందూరురాజ్యమును క్షేమవంతముఁ గావింపవలయునని చక్రవర్తి సంకల్పించెను. రాజ్యభారమున కేగిన మహాదేవరాయలు చిరకాలము ప్రతీక్షించినను రామిచే, నిరుత్సాహముచే నియతధర్మమునఁ జక్రవర్తి విరామ మొనరించెను. కందూరురాజ్యమును సైతము సందర్శించి యా రాజ్యమున కౌరసులను జూచి చక్రవర్తికి నివేదింపవలయు నని నే నిటకు వచ్చితిని. తాము యోగ్యు లగుటచే నాయభిప్రాయముఁ దెల్పఁ గల్గితిని."

"ఆర్యా! కందూరురాజ్యము విచ్ఛిన్నమగువఱకొక నెత్తురుకందువు - ఐదాఱు సంవత్సరములు నిండని పసికూన - మిగిలినది. ఆయమను నేనును, నాధర్మపత్నియు నుతనిర్విశేషముగ సాకితిమి. మావానప్రస్థాశ్రమదీక్షాస్వీకరణమున కాశిశుపోషణమె యడ్డుపడినది. అమ్మా! వసుంధరా! వసుంధరా! ఇటు రమ్ము." అని గోకర్ణుఁడు ద్వారముచెంత కేగి పిలిచెను. సౌందర్యము వహించిన స్త్రీ స్వరూప మనఁదగు వసుంధర యరుదెంచి గోకర్ణుని కనుసన్నల ననుసరించి సోమనాథు

నకు నమస్కరించి కొలఁదిసే పట నిలిచి వెడలిపోయెను. గోకర్ణుఁడు దగ్గుత్తిక సవరించుకొని సోమనాథునితో 'విప్రోత్తమా! నేను భీమరాజునకుఁ గనిష్ఠసోదరుఁడను. శిశురక్షణమునకు నేను, శిశుశిక్షణమునకు భీమరాజు నేక కాలమున యత్నించితిమి. దానిచే మా కీనిర్బంధము కలిగినది. ఆంధ్రసామ్రాజ్యాధీశ్వరుఁడు పరిగ్రహించునేని వసుంధర నర్పించి మే మీ సంసారమును ద్యజింపనున్నార మనెను.

"పవిత్రమగు మీసంకల్పముఁ బరమేశ్వరుఁడు సానుకూలపఱుపఁగలఁడు. మీపరోపకార పరాయణత్వమునకు, మీశాంత సౌజన్యభావములకు వందనశతములు. మీ ధర్మచింత శ్లాఘనీయము." గోకర్ణునితో సోమనాథుఁడు ఇటుల భాషించు సమయమున వర్ధమానపురినుండి వచ్చిన వార్తావహుఁడు లేఖ నొకదానిని గోకర్ణున కొసంగి నమస్కరించి వెడలిపోయెను. గోకర్ణుఁడుదీపికాసాహాయ్యమునఁ బఠించిక్రిందఁ బాఱవైచి 'భీమరాజా! నీ కళంకజీవితము నానాఁటికిఁ బాపభూయిష్ఠమగుచున్నది. ఉత్తమమగు చోడవంశపూర్వప్రతిష్ఠలన్నియు నీవలననె విధ్వస్తము లగుచున్నవి. ఈ చోడవంశ మింతతో నంతరింపకున్న నీయపకీర్తిని వంశీయులు తరతరములు భరింపఁజాలరు. ఇది రాజ్యమదాంధతాఫలితమో పాప పరిపక్వతయో యెవరు నిర్ణయింపఁగలరు!" అనివాకొనుసరికిఁ జందనమునకు వేఁడిమి కలిగెనే యేలకో యనుచు మలయవతీ వసుంధర లటకే తెంచి నిలిచిరి. గోకర్ణుఁడు క్రిందఁ బాఱవైచిన లేఖ నందికొని 'సతీ! వింటివా భీమరాజుగారి ప్రత్యుత్తరము!

చండాలుఁడుసైతమిటుల వ్రాయసాహసించునా ? చదువు చున్నాఁడ. ఆలకింపు” మని యిట్లు పఠించెను.

“సోదరుఁడగు గోకర్ణున కాశీర్వాదములు.
భీమరాజు వ్రాయు ప్రేమలేఖ.

వసుంధరపరిణయమునకు నన్నుఁ దోడ్పడు ‘మని వ్రాసితివి. చిత్రపటము చూచితిని. నాయాశాలత చిగిరించినది. వసుంధరను నాకె యొసంగెదవేని కృతకృత్యుఁడ నయ్యెదను. నాస్వరూప సౌంద ర్యాదు లెఱింగిననీయొద్దకుఁ జిత్రపట మేటికి? అను కూలింపవేని ప్రతికూలముగనేని వసుంధరను బెండ్లా డెద. నాసంకల్పమునకు భిన్నము జరుపకుము”

భీమరాజు.

ఇది భీమరాజు వ్రాసిన లేఖ. మనోవాక్కాయకర్మ ములచే నేను పుత్రికగా భావించిన యీ సుకుమారికంఠ మున కురితాడు బోసి భీమరా జను వధ్యశిలకుఁ గట్టవల యును కాఁబోలు. సతీ! నీవు వసుంధర నోదార్పుము. గోకర్ణుని కంఠమునఁ బ్రాణ మున్నంతవఱకెట్టి విపరీతము జరుగఁజాలదు. స్వల్పకాలములో నార్ధసామ్రాజ్యాధీశ్వరుని సమక్షమున కేగి నా యీ దుర్గతి యంతయు విన్నవించెదను. వసుంధర నాయనపాదముల ముందుఁ బడవేసెదను. కం దూరురాజ్య మాయనకు సమర్పించెదను.” అని గోకర్ణుఁడు భాషించి “బ్రాహ్మణోత్తమా! మేము మిగుల శోచ్యావస్థలో నుంటిమని యవకాశ మున్నచోఁ జక్రవర్తిగారి కీయుదంత

మంతయు విన్నవింపుము. వాగీంద్రచూడామణి యను నొక మహానుభావుఁ డిచటకు సమీపమున నొక యాశ్రమమునఁ గలఁడు.. కర్తవ్యము నాయనకు నివేదించి నే నాంధ్రసామ్రాజ్యమునకు మీయడుగుజాడల రానున్నాను. కార్యాంతర ప్రసక్తిచేఁ జాల ప్రొద్దుపోయినది. తాము సత్రమునకు దయచేసిన సమస్తోపచారములు జరుగఁగల వనెను. సోమనాథుఁడు చక్రవర్తితో మీయభిప్రాయము సమయానుసారముగ విన్నవింతును. ప్రభాతముననె హనుమకొండత్రోవబట్టెదనని సోమనాథుఁడు గోకర్ణునివందనములఁబరిగ్రహించెను. వసుంధర భక్తిబోధకములు, విచారసూచకములగు చూపులతోఁ దనదురవస్థయాంధ్రసామ్రాజ్యాధీశ్వరుఁడె తొలఁగింపవలయునను నభిప్రాయము వ్యక్తీకరించెను. సోమనాథుని చూపులలోఁ గార్యము నిర్వహింతుననుభావ మున్నటుల వసుంధర గ్రహించెను. గోకర్ణుఁడు సతీసుతలతో దైవము మన పాలఁగలఁడు. ప్రతిక్రియ రేపాజింత మనుచు యంతఃపురమున కేగెను.

## ఏడవప్రకరణము.

వధింపఁబడినవాండ్రు ముప్వురును వర్ధమానపురసంబంధు లని రుద్రదేవుఁడును రుద్రసేనానియు నిశ్చయించికొనిరి. ఈ నిశ్చయమున కనుగుణములగు హేతువుల వాకొనుట పునరుక్తియగును. చక్రవర్తిహృదయము సోదరునికొఱకు పరితపించుచుండెను. ఎవరేని తన సోదరుని బంధించియుఁ దమ

నిర్దోషిత్వము వెల్లడించుట కీకృత్రిమోపాయము బన్నియుం దురా యని చక్రవర్తి చాలసేపు యోజించెను. ఆ యోజనకుఁ జక్రవర్తియంతరాత్మయే ఘంటానాదముగఁ 'గాదు కాదు. భీమరాజు ద్రోహియే' యని ప్రత్యుత్తరము నొసంగుచుండెను, వధింపఁబడినముగ్వురు, భీమరాజుపంచప్రాణముల లోనివారని సంన్యాసిని, తెలిపియున్నది. రుద్రసేనాని వాకొను నంశములు, వధ్యులు వర్ధమానపురసంబంధముగలవా రనుట కనుగుణముగ నుండెను. బలవత్తరములగు నిన్నిహేతువుల నాపి అన్యథా ప్రవర్తింపఁ జక్రవర్తిహృదయ మియ్యకొనదయ్యెను. అపుడు భీమరాజుదురంతము లన్నియుఁ జక్రవర్తి హృదయములోఁ బ్రత్యక్ష మయ్యెను. ఆంధ్ర సామ్రాజ్య విధ్వంసము - రుద్రదేవుని వంచించుట.- తమ రాజు సంకల్పము లని వధింపఁబడినవారి పొత్తములలో స్పష్టముగఁ గలదు. అదియుఁ జక్రవర్తికి స్ఫురించెను. ఇపుడు చక్రవర్తిహృదయమునకు వేఱొక రహస్యము ద్యోతకమయ్యెను. "ఆ రాకాసి సంన్యాసిని వేషములో నిట నున్న"దని వధింపఁబడిన వారిలో నొకని పొత్తమునఁ గలదు. ఆయరాజకులు సంన్యాసినిని జంప వలయుననియే యాలయమునకుఁ బ్రవేశించిరని రుద్రసేనాని చెప్పెను. సంన్యాసిని - "వధింపఁబడినవారలు భీమరాజునకు బహిఃప్రాణము"లనుట వినినయంశమే. చక్రవర్తికి ద్యోతకమైన రహస్యము"సంన్యాసిని వర్ధమానపురవాసినియే"యనియు భీమరా జొనరించు నరాజకకృత్యములచే నింతటి విరక్తికిఁ బాలుపడెననియు - ఈనిర్ణయము రుద్రసేనాని, చక్రవర్తివలన

విని యిందుఁ బ్రమాదము లేదనియు, సంన్యాసినిగూడఁ దన గీతములలో నీ యర్థమును మహాదేవరాయల నిర్బంధావాసమును బోధించుచున్నదనియు విన్నవించెను. సోమనాథుఁ డరుదెంచినగాని మన యూహాలు సిద్ధాంతములు కాఁజాలవని చక్రవర్తి తలంచెను. అంతలో నొకరక్షకభటుఁడు బిరబిర రాజ సమక్షమునకుఁ జేరవచ్చి "రాజేంద్రా! పాలవానదేశవాసుఁ డఁట, వర్ధమానపురమున కేగుచున్నాఁడఁట; రుద్రసేనాని గారు వర్ధమానపురమున కేగువారిని, యటనుండి వచ్చువారిని తమ సమ్ముఖమునకుఁ గొనితెమ్మని సెలవిచ్చియున్నారు. కాన రక్షకనిలయమున నుంచితిమి. అతనిచర్యలు భాషణము లనుమానాస్పదములుగ నున్నవి." అని విన్నవించెను. రుద్ర సేనాని "తత్క్షణమె కొనిరమ్ము. చక్రవర్తిగారి యాజ్ఞతోఁ బనియుండదు. రాజద్రోహుల శిక్షించుట మన ధర్మమై యుండ సందేహముతో నవసరమేమి?" యనెను. భటుఁడు వెడలి కొంత సేపటి కొకయువకుని గొనివచ్చి యీతఁడే నిర్బంధితుఁ డని విన్నవించి వెడలిపోయెను. రుద్రసేనాని యా యువకుని జూచి యిటుల భాషించెను.

"మిత్రమా! నీది యేగ్రామము? ఎట కేగుచున్నాడవు?"

"నాది పాలవాన; వర్ధమానపురి కేగుచున్నాఁడ."

"ఇట కేమిపనితో వచ్చితివి?"

"కొంతకాలముక్రింద వర్ధమానపురినుండి మా సంస్థానమున కొక దూతుఁడు వచ్చి 'నా సహచరు లిరువురు హాను మకొండకు రానున్నారు. నే నట కేగుచున్నాఁడను. మీ రాజ

సందేశమును హనుమకొండకుఁ దెచ్చి యందింపు' మనెను. దానిచే వచ్చితిని."

"దూతుని గలిసికొంటివా?"

"మీచేతులలోఁ జిక్కితిని. మీరు సర్వస్వతంత్రులు. వానితో - వాని సహచరులతో - నన్ను గలిపినను గెలువఁ గలరు."

"మిత్రమా! ఈ సామ్రాజ్య పాలకుఁడు ధర్మస్వరూపుఁ డగు రుద్రదేవచక్రవర్తి. అట్టి యక్రమము లెన్నఁడు జరుగఁ జాలవు. వర్ధమానపురదూత మీ రాజుకడకుఁ దెచ్చిన సందేశ మేమని?"

"ఆర్యా! ఆ సందేశము వచ్చిన కాలమున నేను దేవగిరియం దున్నాను. సందేశముఁ జూచి మారాజు స్వల్ప కాలములోఁ బ్రత్యుత్తర మంపెద నని సెలవిచ్చెను. హనుమ కొండలో నుందును. ప్రత్యుత్తరము నియతకాలమునకు నటకె పంపుమని దూత చెప్పెనఁట. సందేశవిషయమున నే నింత వఱకె యెఱింగియున్నాను."

"ఇం దేమియు నసత్యము లేదుగదా?"

"నానోట నసత్యము రాఁగలదా? అం దసత్యము, ధర్మ మూర్తి సరస్వతీ స్వరూపుఁడునగు చక్రవర్తిముందా? నే నాంధ్రసామ్రాజ్య భృత్యపరంపరకుఁ జెందిన పవిత్రరక్తమునకు జనించినవాఁడను సుఁడీ!"

"సోదరా! పరరాజుల నేల యాశ్రయించితివి? పాల వాన కెట్లు చేరఁగలిగితివి?"

"ఇది నాపురాకృతఫలము. జగద్దేవునిపైకిఁ బోలిల రాజు సైన్యసమేతముగ యుద్ధమున కేగుతఱి నాజనకుఁడు సేనానాయకుఁడుగ నుండెను. యుద్ధభేరి వేయించు దినముననే నాకు మాతృవియోగము జరిగినది. అప్పటికి నాకు నాలుగు వత్సరములు నిండలేదు. దిక్కులేని నన్ను నాతండ్రి వెంటఁగొని చని సంగ్రామమున మరణించెను. జగద్దేవునకు సాహాయ్యముగ వచ్చిన పౌలవానసైనికులు నన్నుఁగొని పెంచి పెద్దవానిని జేసిరి. సేవకవృత్తిచే వారిఋణముఁ దీర్చితిని. కాన నేను పౌలవానపౌరుఁడనైతిని"

"పౌలవానదేశాధీశ్వరులు మాకు విద్వేషిపరంపర లోనివారా ? ఇది క్రొత్తవిషయ" మని చక్రవర్తి వాకొనెను.

"మిత్రమా! ఆ లేఖ నొకమా ఱిటు తెమ్ము."

"నిర్బంధమువలననైన నీయకతప్పదు. ఇందువలన నేను నా ధర్మము తొలఁగించినటులఁ గాఁజాలదు. అని ఆపద్ధర్మముల నుల్లంఘింప వీలులేదు. చిత్తగింపుఁడు." లేఖ నొసంగెను.

రుద్రసేనాని లేఖ నంతయు నొకమాఱు చూచి యిట్లు పఠించెను.

మహారాజ్యశోభితులగు భీమరాజుమహారాజుల వారి సన్నిధికి:—

పౌలవానమండలేశ్వరుఁడు కీర్తివర్మ నమస్కార పురస్సరముగ వ్రాయు విజ్ఞాపనపత్రిక.

తాముపంపిన చిత్తరువు, లేఖ చేరినది. గోకర్ణుని, మలయవతిని యమలోకమున కతిథులనుగఁ జేయ

నంగీకరించితిని. సౌభాగ్యవతితోఁ గందూరు రాజ్యము నాకు ధారవోయుదునను మాట జవ దాటకుఁడు. శుభముహూర్తము నిర్ణయించుకొని కందూరు ముట్టడించి మలయవతిని, గోకర్ణుని వివాహవేదికి బలియొసంగి పరిణయదీక్ష వహించె దను. ఆంధ్రసామ్రాజ్యాధీశ్వరుని వంచించుటకు మహాదేవరాయల బంధించిన మీ రాజనీతి శ్లాఘ నీయము. కందూరు, పొలవాస, వర్ధమానపుర రాజ్యము లేకమగువఱ కీరహస్యము బహిరంగము కారాదు. మనము కాకతీయులకు వెఱవఁబనిలేదు.

ఇట్లు విధేయుఁడు,
కీర్తివర్మ.

రుద్రసేనాని లేఖను బఠించి, "సోదరా! నీలేఖను నీవు కొనిపొమ్ము. నీ కర్తవ్యము ముం దెటుల నిశ్చయించుకొంటి" వనెను. "లేఖ భీమరాజున కొసంగి పొలవాస కేగుట నా ధర్మము. ఆవశ్యకమైన నీ రహస్యభేదనము భీమరాజునకు నివేదింతును. పొలవాసదేశాధీశ్వరుఁడు శిక్షితుఁ డయ్యేనేని నేను నైత మాంధ్రసామ్రాజ్యమునకుఁ జెందినవాఁడ నయ్యె దను. పొలవాసదేశాధీశ్వరున కీదేహము విక్రయింపఁబడి యుంటచే నింత కెక్కుడుగ నా యభిప్రాయమును వ్యక్తీకరింపఁ జాలను. సెలవు పుచ్చుకొనెద" నని రుద్రసేనానియొద్దను, జక్రవర్తియొద్దను సెలవునొంది యువకుఁడు వెడలిపోయెను.

భీమరాజను దుర్మార్గుఁడు కపటనాటకసూత్రధారుఁడనియు, మహాదేవరాయుల నాతఁడె బంధించెననియు, గోకర్ణుని, వసుంధరను వధించినచోఁ గీర్తివర్మకుఁ గందూరురాజ్యము నొసంగి సౌభాగ్యవతి యను తనపుత్రిక నిచ్చి పరిణయము చేయ నాతఁడు సంకల్పించె ననియుఁ జక్రవర్తికి, రుద్రసేనానికి స్పష్టమయ్యెను. కీర్తివర్మ పాలవానమండలేశ్వరుఁ డని వారికి వ్యక్తమయ్యెను. మలయవతి, గోకర్ణుఁడు వధ్యులుగా భీమరాజుచే నేల నిర్ణయింపఁబడిరో వా రెవరో చక్రవర్తికిఁ దెలియుసాధనము లింకను లభింపలేదు. కాని మలయవతి, గోకర్ణుఁడు, మహాదేవరాయలు, భీమరాజుదుర్మార్గముచే నత్యల్పకాలమున నంత మొందనున్నారు. కందూరురాజ్యనాయకుని వధించినందులకు ద్రవ్యదండనము తొలంగించి, గోకర్ణుని వసుంధరను జంపినందులకు క్షమించి భీమరాజుతో సంధి కంగీకరించువఱకు మహాదేవరాయలు కారాగారమున నుండవలసినవాఁడే. మలయవతి యెవతెయో, గోకర్ణుఁ డెవరో ముందు తెలిసికొనవలయును. వా రిరువురు భీమరాజునకుఁ బాలవానదేశాధీశునకు ద్వేషిపరంపరలోనివారు. వారిపరిచయముతోఁ జాల కార్యములు సానుకూలములు కాఁగలవు. భీమరాజు కందూరురాజ్యమును గీర్తివర్మకు ధారపోయనున్నాఁడు. కీర్తివర్మ దానికిఁ బ్రతికృతిగ గోకర్ణుని, మలయవతిని వధింపవలయును. వధవలనఁ గీర్తివర్మ పొందు ప్రతిఫలము కందూరురాజ్యము పాలించుటయె కానఁ దప్పక గోకర్ణుఁడు, వసుంధర కందూరురాజ్యసంబంధులై యుం

వలయును. కావున నింతవఱకుఁ దేలినసారాంశము భీమరాజు కీర్తివర్మలు రాజ్యద్రోహులు; వారల నిర్బంధింపవలయును. గోకర్ణుఁడు, మలయవతి వధ్యులు; వారల రక్షింపవలయును. మహాదేవరాయలను బంధోన్ముక్తుని గావింపవలయును. ఈ కార్యము లన్నియు నేకకాలమునఁ గావలయును. ఈ పవిత్రధర్మము నెరవేర్చినపుడుగాని యాంధ్రసామ్రాజ్యము ధర్మసంస్థాపనమునకు మూలబీజమను ప్రతిష్ఠ మనకు దక్కదు.' అని రుద్రసేనానియుఁ జక్రవర్తియు నిశ్చయించుకొనిరి. వారు ప్రతిక్షణమును సోమనాథునియాగమనమునకు నిరీక్షించుచుండిరి. సోమనాథునిఁ బంపువఱకుఁ జక్రవర్తికి మహాదేవరాయల విషయమై యెట్టిసంగతియుఁ దెలియదు. రుద్రసేనాని చేయు ప్రయత్నము లేమియు నంతవఱకు ఫలింపలేదు. సంన్యాసినిగూడ భావగీతములచే రహస్యప్రకటన మంతకుమున్ను గావింపలేదు. ఇప్పటికిఁ జక్రవర్తికి మహాదేవరాయల విషయమై కొంతవఱకుఁ దెలిసెను. భీమరాజుదుర్మార్గములు కొంతవఱకు బోధపడెను. కీర్తివర్మ దురాలోచనము వ్యక్తమయ్యెను. మలయవతి, వసుంధర, గోకర్ణుఁడు, సౌభాగ్యవతి యను వ్యక్తులనామములు తెలిసెను. వీని కన్నిఁటికి సంబంధించిన రహస్యము లనేకములు సోమనాథునివలనఁ బ్రకటితములు కాఁగలవని యాతనిరాకను బ్రతీక్షించుచు రాజు త్రోవ లరయుచుండెను.

ఇంతలో సోమనాథుఁడు వచ్చెను. చక్రవర్తియు, రుద్రసేనానియు నెదురేగి కొనివచ్చి యుచ్చాసనముల నాసీ

నులైరి. సోమనాథుఁ డీ యెడ తెగనిప్రయాణములచే బడలి పోయెను. రహస్యభేదనమున కాడంబరము భంగకర మని పాదచారిగ దేశ మంతయుఁ బర్యటనము గావించుటచే నాతని కారోగ్యస్థితి చాలవఱకు తొలంగెను. కార్యసాధనము గావింపఁగలిగితి నను నుత్సాహముచే నాత డివి యన్నియుఁ బాటింపలేదు. సోమనాథుని ముఖవికాసము సేనానికిఁ జక్రవర్తికి నానందజనక మయ్యెను. సోదరుఁడు కుశలముగ నుండియుండవచ్చు నను ధైర్య మాతనియంతరంగముల నిబిడీకృత మయ్యెను. సోమనాథుఁ డాయాసము దీర్చికొని యీ బ్రాహ్మణవేషమే నన్ను రక్షించి భీమరాజు బాఱినుండి తొలగించిన దని మందహాసముతో వచించెను. రుద్రసేనాని సోమనాథునితో 'మిత్రమా! ఈ మహాదేవరాయలు క్షేమముగా నున్నాఁడా? మన కెన్నటికేని సందర్శన భాగ్యము లభించునా? విశేషము లెవ్వి' యనెను.

"మహాదేవరాయలు భీమరాజుచేఁ గారాగారమున బంధింపఁబడియున్నాఁడు. నే నాతనితో భాషించితినిగాని రక్షకభటప్రతిబంధకమువలనఁ బ్రసంగము పూర్తికాలేదు.

"భీమరాజు కిరాతుఁడా యేమి - మహాదేవరాయల బంధించుటకు?"

"కిరాతానేసరుఁడు. మహాదేవరాయలపైఁ బ్రేమ జూపెనను నెపము, కీర్తివర్మను బరిణయము చేసికొన న నె నను నెపము నాధారము జేసికొని సౌభాగ్యవతియను తన

పుత్రిసే బంధించెను. వానికిఁ బరులు లెక్కయా? సౌభాగ్య వతిని నేను కారాగారమున దర్శించితిని." ,

చక్రవర్తి చిఱునవ్వు నవ్వి, 'కారాగారవిముక్తి, కళ్యాణము ఒకముహూర్తమునసే జర్గవలయును కాఁబోలు!' ననెను.

"గోకర్ణుఁడు, వసుంధర యను నామములు మాకుఁ జాలకాలమునుండి వినవచ్చుచున్నవి. వారిరువురు తన ప్రత్యర్థికోటిలోని వారని భీమరాజు భావించుచుండెను. వారల వృత్తాంతము నీ వేమని తెలిసికోఁగలిగితివా?"

"వసుంధర తైలపదేవునిపుత్రిక. కందూరురాజ్య యువరాజ్ఞి. పితృమరణము విని యామెతల్లి సహగమన మాచరించెను. దిక్కులేని యా కందువును భీమరాజుదురంతములకు వ్యతిరేకించు తదనుజుడగు గోకర్ణుఁడు తన ధర్మపత్నిసాహాయ్యముతోఁ బెంచెను."

"కావుననేనా వసుంధరను, గోకర్ణుని భీమరాజు చంప నెంచినది? వసుంధరకుఁ బరిణయము జరిగినదా?"

గోకర్ణుఁడు వసుంధరను సుతనిర్విశేషముగఁ బెంచెను. యుక్తవయస్సు వచ్చుటచే భీమరాజనుమతిఁ బడసి, వర నిర్ణయమునకు సాహాయ్యము చేయుమని గోకర్ణుఁ డొక లేఖ వ్రాయుచు దానితో, వసుంధర ప్రతిచ్ఛందము నంపెను. అప్పు డే నచట నుంటచే నా కా ప్రతిచ్ఛందము లభించినది. ఆ లేఖకు భీమరాజు వ్రాసిన ప్రత్యుత్తరము వినఁదగినది. "వసుంధరను నాకిచ్చి వివాహము చేయుము. నే నపత్నీకుఁడను.

బుద్ధిపూర్వకముగ నొసంగవేని బలిమిమైఁ బరిణయము జరిపి కొందును."

"ఇందు గోకర్ణునియభిమత మెటు లున్నది? పోషకుఁడగు నాతఁడు తండ్రియంతటివాఁడు కదా!"

"ఆ విషయ మావల విన్నవింతును. నేను కందూరు రాజ్యమున కేగితిని. సాత్త్వికుఁడగు గోకర్ణునితో భాషించితిని. వసుంధరను సందర్శించితిని. ఆయమస్వరూపము, సౌశీల్యము వర్ణనాతీతము. ఈ స్వరూపపట మాయమదియె." అని సోమనాథుఁడు తన మూటలోనుండి యొక చిత్రపటముఁ దీసి చక్రవర్తి కొసంగెను.

చక్రవర్తి యా పటమును బలుమాఱు సందర్శించి యా సతిరూపలావణ్యములకు మిగుల విస్మితుఁ డయ్యెను. గంభీరహృదయుఁడగు నా చక్రవర్తి చిత్రపటసందర్శనమున జనించినయుత్సాహమును బ్రచురింపక యటులె తిలకించుచుండెను. రుద్రసేనాని నవ్వుచు "రాజచూడామణీ! కందూరు రాజ్యవిపత్తు వారించి యీ యమ నాంధ్రసామ్రాజ్యరాజ్ఞిని జేయుట నా యభిమతము. ఈ దీనునియుపదేశ మాలించి కృతార్థునిఁ జేయుఁ"డనెను. సోమనాథుఁ డంతలో 'నిది గోకర్ణుని తలంపుగూడ' నై యున్నది. వసుంధర యిందుల కిది వఱకె యంగీకరించియుండును. భీమరాజు నాయమ వలచుట కలలోని వార్త' యనెను. చక్రవర్తి చిఱునగవుతోఁ బ్రత్యుత్తర మొసంగి సోమనాథునకుఁ దాము తెలిసికొనినయంశములు సంన్యాసినియొక్కయు రాజద్రోహులయొక్కయు

వృత్తాంతములు నివేదించెను. అప్పటికి మిగులఁ బ్రొద్దుపోవుటచే నెవరివిడిదికి వారేగిరి.

---

## ఎనిమిదవ ప్రకరణము

సోమనాథుఁడు, రుద్రదేవచక్రవర్తి, రుద్రసేనాని ప్రాతఃకాలముననే యాస్థానమున సమావేశమైరి. సోమనాథుఁడు తానేగినచోటులు భీమరాజుదుష్పరిపాలనము, సౌదామిని దుర్నయము, సౌభాగ్యవతీమహాదేవరాయలయనురాగము, వసుంధరసౌందర్యము, మలయవతీగోకర్ణుల పవిత్రజీవితము, సాంగముగ నాయిరువురకు నివేదించెను. చిత్రపట సంపాదనమునకుఁ దా నొనరించిన కృత్రిమోపాయము, గోకర్ణుని శాంతజీవితము, వాగీంద్రునిచరిత్రము మొదలగు స్వల్పాంశములుగూడ సమయానుసారముగ విన్నవించెను. రుద్రసేనాని విషయము నంతయు విని యిట్లు వాకొనెను. 'రాజచంద్రా! మనమిఁక నుపేక్షింపఁదగదు. కీర్తివర్మ కందూరుపై నెపుడు దాడివెడలునో కనిపెట్టవలయును. గోకర్ణుని, మలయవతిని, వసుంధరను రక్షింపవలయును. మహాదేవరాయలనురక్షితముగ బంధవిముక్తుని గావింపవలయును. విశ్రాంతి లేదు కావునఁ గార్యక్రమ మీదినమునుండియే యారంభింపవలయును. ఈ దుర్నయతంత్రము స్వల్పకాలములో భీమరాజు నిర్వహించు నున్నాఁడు. ప్రజాక్షయమునకు వెఱువమేని పొలవానపైకి, వర్ధమానపురముపైకి మన సైన్యమును మూఁడుభాగములుగ విభ

జించియందలి రెండు భాగములు సోమనాథునకు, నాకు, నాధిపత్య మొసంగింపవచ్చును. మిగిలిన భాగము దుర్గసంరక్షణమునకుఁ దాముంచికొనవచ్చునుగాని, దేశము మిగుల నాందోళనములో నున్నది. ఈ సైనికవ్యయము నెఱింగి దేవగిరియాదవులు సామ్రాజ్యముపైకి వచ్చిరేని ప్రతిఘటించుట మిగుల దుర్లభము. కావున ధర్మరజ్జువుచే సైనికవ్యయముఁ గావింపక భీమరాజును గీర్తివర్మను బంధించి సాధులోకమును సంరక్షింపవలయును. దీనికి వర్ధమానపురపౌరులసాహాయ్యము గోకర్ణునిసాహాయ్యము మాత్రము చాలును. ధర్మదేవత మన కన్నివిధముల సాహాయ్యకారిణి కాఁగలదు."

సోమనాథు డంతయు విని "వస్వల్పసైన్యముతోనైన మే మేగి ధర్మసంస్థాపనముఁ గావించి రాఁగలము. రాజు సామ్రాజ్యమున నున్నఁ జాలు" నని చక్రవర్తిముఖముఁ జూచుచు వాకొనెను. చక్రవర్తి ప్రత్యుత్తరము నొసంగనున్నతఱి నొకభటుఁ డేతెంచి కందూరురాజ్యమునుండి గోకర్ణరాజుగారు వచ్చి దర్శనముఁ గోరుచున్నారని పత్రిక నొసంగెను. చక్రవర్తి యా లేఖ దర్శించి వెంటనే కొనిరండని సోమనాథునకు, రుద్రసేనానికి నాజ్ఞ నిచ్చెను. పిమ్మట సగౌరవంబుగ గోకర్ణుని నాస్థానమునకుఁ గొనివచ్చుచుండ రుద్రదేవచక్రవర్తి యెదురేగి పరామర్శించి యుచితాసనముఁ జూపి యాసీనుఁ డయ్యెను. సోమనాథుఁడు, సేనానియుఁ దమపీఠములపై నాసీనులైరి. శాంతమృదుస్వరముతో గోకర్ణుఁడు చక్రవర్తినిఁ జూచుచు వినయముగ నిటుల భాషించెను.

'రాజచూడామణీ! ధర్మజ్ఞుండవు. పండితకవివి. నీ ముందు భాషింప నాబోటి నిరక్షరాస్యు లశక్తులుగాని పరిస్థితులు న న్నిట కీడ్చికొని తెచ్చినవి. నా పూర్వజీవితము తా మెఱింగియుందురు. ఎఱుంగరా- యిప్పుడు చెప్పవలసిన యవసరములేదు. ఇఁకఁ జెప్పనున్నది యుత్తరజీవితమంటలి ముఖ్యాంశము. వసుంధరచిత్రపటము మీహస్తము నలంకరించుట నాధన్యత్వమునకు సూచకము. భీమరాజు వసుంధరను బలిమిపైఁ బెండ్లాడునను వార్త విని వసుంధర యాహారనిద్రలు వర్జించి శుష్కించుచున్నది. ఆ దైన్యావస్థలో— ఆ శోచ్యావస్థలో- నశ్రుమలీమసదృష్టితో నాముఖముఁ జూచియుఁ జూడనటులఁ దిలకించి "నా జీవితసర్వస్వము నుద్ధరింప రుద్రదేవచక్రవర్తియే . సమర్థుఁడు. నన్ను రక్షింతు నని యభయహస్త మాయన యొసంగెనా జీవితశేషము సార్థకముగ భావింతును. లేదా? పరమున నున్న తల్లిదండ్రుల పరిచర్య కేగెద"నని పలికినది. హృదయదారణములగు నాపలుకు లాలించి వసుంధరను సుతనిర్విశేషముగఁ బెంచిన నాసహధర్మచారిణి మలయవతి నిర్జీవయై విచారశేషయై యున్నది. కనికరింపవలసిన ధర్మము మీది. మీరు చక్రవర్తులు, మేము సామంతులము. మాక్షేమము విచారించుటయె మీధర్మము. ఇదిగో మావసుంధర మీకు వ్రాసిన విజ్ఞాపనపత్రిక. చిత్తగింపుఁ'డని గోకర్ణుఁడు చక్రవర్తి కొకలేఖ నొసంగెను. చక్రవర్తి కేలనున్న చిత్రపట మురమున నుంచికొని సహచరులు విన నిటులఁ బఠించెను.

"శ్రీ మహామండలేశ్వర రాజాధిరాజ ఆంధ్రసామ్రాజ్యాధీశ్వర రుద్రదేవచక్రవర్తిపాదపద్మముల సన్నిధికి:—

సీ॥ అనుగంబునఁ బెండ్లియాడ సంకల్పించె
భీమరాజీ వద్దువెట్టుమయ్య!
కందూరురాజ్యంబు కలుషాత్ములకు వశం
వదము గాకుండఁ గాపాడుమయ్య!
యే దిక్కునేఱని యీ వసుంధర కీవ
యభయహస్తంబు నీయంగదయ్య!
అర్హా రాలని తోఁచెనా? యాంధ్రసామ్రాజ్య
పరిచర్యకైనఁ జేపట్టుమయ్య!
తే॥ గీ॥ రక్షకులు లేరు నీవె శరణమయ్య!
తల్లిదండ్రుల నోఁచనిదానవయ్య!
దైవ మీవాట ననుఁబ్రోవ ధర్మమయ్య!
శాంతవిస్ఫూర్తి! శ్రీ రుద్రచక్రవర్తి!"

ఈ సందేశము విని సోమనాథుఁడు, రుద్రసేనానియుఁ గన్నుల బొటబొట నశ్రులఁ జార్చిరి. చక్రవర్తి డగ్గుత్తికతోఁ గనులఁ దుడిచికొని నేలఁజూడసాగెను. గోకర్ణుఁ డాలేఖ నంతకు మున్నె చూచియెఱుంగఁడు. ఆ దైన్యోక్తులాతనిహృదయమును శోకరసమున ముంచివైచెను. ఆయన యేమిచెప్పుటకును శక్తుఁడు కాఁడయ్యెను. విచారాతిశయమున నా నలువురొకరిముఖ మొకరు చూచుకొనఁజాలరైరి. చాలసేపటుల నిశ్శబ్దముగ నాస్థాన ముండెను. కొంతసేపటికి గోకర్ణుఁడు చక్రవర్తి కిటుల విన్నవించెను.

"రాజేంద్రా! భీమరాజు చేయు నీ యధర్మయత్నమునకు సౌదామిని యను నొకరాక్షసి కారకురాలు. ఆయమను గుఱించి తాము తెలిసికొనఁ దగినంత ప్రసక్తిలేదు. ఇపుడు కందూరుసంస్థానమున వాగీంద్రచూడామణి యను జైనాచార్యు నుంచి వచ్చితిని. ప్రజాక్షయము లేకుండ, రక్తపాతము లేకుండ ధర్మరక్షణముఁ గావింపుఁడని నా విజ్ఞప్తి. భీమరాజు సౌదామినితో గలిసి పౌలవాసకు రాయబారము లంపుచు, మలయవతిని, నన్ను జంప సంకల్పించెనని వినుచున్నాను. తన పుత్రియగు సౌభాగ్యవతిని, మంత్రిపుత్రియగు మంజరిని నాతఁడు వధించెనను ప్రవాదము కలదు. ఈ ప్రవాదము మిథ్యయేని నిర్బంధావాసముననేని యుంచియుండును. మహాదేవరాయలసంరక్షణము మీధర్మముగాన నేను విన్నవింపఁబనిలేదు. వసుంధర ననుగ్రహించిన యుత్తరక్షణముననే నేను శారదాపీఠమున కేగి సహధర్మిణితో వసింతును. నాకు సెలవున కనుజ్ఞయింతు."

ఇట్లు గోకర్ణుఁడు భాషించి చక్రవర్తి వైపునకు మరలి సెలవా? యని మఱల వాకొనెను. చక్రవర్తి లేచి "దయచేయుఁడు, వసుంధర కెట్టి విపత్తును రాకుండ సంరక్షింపఁబ్రయత్నింతును. దీనికి దైవయత్నముసైతము కావలయును. ఈ చిత్రపటము నా ప్రతిబింబము. మీ సన్నిధి నుంచికొని చక్రవర్తి నాయాజ్ఞాబద్ధుఁడై యున్నాఁడని భావింపుఁడు. స్వల్పకాలములో దుర్నయుల బంధించి దేశశాంతి నెలకొల్పబయలువెడలనున్నాను. ధర్మదేవతయే మనకు విజయము

ప్రసాదింపఁగలదు. దేశకాలావస్థలు విషమముగా నున్న యీ యదనున మీరు స్థానాంతరమున నుంట క్షేమము కాదు. దయచేయుఁడు, దయచేయుఁ" డని ప్రతిచ్ఛందము గోకర్ణున కొసంగి, సోమనాథ రుద్రసేనానులతోఁ గలిసి చక్రవర్తి గోకర్ణుని కోటపూవలివఱకుఁ బంపి పద్మాక్షీయాలయ మటకు మిగుల సమీపమున నుంటచేఁ గాలక్షేపార్థము, ఆలోచనార్థ మట కేకాంతగోష్ఠికై రుద్రదేవుఁడు సత్వరముగ నేగెను.

రుద్రదేవుఁడు సోమనాథునకు సన్న్యాసినినిగూర్చి తా నెఱింగినంతవఱకుఁ దెలిపి యామె వృత్తాంతము నెఱుంగుదువా? యనియడిగెను. సోమనాథుఁడు చాలసేపు యోజించి 'అధర్మభీతిచే వర్ధమానపురవాసు లెందఱెందఱో దేశదేశములకుఁ బోయి భీమరాజును మట్టుపెట్ట నచటి రాజులఁ బ్రోత్సహించుచున్నారు. బహుశః సన్న్యాసినియు నట్టివారిలో నొకతె గానోపు. ఆమెనుజూచినఁగాని నా యభిప్రాయము దెలుపఁజాల' నని పల్కెను. కాని సోమనాథునిహృదయమునమాత్రము సన్న్యాసినీసాహాయ్యమునఁ బ్రతిపక్షుల సులభముగ జయింప వచ్చునని యు, నా యమ ధర్మదేవత కానోపుననియుఁ దోఁచుటచే సందర్శనోత్సాహమున నిముసములు యుగములవలె గడుపుచుండెను.

రుద్రదేవుఁడు పద్మాక్షీయాలయమునకుఁ గుడిప్రక్క నున్న తీర్థంకరవిగ్రహములచెంతఁ గల శిలావేదికపై నాసీనుఁ డయ్యెను. అతనిహృదయము ధర్మసంస్థాపనమునకు శాంతి నెలకొల్పుటకుఁ దొందరపడుచుండెను. సోదరుని నాపత్సముద్ర

ద్రిమునుండి యుద్ధరించుటయు భీమరాజు బారినుండి వసుంధరను గాపాడుటయుఁ దన విధులుగ నెంచుటచే రుద్రదేవుని హృదయము ప్రతిక్రియాన్వేషణమునఁ దహతహపడుచుండెను. పాదపీఠముకడ నాసీనుఁడైన రుద్రసేనానిని, సరసనున్న సోమనాథుని గాంచి రుద్రదేవచక్రవర్తి యిట్లు వాకొనెను. "సోదరులారా! పరిస్థితులు పూర్తిగ విషమింపకముందె మనము ప్రతిక్రియ గావింపవలయును. కార్యఫల మొకప్పుడు తొందరపడినను మఱియొకయెడ నాలసించినను జెడును. మనము మిగుల సందిగ్ధావస్థలో నున్నారము. యుద్ధమొనర్చి ప్రతిపక్షుల జయించుట కిది యదను గాదు. నేను పరిమిత సైన్యముతోఁ గందూరున కేగి యచటి విషమస్థితి గోకర్ణుని సాయమునఁ జక్కబెట్టెద. ప్రతిపక్షుల కది కూటస్థలముగాన గోకర్ణుని యహింసాతత్వమును గేలూతగాఁ గొని భేదనీతితోఁ బ్రతిపక్షుల లోఁగొందును. సోమనాథకవికి వర్ధమానపురములో మంచి ప్రాపకము లభించినది. దురాలోచనములకు, దురంతములకె భీమరాజుపుట్టెయే జన్మస్థలము. అచట నెవ్వడే ప్రయత్నములు జరుగుచున్నవో వాని నేయే సమయముల నెటులఁబ్రతిఘటింపవలయునో యది సోమనాథుని పని. భీమరాజును బదచ్యుతు నొనర్చి మహాదేవరాయలను, సౌభాగ్యవతిని బంధనోన్ముక్తులఁ గావించి విజయలక్ష్మిని నాకుఁ గూర్చుటకు సోమనాథుఁడె తగినవాఁడు. కీర్తివర్మ దుష్టుఁడు. స్వల్పఫలమునకాసపడి యెన్నియేని ఘోరహత్యలు గావించి పవిత్రతరమగు నాంధ్రదేశమును నిరపరాధుల రక్తముచేఁ

గళంకితము చేయనున్నాఁడు. ఆతని నిర్బంధించినఁగాని భీమరాజు, సౌదామిని మనకు లోఁబడరు. బలసంరంభముచేఁ గన్నుమిన్నెఱుఁగక సమస్తాంధ్రదేశమును గ్రమింగసంకల్పించిన యీ దురాశాపీడితుని మార్గమధ్యమున నెదిరింపవలయును. ఇది రుద్రసేనాని యొనరింపఁదగిన పని. ఇఁక నాలసించినఁ గొన్ని యపాయములుగూడఁ దటస్థింపవచ్చును. మన కార్య క్రమము మనముగ్గురికిఁ దక్క నితరులకుఁ దెలియరాదు. మనము రాజ్యము విడిచినసంగతియే వెల్లడికాఁగూడదు. నగరరక్షణమునకు మాధవసేనానిని, గండసేనానిని నియోగించెదను. వార లప్రమత్తులై నగరరక్షణ మొనరింపఁగలరు. ప్రతిపక్షుల దృష్టియంతియు నిపుడు భీమరాజుపై నున్నది. కాన మననగరముమీఁది కింతలో నెవరును రాఁజాలరు."

ఇట్లు చక్రవర్తి చెప్పఁగనే రుద్రసేనానియు, సోము నాథుఁడు సంగీకారసూచకముగ నామోదము దెలిపిరి. అంద ఱును బద్మాక్షిసన్నిధి కేగి తీర్థప్రసాదముల స్వీకరించి పునః పునఃప్రణామము లాచరించి వెనుకకు మరలిరి. సోమనాథుఁడు, తన పురోభాగమునఁ గల వేదికపయి నాసీనురాలై యుండి ధ్యానదృష్టితో లోలోన నేదియో జపించుచున్న యోగిని దివ్యస్వరూపమును దర్శించి ప్రమోన్పడి నిలిచెను. అపు డాయన ఈ క్రింది శ్లోకమును మనోహరముగఁ బఠించి ఫలములను దేవిసన్నిధిని సమర్పించి యథేచ్ఛముగ వెడలిపోయెను.

" శ్రీమజ్జినేంద్రపదపద్మ మహేశభవ్యం
నన్మతిస్త్రిలోకనృపతిం త్రిభువనేంద్రవంద్యం

నిశ్శేషదోషపరిఖండనచండకాండం
రత్నత్రియపవిభవ మద్య గుణైకతానం."

యోగిని సామాన్యురాలు కాదు. భీమరాజుదురంత ములకు వెఱచి యాత్మరక్షణమునకు బ్రహ్మచర్యదీక్ష ధరించిన పవిత్రురాలు. ఈయమ వర్ధమానపురనివాసినియే యని సోమనాథుఁడు రాజునకు విన్నవించెను. రుద్రసేనాని యోగిని జీవితచరిత్రము కొంతవఱకు సోమనాథునకుఁ బరిచయమొనర్చెను. ఇటుల నిష్టగోష్ఠితో మువ్వురు రాజమందిరద్వారము చేరువఱకు సాయంసంధ్యారాగము తమోగర్భమునఁ జేరువేళ యయ్యెను. ఇంతలో నొకయువకుఁడు ద్వారపాలకుని చేనన్నచే రుద్రదేవచక్రవర్తిని గుర్తించి ఫలాక్షత లొసంగి నమస్కృతుల స్వీకరించి యిట్లు విన్నవించెను. "రాజేంద్రా! నేను శారదాపీఠమున నుండు జైనభిక్షుకుఁడను. భీమరాజు, సౌదామినియుఁ గుట్రగావించి కీర్తివర్మచే మలయవతిని, గోకర్ణుని జంపింపఁజేయుటకు వసుంధరను పెండ్లాడఁజేయుటకు సల్పు యత్నములు ఫలోన్ముఖములైనవి. రేపటి నవమికిఁ బెండ్లికుమారుఁడై వసుంధరను స్వీకరింప భీమరాజు కందూరు చేరును. నేఁడో రేపో కీర్తివర్మ వర్ధమానపురి చేరి దశమి నాఁటికిఁ గందూరు చేరును. భీమరా జింకఁ బదిదినములలోఁ దనకు లోఁబడియుండకున్న మహాదేవరాయలఁ జిత్రవధము గావింతునని మీకు వర్తమానమంపును. ఈ యంశము విశ్వాస పాత్రులగు శిష్యులవలన వాగీంద్రచూడామణి గ్రహించి గోకర్ణుఁడున్నైతము మీసన్నిధినుంటచే మీకు నివేదింప నన్నుఁ

బంపినాఁడు. నావలన నింతకుముందె గోకర్ణుఁడీయంశము విని తమకు విన్నవింపుమని యాజ్ఞ యొసంగెను." రుద్రదేవుఁడీసందేశము విని కొంచెమునే పేదియో యోచించెను. సోమనాథుఁడును, రుద్రసేనానియుఁ గర్తవ్యము దోఁచకుండిరి. రుద్రదేవుఁడు భిక్షుని గౌరవించి "సోదరా! వాగీంద్రచూడామణికిఁ దొలుత నాకృతజ్ఞతావందనంబుల నందించి యిటుల విన్నవింపుము. మునీంద్రా! మీ యవ్యాజకరుణకు వందనశతంబులు. ధర్మదేవతయాజ్ఞానుసారము కార్యరంగమున నడుగిడనున్నాఁడను. మీదివ్యాశీర్వాదఫలము నాకు విజయము సమకూర్పకపోదు." భిక్షుకుఁడు సెలవంది వెడలిపోయెను.

రుద్రదేవుఁడు తన సహచరులతో 'సఖులారా! కార్యక్రమము మన మింతకుమున్నె నిర్ణయించుకొంటిమిగదా! దానికి మార్పుసేయనవసరములేదు. ప్రతిపక్షులకార్యక్రమముగూడ మనకు సాంగముగఁ దెలిసినదిగాన నిఁకఁ బ్రతిఘటనమునకుఁ దొందరపడవలసియున్నది. భగవానుఁడు నిమిత్తమాత్రులనుగ మానవుల నిల్పి ధర్మరక్షణము, స్వయముగనే కావించును. మనది ధర్మపక్షము. ఫలమునకు మనము తీవ్రపడఁబనిలేదు.' అనుచు ముందునకుఁ జూచెను. సన్న్యాసిని రాజమందిరపురోభాగమునఁ గొంచెము సేపు నిలిచి మనోహరముగ నీక్రిందిగీతమును బాడి తంబురమీటుచు నెందేనిచనెను.

కువలయాపీడమా! గునియకుమమ్మ
ములులారా! గర్వమతి చంపుకొనుఁడు

దేవకీ! నీవు శాంతింపు మో తల్లి!
వసుదేవ! వగపును వర్జింపుమయ్య!
కంసుఁడా! నీకండకావర మూర
గోపికాంకములందు గులుకు చిన్నారి.
సజ్జనలోచనోత్సాహాకరుండు
ధర్మసంస్థాపనార్థము లోకమందుఁ
బ్రభవంబు నొందిన పరమపావనుఁడు
చిన్నికృష్ణుఁడు నిన్నుఁ జెండనున్నాఁడ
ప్రజల నందఱను గీడ్వఱచిన దోసఁగు
అనపరాధుల కొనర్చిన తీవ్రశిక్ష
యనుభవించెడి కాల మది సమీపించె
చిన్నికృష్ణుఁడు నిన్నుఁ జెండనున్నాఁడు
ఘనభీమవిక్రాంతి గల యంతవఱకె
సౌదామినీప్రకాశంబు దనర్చు
రుద్రుండు ప్రళయదారుణవీక్షణాగ్ని
ప్రసరింప నెదిరించు బంటు గలాఁడె.

సన్న్యాసిని చాలదూర మటులె పాడుచు నిర్గమించెను. ఆయమ దూర మేగుటచేఁ బాట వినవచ్చుట లేదు. సోమనాథుఁడు శ్రద్ధతో గీతము నంతయు నాలించి "ఈ యమ వర్ధమానపురసంబంధురాలె. మనసంకల్పమున కీమె శుభాశీర్వాద మొసంగుచున్నది. కాన నీ శుభసూచకగీతము నూత గొని విజయయాత్రకు బయలువెడలుదము. పోదము రం"డని సోమనాథుఁ డా యిరువురితో నాస్థానమున కేగెను.

# తొమ్మిదవ ప్రకరణము.

రాజభక్తులగు తన ముగ్గురుభటులు హనుమకొండలో రుద్రసేనానిచే జంపఁబడిన వార్త గూఢచారులు భీమరాజున కెఱింగించిరి. ఆ వార్త వినఁగనే భీమరాజు అదరిపడెను. ఆతని గుండె యెంతసేపటికిని గుదుటఁబడలేదు. తన ప్రియమిత్రుల యొద్దఁ గల లేఖాదికముల మూలమున రుద్రదేవునకుఁ దన ప్రయత్నమంతయుఁ దెలిసియుండుననియు స్వల్పకాలమున నతఁ డెదిరించినచో నపాయము కల్గుననియు దూరదృష్టిగల భీమరాజు తలంచెను. అందులకై ప్రతిఘటనప్రయత్నములు త్వరత్వరగఁ జేయ నిశ్చయించి నాఁటిరాత్రి సౌదామినీసాహాయ్యమునఁ గార్యాలోచనములతోఁ గడపెను. పొలవాసనుండి మహావైభవములో రానున్న కీర్తివర్మకుఁ దన నగరమున విడిది యేర్పఱచుటకును, దశమినాఁటికిఁ గంహూరు జేరుటకు అంచెలమేనాలు సిద్ధముచేయుటకును బ్రధానమంత్రికి భీమరాజాజ్ఞ యొసంగెను. దశమినాఁడు వసుంధరను బెండ్లాడ సుముహూర్తము నిర్ణయించి భీమరాజందులకు వలయు పరికరముల సమకూర్చుభార మంతయు సౌదామినిపయిఁ బెట్టెను. తక్కినకార్యము లన్నియు నొకదానివెంట నొకటి జరుగు పవకాశము లంతకుముందె యేర్పఱుపఁబడెను. కాని భీమరాజును, సౌదామినిని బీడించు హృదయశల్య మింక నటులె యున్నది.

తనయేకైకపుత్రికయగు సౌభాగ్యవతిని భీమరాజు కారాగృహమున నుంచి చిరకాలమైనది. ఆయమస్నేహితురాలగు మంజరివార్తయే పౌరులు మఱచిరి. సౌదామిని యెడ నవినయము ప్రచురించి శిక్షాపాత్రురాలైన సౌభాగ్యవతిని జెఱనుండి విడిపించి కీర్తివర్మ కొసంగి పరిణయము గావింపవలసి యున్నది. మహాదేవరాయలపై వలపుఁగొన్న సౌభాగ్యవతి, కీర్తివర్మపేరు చెప్పిన మండిపడుచుండెను. సౌభాగ్యవతిని జెఱనుండి విడిపించి కీర్తివర్మనామె చెట్టబట్టునటుల నయభయములఁ జూపి ప్రయత్నింపవలసిన యావశ్యకత యేర్పడుటచే సౌదామినియు, భీమరాజును సౌభాగ్యవతి యున్న కారాగృహము చేరిరి.

సౌభాగ్యవతి జీర్ణపరిధానముతో, శుష్కించిన దేహముతో మహాదేవరాయలపవిత్రనామమె తన్నుద్ధరింపఁగలదని స్మరించుచుండెను. ద్వారమునందులనుండి యాకృత్రిమ దంపతులు సౌభాగ్యవతిని దర్శించిరి. భీమరాజుహృదయము పశ్చాత్తాపతప్తమయ్యెను. తనదుష్టత్వమునకొ, పాపవర్తనమునకొ సౌభాగ్యవతిజీవితము నింతవఱకు బలిపెట్టినందులకు లోలోనఁ బరితపించి గద్గదస్వరముతో పుత్రిని సౌభాగ్యవతి యని నోరారఁ బిలిచి యిట్లు భాషించెను. "అమ్మాయీ! పౌలవానరాజు కీర్తివర్మ నిన్నుఁ బరిణయమాడ దశమినాటికి రానున్నాఁడు. నీయంగీకారము దెలిపెదవేని బంధవిముక్త నొనరించెద. మా యుభయవంశములఁ దరింపఁజేయుము. నీకు దుర్వ్యథ గావించిన మంజరిజీవితము కాలగర్భమున

మరుగుపడినది. సర్వవిధముల నీ శ్రేయము విచారింపఁదగినది మాతృప్రాయయగు సౌదామిని, తండ్రినగు నేనునుమాత్రమె. పరులు స్వార్థపరులెగాని శుభచింతనులుగారు. మహాదేవ రాయలపయి నీయనురాగము ప్రసరింపనీయకుము. అతఁడు తరతరములనుండి మనకు విరోధముగల వంశమున జనించిన వాఁడె. అంతియకాక దోషియై నావలన యావజ్జీవితకారా గృహశిక్ష పొందినాఁడు. నీ వభిలషించిన నాతని వివాహవేదికి బలియొసంగెద. లేదా, నీయంతిపురిలోఁ బరిచారకునిగ నైన నుంచెద"—ఈ భీమరాజువాక్యము లింకను ముగియకముందె—ప్రసంగమధ్యమున నడ్డమువచ్చి సౌదామిని యేదియో పలుకు చుండెను.

సౌభాగ్యవతి కనులు విప్పి సౌదామినినిగాని, భీమ రాజునుగాని తేరిచూడలేదు. వ్రేల్చిన తలతో నుపన్యాసము లన్నియు నాలించెను. తిరస్కారసూచకముగఁ బ్రత్యుత్తరము నొసంగ నిరాకరించెను. కాని మహాదేవరాయల బలియొసంగెద నను మాటయు బరిచారకు నొనర్తునను మాటయు నాయమ చెవికి బాణపాతమువలె దుర్భరసంతాపకర మయ్యెను. ఆవేళ వశమున నవనతవదనముతోనె సౌభాగ్యవతి యిట్లుప్రత్యుత్తర మిచ్చెను. "ఓ కఠినస్వభావులారా! మీనిర్బంధమునకు నా దేహము నెన్నఁడో యొసంగితిని. కారాగృహమధ్యమున నున్నను మహాదేవరాయలహృదయము, నాహృదయము స్వాతంత్ర్యతరంగములపయి విహరించుచున్నవి. ఖేచరులవలె నొండొంటి నెడబాయక విశ్వమోహనమగు నైహికమునఁ

దిరుగుచున్నవి. ఈ రెంటిని విడదీయుటకు మీకె కాదు విశ్వ నిర్మాతయగు పరమాత్మునికేని సాధ్యముగాదు. ఇదిగో! నాస్థిరసంకల్పము వినుండు. ఈ జన్మమునఁ గాకున్న, మఱియొక జన్మముననేని నాజీవితసర్వస్వమునకు మహాదేవరాయలే యజమానుఁడు. మమ్మిరువురఁ జంపుఁడు. ఒకరికై యింకొకరిని వధింపుఁడు. పరస్పరప్రేమ మా యస్థికలయందుసైతము నిండి పునర్జన్మముకొఱకుఁ దపము కావింపకపోదు. ఈ దేహముపయి మీకుఁ గల స్వాతంత్ర్య మెట్లు దుర్వినియోగము గావించు కొన్నను నేను కాదనను. ఇంత కెక్కుడుగ మీతో భాషింప నాయంతరాత్మ యంగీకరించుట లేదు." .

సౌభాగ్యవతి పల్కినపరుషసంభాషణమువలన కృత్రిమ దంపతులు హతాశులైరి. నయభయములఁ జెప్పిరి. బెదరించిరి. బతిమాలిరి. లాభము లేకపోఁగ సౌభాగ్యవతి వారి వైపు వీపు త్రిప్పి బదులాడ నిరాకరించెను. "గోకర్ణుఁడు, మలయవతి చెప్పినచోఁ గీర్తివర్మను స్వీకరింతువా ?" యని సౌదామిని ప్రశ్నించెను. దానికిఁ బ్రత్యుత్తరము లేదుగాని "దురదృష్టవంతురాలనగు నాకా ఆ పుణ్యదంపతులదర్శన భాగ్యము! ఆ యదృష్టరేఖ యెన్నఁడో తొలంగిన"దని నిరాశతో సౌభాగ్యవతి నిట్టూర్పు విడచెను. ఇట నింక నాగినఁ బరిస్థితు లింకను విషమించునని భీమరాజు సౌదామినితో మహాదేవరాయ లున్న చెఱసాలకడఁ బోయి నిలువఁబడెను.

మహాదేవరాయలు సౌభాగ్యవతిప్రతిచ్ఛందమును సారుసారెకుం దిలకించుచు నిటుల స్మరించుచుండెను.

“సుందరీ! నీవిలాసమున కభివాదము. నీదయార్ద్రహృదయమునకు వందనశతంబు. ఈ దుఃఖసాగరము నీదుటకు నీస్వరూపపటము నాకు నౌక యైనది. మనహృదయములు రెండును కారాగృహద్వారములు తెఱచికొని యీమనోహరప్రకృతి నంతయుఁ జుట్టివచ్చుచున్నవి. ఇటు నాగలోకమువఱకును, అటు స్వర్గమువఱకును నీహృదయయుగళమున కగమ్యభూమి లేదు. బాహ్యదేహమును బంధించి భీమరాజు పరిహాసపాత్రుఁడై నాఁడు. అంతరంగప్రవృత్తి నెవఁ డాపఁగలఁడు?”

భీమరాజు మహాదేవరాయల ప్రలాపముల నన్నింటిని వినెను. ఆతనికోపము మేరమీఱెను. కటము లదరెను. ప్రళయమూర్తియగు భీమరాజుముఖము సౌదామినికె యసహ్యకరముగ, భయంకరముగ నుండెను. ఉన్మత్తావస్థలో నాగ్రహము నణఁచి భీమరాజు హుంకరించెను. మహాదేవరాయలు కనులువిప్పి సౌదామినీద్వితీయుఁడగుభీమరాజు ముఖమునొకమాఱు తేఱిపాఱఁజూచి ‘ఛీ పాప్రలార! నాఁడు నాఖడ్గపాతమునఁ జచ్చి పిశాచరూపముతో మఱలవచ్చితిరా? ఛీ మీమొగము చూడ’నని తలవంచుకొనెను. సౌదామినికి మహాదేవరాయలు భీమరాజునెడఁ జూపిన తిరస్కారభావము చాల కష్టముగఁ దోఁచెను. ఎటులేని యతనికిఁ బ్రాయశ్చిత్తము జేయవలెనని యామె సంకల్పించెను. సర్వవిధముల మృత్యుముఖమున నుంటినని భావించినిస్పృహావశమున దేహపోషణమే మఱచిన మహాదేవరాయల కీసౌదామినియనుగ్రహముతోఁగాని, భీమరాజునాగ్రహముతోఁగాని యేమివని? ఐనను భీమ

రాజు తనప్రయత్నము మానలేదు. మహాదేవరాయల నంబోధించి యాతఁ డిటులఁ బలికెను. 'మహాదేవా! నీవు సౌభాగ్యవతికి వలపుగల్గించి యామెజీవితము కష్టభాజనము గావించుచున్నాఁడవు. ఆమెకు నీయెడ విరాగము గలిగించితివేని కొంతకాలమేని నీవు బ్రతికియుండఁగలవు. సౌభాగ్యవతి నీయెడ విరాగముగ నుండిన వార్త నాకు స్వల్పకాలములోఁ జేరకున్నచో నీకుఁ గారాగృహముననే మరణము సంభవింపఁగలదు.'

మహాదేవరాయ లీవాక్యములు విని కోపించి "పాపులారా! మీదర్శనము పాపహేతువు. సర్వవిధముల సన్నిహితమృత్యుసంబంధినగు నాకు మీబెదరింపులు లెక్కలోనివి కావు. మీచేతనైనపని చేసికొండు." అని పలికెను. ఇఁక నిట నున్న లాభము లేదు. ప్రతిక్రియ యోజింతము రమ్మని సౌదామిని భీమరాజుహస్తము పట్టుకొని కొలువుచావడిలోనికిఁ జేరెను. కొలువుచావడి చిత్రవిచిత్రములగు రత్నకంబళములతోడను, బంగరునీరుపూసిన యున్నతాసనములతోడను నలంకృతమయి లోచనోత్సవకరముగ నుండెను. సామంతులు, భూస్వాములు, సేనానాయకులు, రాజకీయోద్యోగులు, పండితులు, పౌరులు తత్తదుచితాసనములపై నాసీనులై యుండిరి. భీమరాజును జూడఁగనే సభ్యులందఱొకమాఱె లేచిరి. భీమరాజు కొందఱకు వందనము లొనరించి కొందఱవందనములు పరిగ్రహించి సభ్యులతో నిట్లు విన్నవించెను. "పౌరులారా! సంస్థానహితైషులారా! మీ కందఱకు స్వాగతము." ఇక

మూల గోకర్ణుఁడు జైనమతలోలుఁడై కందూరురాజ్యము ఛిన్నభిన్నముగావించి మనుజులలోఁగల వీరత్వమును, అహింసయను మిషతో రూపుమాపి దేశము నిర్వీర్యము చేయుచున్నాఁడు. కాకతీయుఁడగు రుద్రదేవుఁడు తాను మండలేశ్వరుఁడననియుఁ బన్నొనంగుమనియు సోదరుని నాపైకి సైనికబలముతోఁ బంపినాఁడు. తగిన ప్రతిక్రియ గావించి యతనివిజృంభణ మణఁచితిని. పాలవాసరాజగు కీర్తివర్మ కులశీలములందేకాక .రాజ్యవిస్తృతియందును ధనసమృద్ధియందును గొప్పవాఁడు. అందులకై నాయేకైకపుత్రియగు సౌభాగ్యవతి నతని కొసంగితిచేని కాకతీయులు మనలఁ గన్నెత్తిచూడఁజాలరని యీ పరిణయము దశమినాఁడిట జరుపనెంచితిని. నేను గృహస్థాశ్రమము స్వీకరించి వంశాంకురముఁ బడయుటకై కందూరుయువరాజ్ఞిని దశమినాఁటికిటకుఁ గొనివచ్చెద. ఈశుభపరంపరలు నెరవేరుటకు నామిత్రులెల్లరు శాస్త్రులుః దేవలయును. నగరము లలంకరింపవలయును. కాకతీయు లెత్తిరాకుండఁ దోవ లరికట్టవలయును. కొందఱు కందూరున కేగి శుభముహూర్తమునకు నేను రానుంటినని గోకర్ణునికిఁ దెలిపి వలయుప్రయత్నములు చేయింపవలెను. ఎప్పటికేది యవసరమో యదియెల్లనాయంతరంగకార్యదర్శిని యగు సౌదామిని, మంత్రిముఖమున మీకెఱింగింపఁగలదు. ఆజ్ఞ పాలించిశుభకార్యముల నిర్వహింపవలసిన భారముమీది." సభ్యులెల్ల రంగీకారము దెలిపి రాజుకడ సెలవొంది వెడలి

పోయిరి. మంత్రి సభ్యులవెంట నేగి, తగినకార్యభారము వారి వారికి నియోగించుచునుండెను.

భీమరాజేకాంతముగ నుండ సౌదామిని చెంత నిలిచెను. భీమరాజున కేమియుఁ దోఁచుటలేదు. 'సౌభాగ్యవతి కీర్తివర్మను పెండ్లాడ నియ్యకొనకున్నది. కీర్తివర్మ రాను న్నాఁడు. కందూరున కేగిన గోకర్ణపక్షపాతులవలన నేమి యుపాయము కలుగునో! ప్రజలు గోముఖవ్యాఘ్రములవలెఁ గృత్రిమభావముతో నున్నారు. కర్తవ్య మెద్దియని?' తహతహ పడుచుండెను. సౌదామిని భీమరాజును బరిహాసించి 'రాజా! సౌభాగ్యవతి కీర్తివర్మ నంగీకరింపనిచో మహాదేవరాయల పథింతము. ఈ ప్రతిక్రియతో నామె లొంగును. కందూరులో బలిమిమైఁ బ్రవేశించి, రాజద్రోహుల నణఁకివేయించి వసుంధరను గొనివత్తము. తక్కిన వన్నియుఁ దమంతన చక్కఁబడును. నేఁడు పంచమి. బలములసమకూర్చి తొలుతఁ గందూరు సంస్థానమున కేగి వసుంధరను లోఁబఱచికొనవలయును. కీర్తివర్మకొఱకు నిరీక్షించి యాతనిచేఁ గొన్ని సాహసకార్యములు చేయింపవలయును. నగరరక్షణమున నప్రమత్తులగు భటుల నియోగించి, వీలున్న నేఁటిరాత్రికో, లేకున్న నేఁటివేకువ జాముననో అపరిమితబలసమన్వితులమై కందూరునకు బయలు వెడలవలయు' నని చెప్పెను. ఇంతస్వల్పకాలములో నివి యన్నియు సాధ్యమగునా? యని భీమరాజు పలుక సౌదామిని పకపక నవ్వి మీ రూఱక చూచుచుండుఁడు. నే నన్నియు సమకూర్చెదను, ఎవరురా అక్కడ? ప్రధానమంత్రిని రాజుగార్టు

రమ్మని రని పిలువనంపు మని భటున కాజ్ఞయొసంగెను. భీమరాజు నిర్విచారముగ సమస్తభారములు సౌదామినిపయి మోపి యలసియుంటచేఁ జెంతఁగల తల్పమున విశ్రమించెను.

---

## పదియవ ప్రకరణము.

భీమరాజు కందూరుయువరాజ్ఞిని బెండ్లాడయుండె నను వార్త విన్నంతనె గ్రామము లన్నియు నలంకరింపఁబడెను. వర్ధమానపురమున జరుగు మహోత్సవములకు, వేడుకలకుఁ జూటియు మొదలును లేదు. భీమరాజు కందూరున కనుకొన్నంత త్వరలో బయలుదేరలేకపోయెను. నగరాలంకారము, సమస్త ప్రయత్నములు ముగిసినపిదప నొకశుభముహూర్తమున భీమరాజు సౌదామినీద్వితీయుఁడై మహావైభవముగఁ గందూరు సంస్థానమునకు బయలువెడలెను. కందూరులోని పౌరులు మహోత్సవముతోఁ దన కెదురువచ్చి స్వాగతము నొసంగుదు రనియు గోకర్ణుఁడు, మలయపతి విధిలేక పరిణయమున కంగీకరించి మహోత్సవములు గావింతు రనియు భీమరాజు తలంచెను. ఉచితస్థలములలో విడిదిఁ గావించుచు భీమరాజు కందూరు సంస్థానముచేరువకుఁ బోవఁ దాను సంకల్పించిన వేడుకలు గోచరింపమిచేఁ జాల నిరుత్సాహపడెను.

భీమరాజు సపరివారముగఁ గందూరునగరము చేరునరికి జాముప్రొద్దెక్కెను. నగరము చుట్టును విశాలములగు సత్త్రము,

దాని కానుకొని ప్రాతికోటయుఁ గలదు. కోటతలుపులు మూయఁబడియుండెను. లోనఁ బ్రజ లున్నటుల సందడిగాని ప్రతిఘటింప నున్నట్లుగాని భీమరాజునకు గోచరింపలేదు. తాను వసుంధరను బెండ్లాడరానుంట యెఱిఁగి 'గోకర్ణుఁ డింత యవిధేయుఁడై వర్తింపవలయునా? చూడుము వ్రానిగతి నాలుగుగడియలలోఁ దేలఁగలదు' అని భీమరాజు ఏనుఁగుల వంతెనతోఁ గందకము దాటి కోటతలుపులు ఛేదింప లోహకారుల నియోగించెను. మావటివాండ్రు మదపుటేనుఁగులఁ బురికొల్పి కోటగోడలకుఁ దలల మోటింపఁజేసిరి. సైనికులు త్రాటినిచ్చెనలతోఁ గోడల కెగబ్రాకిరి. ప్రతిఘటించువారు లేకున్నను గోటద్వారములు తెఱచికొని లోనికిఁ బ్రవేశించు వఱకు మిట్టమధ్యాహ్నమయ్యెను. నగరమునఁ బ్రవేశింపఁగనే సైనికులు భీమరాజునాజ్ఞచే విజయభేరి మ్రోగించి లోని కేతెంచిరి. గృహము లన్నియు మూయఁబడియుండెను. వీథులలోఁ బ్రజలు కనుపించుట లేదు. సమస్తమంగళచిహ్నములతోఁ దులతూఁగు కందూరునగరము శ్మశానవాటికవలె నుండెను. పౌరులే కనఁబడరు. కనఁబడినవాఁడు మాటలాడఁడు. నగర మంతయు శోభావిహీనముగ నుంటఁజూచి భీమరాజు తనపరివారముతో నిట్లనెను. "గోకర్ణుఁడు మలయవతి, వసుంధరను వెంటగొని నాసన్నిధికివచ్చి క్షమార్పణముఁ గోరువఱకు నగరవాసులలోఁ గనఁబడినవానిని హింసింపుఁడు. దేవళములు, మఠములు, మందిరములు కూలఁదోచి ధనము ప్రోవుచేసి వర్ధమానపురి కంపుఁడు. కేళీవనముల రూపుమాపుఁడు."

పరివార మంతయు భీమరాజునాజ్ఞ శిరసావహించి నగర వైభవము ధ్వంసముచేయసాగెను. ఆలయములు నేలమట్ట మయ్యెను. పౌరు లెందఱో హింసింపఁబడిరి. కాని యొకఁ డేని పాఱిపోవఁడు. పలవింపఁడు. సంతోషముతోఁ బౌరులు కష్టసష్టముల ననుభవింపఁ దొడంగిరి. భీమరాజు, సౌదా మినియు రాజమందిరము లన్నియు గాలించివేసిరి. జైన విహారములు దర్శించిరి. శిబిరములు, రహస్యగృహములు, భూమందిరములు, ఉపవనములు శోధించిరి. ఆయా స్థలములలో నున్న ప్రజలు, సామాన్య వేషముతో నున్న ప్రజలు భీమరాజును సౌదామినిని జూడఁగనే వేఱుత్రోవను బోవుచుండిరి. భీమ రాజున కిది యంతయుఁ జాలవినువు కలిగించెను. ప్రతిక్రియలేని తనప్రతిఘటనము చాల నిరుత్సాహకర మయ్యెను. నగర మంతయు దోచి సమకూర్చినధన మెప్పటి దప్పుడు వర్ధ మానపురిఁ జేర్పఁ బరివారమునకు భీమరా జాజ్ఞయిచ్చెను. ఈ సందు చూచికొని చిక్కినధనముతో సైనికబల మంతయు నానా ముఖముల వెడలిపోయెను. కడ కసహాయులై సౌదామినియు, భీమరాజును మిగిలిరి. భీమరాజున కాగ్రహము మేరమీఱెను.

కందూరునకుఁ జాలదూరమున నొక జైనాలయము కలదు. చుట్టును విశాలమగు నుపవనము గలదు. భీమరాజు రాజప్రాసాద మెక్కి చూడ నందుఁ గొందఱు మనుజు లున్న టుల గోచరించెను. స్వల్పపరివారముతో నిర్భయముగ భీమ రాజు పాదచారియై యటకుఁ బయనమయ్యెను. సౌదామిని వెంబడించెను. పహాజనుకుమారులగు వీ రిరువురు త్రోవయనక,

డొంకయనక నూటికి నడచి యాలయము చేరిరి. కందూరునఁ గల మనోహరదృశ్యములలో నీయాలయము ప్రథమగణ్యము. అంటుమావిగున్నలక్రింద భిక్షుకులు ధర్మసూత్రములు పఠించుచుండిరి. కన్యలు ననతరువులకు నీరుబోయుచుండిరి. వృద్ధుఁడగు వాగీంద్రుఁడు జైనపరమాత్మునియుపదేశములను బ్రాకృతవాఙ్మయమునుండి పరివర్తన మొనరించి తేటతెలుఁగులోఁ జెప్పుచుండెను. వందలకొలఁది భిక్షుకు లట శ్రద్ధాభక్తులతో నాలించుచుండిరి. ఈ శాంతప్రదేశమునకు భీమరాజు, సౌదామిని సముచితపరివారముతోఁ జేరిరి. భీమరాజు గోకర్ణుని వెదకి, ముందునకు లాగి బంధించెను. తక్షణమె మలయవతిని గొనివచ్చి సౌదామిని బంధించెను. ఈ పుణ్యదంపతుల నిరువురను నిర్దయాస్వాంతులగు భటులు వధ్యపశువుల నీడ్చికొనిపోవునటులఁ గొంపోవుచుండిరి. ఇది చూచి జైనభిక్షుకు లందఱును తిరుగఁబడఁదలంచి దండాదులఁ గొని ముందునకు రాఁజూచిరి. శాంతమూర్తియగు వాగీంద్రుఁడు భిక్షుకులనుసంబోధించి 'సోదరులారా! ప్రపంచధర్మము వదలి జితేంద్రియులై మీరు గడించినవిజ్ఞాన మిదియేనా? చాలును, మీప్రయత్నము వదలుఁడు. అధర్మదేవుఁడగు కలిపురుషుఁడు ధర్మదేవతను హింసించుతఱి నిజమైన భిక్షుకుఁడు చేయవలసినపని సహనము.' అని ప్రేమపరిపన్నమగు స్వరమున సందేశ మొసంగెను. అంతతో నవరోధము తొలంగెను. భిక్షుకులు దైన్యదృష్టులతోఁ జూచుచుండఁగనే బంధితులగు

పుణ్యాదంపతు లావిహారమునుండి బలవంతముగ నెందో కొంపోఁబడిరి.

భీమరాజు గోకర్ణుని, సౌదామిని మలయవతిని, లాగి కొనిపోయి యొకమందిరాంతమునఁ జేర్చిరి. ప్రజలు ద్వారములముం దుండి యాదృశ్యమును సదైన్యముగఁ దిలకించుచుండిరే కాని యొకఁడేని యడ్డుపడలేదు. సౌదామినియు, భీమరాజును ఆదిదంపతులకుఁ దీసిపోని యాపుణ్యదంపతుల నొకగదిలోనికి నెట్టిగొళ్లెము బిగించిరి. భీమరాజుగృహద్వారముపైఁ దెల్లనిలేపనద్రవ్యముతో "మలయవతీగోకర్ణులిట బంధితులై యున్నారు. నీధర్మము నెఱవేర్పుము." అనివ్రాసి, యటఁ గొందఱు భటులఁ గావలియుంచి లోనికిఁ గీర్తివర్మనుదక్క నితరులఁ బోనీయవల దని యాజ్ఞ కొసంగెను. ఎడతెగని ప్రయాణమువలనను, నిరంతరాన్వేషణమువలనను, విసిగి వేసారిన సౌదామినియు, భీమరాజును వినోదార్థ మామందిరమునందలి దర్శనీయభాగములఁ జూచుచు జలయంత్రములకడ విహరించుచుఁ జిత్రపటముల నందర్శించుచు ఆయుధశాలలఁ దిలకించుచునుండ భటు లాహారము స్వర్ణపాత్రములతో నచటకుఁ గొనివచ్చిరి. బడలికగ నుండుటచే భోజనము మాని యిరువురును మద్యముఁద్రావి తాంబూలముల వేసికొని యటనే శయనించిరి. భీమరాజు పరిచారకులను హెచ్చరికగ నుండుడని మందలించి, వసుంధర నన్వేషించి తెచ్చినవానికి బహూకృతిగావింతు నని చాటింపుఁ జేయించెను.

రాత్రి చాలపొద్దుపోయెను. నగర మంతయు నిశ్శబ్దముగ నుండెను. శాంతిమంతముగ నున్న యా ప్రదేశమున నొక ఘూకాంగన యంధకారగర్భమున డాగి. తేప తేపకు వికృతస్వరము గావించుచు నెగురుచుండెను. గబ్బిలములు పటపట తెక్కలాడించుచు నలుగెలంకుల నెగురుచు పాఱసాగెను. దూరమున నెందో యొకచిన్ని దీపము గాలికిఁ గదలుచుండెను. గోకర్ణునకు, మలయవతికి ముం దేమి జరుగనున్నదో, యేల బంధించిరో తెలియదు. సర్వసంగములఁ ద్యజించిన యాదంపతులకు భయవిస్మయములు గూడఁ గలుగలేదు. ద్వారపాలకులు గుఱుకలు పెట్టి నిద్రించిరి. ఇంతదనుక సరససల్లాపములతోఁ బరిహాసప్రసంగములతో నున్న సౌదామినీ భీమరాజు లున్న గదినుండి స్పష్టముగ గుఱుక వినఁబడుచుండెను. ముం దేమి జరుగునో తిలకింతమను నుత్సాహముతో జీమ చిటుకుమన్నను గనిపెట్టుచు మలయవతియు, గోకర్ణుఁడును దిక్కుల నరయుచు నిర్భయముగ నుండిరి.

ఇంతలో గృహద్వారము తెఱువఁబడెను. ఒకవ్యక్తి యడుగులచప్పుడు కానీక నీలవస్త్రము గప్పుకొని లోనఁ బ్రవేశించెను. ఆ వ్యక్తి నలుగెలంకుల దర్శించి దీపఁపువెలుఁగు సాయమున బంధితుల నిరువుర నొకమాఱు తేరచూచి గుర్తుపెట్టుకొనెను. వెంటనే దీపము నార్పి నిశితకరవాలము బయటికిఁ దీసి తొలుత గోకర్ణుని, పిదపమలయవతిని సమీపించి ప్రణామము లొనర్చి బంధనములన్నింటిని ఛేదించెను. దంపతు లాశ్చర్యపడి ముందు జరుగనున్న వింతల నారయ వేడుకపడ

సాగిరి. అపరిచితవ్యక్తి మెల్లఁగ గోకర్ణుని, మలయవతిని లేవదీసి నీలావకుంఠనము లొసంగి గృహబహిర్భాగమునకుఁ గొని వచ్చెను. ద్వారమున నాలుగుమహోన్నతాశ్వములు ప్రయాణమునకు సిద్ధముగ నుండెను. సమపీనోన్నతగాత్రుఁడగు నొక యువకుఁడు దంపతులపాదముల కెఱఁగి యశ్వముల నధిష్ఠింపుఁడని సైఁగఁజేసెను. గుఱ్ఱములపయి మలయవతియు, గోకర్ణుఁడు నెక్కిరి. గుఱ్ఱములు వర్ధమానపురమార్గమునఁ బరువిడసాగెను. ఇంతలో బంధోన్ముక్తులఁ గావించినవ్యక్తియుఁ బ్రయాణము చేయించినవ్యక్తియుగృహాంతర్భాగమునఁ బ్రవేశించి యవశిష్ట కార్యముల ముగించుకొని మిగిలినమహోన్నతాశ్వముల రెంటి నెక్కి తెల్లవాఱునరికి గోకర్ణుని, మలయవతిని వర్ధమానపుర ప్రాంతములలోఁ గలిసికొనిరి. గోకర్ణునియానందమునకు మేరలేదు. మలయవతి సంతోషముతో సుప్పొంగిపోయెను. ఈ యాశ్వికు లెవరో కాదు. ఒకవ్యక్తి వసుంధర, మఱి యొక వ్యక్తి ధర్మసంస్థాపకుఁడగు రుద్రదేవచక్రవర్తి. సంతోషపారవశ్యమునఁ బ్రయాణము మందగించెను. సమయ విదుఁడగు గోకర్ణుఁడు 'మనము తెల్లవారకముందె వర్ధమాన పురమున కేగుదము. తరువాత సంతోష మనుభవింత' మని పల్కెను. అందఱును గుఱ్ఱముల నదలించి తెల్లవారునరికి వర్ధమానపురిఁ జేరిరి. మంత్రులు స్వాగతము నొసంగి మహోత్సవముతో నాశ్వికుల నందఱను ఆనందనిలయమునఁ బ్రవేశ పెట్టిరి. భీమరాజు సపరివారముగ వెనుక వచ్చుచుండె నని భటుఁడొకఁ డెఱింగించెను. ఈ వార్త విని సేనాని పరమానంద

మొంది భటులచే సంస్థానమునకు సంబంధించిన గ్రామము లన్నింటను నిట్లు చాటింపుఁ జేయించెను. "భీమరాజు వసుంధరతో నగరప్రవేశ మొనర్చినాడు. నేఁడె పౌరులు, రాజభక్తులు వర్ధమానపురమునకు వచ్చి పరిణయానందమునఁ బాల్గొనుఁడు."

---

# పదునొకండవ ప్రకరణము

కీర్తివర్మ పాలవాసనుండి వర్ధమానిపురపరిసరములకుఁ జేరువఱకు భీమరాజు కందూరున కేగినట్లు తెలిసెను. వెంటనే కీర్తివర్మ సపరివారముగఁ గందూరునకుఁ బయనమై నవమినాఁడు రాత్రి మూఁడుజాములప్రొద్దు పోవుసరికి కందూరు ప్రాంతముఁ జేరెను. గుప్తముగ నుండి ప్రత్యర్థివ్యూహములు భిన్నముచేయుచున్న సోమనాథునకు "కీర్తివర్మయాగమన వార్త తెలిసెను. వెంటనే సోమనాథుఁడు వేషభాషల మార్చి రాజభటుని వేషముఁ దాల్చి కందూరురాజమందిరములకడ కేగి యట నిదురఁబోవుభటుల నందఱను లేవఁగొట్టి 'యింక నిదురింపరాదు. శత్రునగరమున నిదురింపవచ్చునా ? రాజద్రోహులను గనుఁగలిగి గమనింపవలయు' నని మందలించెను. కొందఱు భటుల నొకచో సమావేశపఱచి 'కీర్తివర్మ భీమరాజునకు అల్లుఁడు గానున్నాఁడు. ఆయన కందూరుసంస్థానమునకుఁ గూడ ముందధీశ్వరుఁడు కాఁగలఁడు. ఎదుర్కొని సముచిత

గతి రాజమందిరమున విడిది గావింపుఁడు. కందూరురాజ్య వైభవ మొకమాఱు తిలకించి తెల్లవారఁగనే పరిణయమునకు వర్ధమానపురి కేఁగవలసియున్నది. మార్గమున వలయు సంభారముల సమకూర్చి సగౌరవముగ పిడ్కొలువ వలసియున్నది.' అని సోమనాథుఁడు చెప్పఁగ నందఱును నిరూపిత కార్యము లొనరింప నెవరితోవను వారు వెడలిరి.

సోమథునకు మలయవతీగోకర్ణులు, వసుంధరారుద్రదేవులు సురక్షితముగ వర్ధమానపురికిఁ జేరగల రను నమ్మకము గలిగెను. వెంటనే యతఁ డొక మందిరముఁ బ్రవేశించెను. భీమరాజు ద్వారముపయి లిఖించిన మలయవతీగోకర్ణులిట బంధితులై యున్నారు. నీధర్మము నెఱవేర్పుము" అను వర్ణములు తుడిచివేసెను. అక్షరస్వరూపము దెలియకుండుటకై పైని సున్నమునీరు చల్లెను. అచటికిఁ జేరువలోఁ గల యొక విలాసమందిరమున భీమరాజు, సౌదామిని నిదురించుచుండిరి. సోమనాథుఁ డటకుఁ బోయి ద్వారముపయి "మలయవతీ గోకర్ణు లిట బంధింపఁబడియున్నారు. నీధర్మము నెరవేర్పుము" అని లిఖించెను. 'కీర్తివర్మ బలవంతుఁడుగాన నాతనిచే గోకర్ణుని, మలయవతిని జంపించి భీమరాజు తాను నిర్దోషి నని లోకమును వంచించుటకుఁ జేసిన మోసమునకీ ప్రతిఫలము చాలును. నే నిఁక నాలసింపక యెదురేగి కీర్తివర్మ నీమందిరమునకుఁ గొనిరావలసియున్నదని యటనుండి సోమనాథుఁడు నగరద్వారము చేరఁబోయెను.

కీర్తివర్మ ముప్పదియేండ్లవాఁడు. దివ్యాభరణభూషితుఁడగుటచే నతఁడు కొంతవఱకు సుందరమూర్తియనియె చెప్పవచ్చును. అతఁడు ద్వారముసమీపమున సపరివారముగ నిలిచి లోనుండిరానున్న గౌరవాహ్వానముకొఱకు నిరీక్షించుచుండెను. ఇంతలో భటవేషధారియగు సోమనాథుఁడు ద్వారము తెఱచి బయటికి వచ్చి పరివారముచే సక్రమముగ నాతిథ్యము జరిపించెను. సోమనాథుఁ డెదురేగి కీర్తివర్మ కుచితసత్కారముల నొనరించి "తాము విశ్రాంతిఁ గైకొనుటకు భీమరాజొక మందిరరాజము నలంకరించి మిమ్మందుఁ జేర్ప నాజ్ఞయొసంగెను. అందు విశ్రాంతిఁగైకొని యావల వర్ధమానపురమున కేగ వచ్చును. దయచేయుం" డని పరివారమునకుఁ గీర్తివర్మకు వేఱువేఱు విడుదులఁ జూపెను. కీర్తివర్మ మందిరమునఁ బ్రవేశించి నలుగెలంకులఁ బరిశీలింప నొకచో సోమనాథునివాత్ర ద్వారముపయి గోచరించెను. భీమరాజు తన్ను సాయము గోరి నది గోకర్ణుని, వసుంధరను గడతేర్చుటకు. కీర్తివర్మ యాకాలమునఁ గల రాజులలో బలవంతుఁడు. భీమరాజు కీర్తివర్మకు అల్లుఁడు కానున్నాఁడు. ఈ స్థితిలోఁ గీర్తివర్మ యేపని జేసిన గందూరువారు లడ్డుపడఁగలరు? అదిగాక కందూరులో నేఁడు గోకర్ణుని మహాప్రయత్నముచేఁ బ్రతిక్రియాశూన్యమగు నహింసాసిద్ధాంత మాచరణలో నుండెను. కీర్తివర్మ పరిణయోత్సాహపరవశుఁడై కరవాలము గొని ముందడుగు వేసెను. గోకర్ణుని, మలయవతిని గడతేర్చినమాత్రమునఁ దనకు లాభముండదనియు, ఏమాయోపాయముతోనైన మలయవతీగోక

ర్ణులయంకతలమునన్న వసుంధరను గడతేర్చినచోఁ గందూరు సంస్థానము తనకు వెంటనే స్వాధీనముకాఁగలదనియు తలంచి వసుంధరకై కొంచెము వెదకెను. ఆమెపొలకువ దెలియక పోయెను. పరిజనులలో నెవరు భీమరాజపక్షమువారో, ఎవరు గోకర్ణునిపక్షమువారో తెలియమిచేఁ గీర్తివర్మ యెవరినేని వసుంధరవృత్తాంత మడుగ వీలుగాక పోయెను. ఒకవేళ భీమరాజు కందూరునుండి వర్ధమానపురికి వివాహార్థము గొంపోయెనేమోయనితలంచెను. పోయిన వర్ధమానపురికిఁబోవలెను. ఇంక నెటకేగియుండును? ఒకవేళభీమరాజేయామెను గృత్రిమోపాయములతోఁ గడతేర్చియుండునా? యని క్షణము యోజించెను. పరిణయమిషతోఁ గందూరువచ్చిన భీమరాజె వసుంధరను దుదముట్టించుటయసంభవము. ఎటులైనమంచిదె. వసుంధరనుమిగులనీయరాదు. భీమరాజామెను బెండ్లాడినను వర్ధమానపుర కందూరుసంస్థానములు నాకుస్వాధీనములుకావు. పైఁగనాంధ్ర సామ్రాజ్యపతియగు రుద్రదేవునితో లేనిపోనివిరోధము వచ్చును. కానిమ్ము, ముందు భీమరాజు లిఖించినవర్ణముల ననుసరించి కర్తవ్య మొనరించెద నని కీర్తివర్మ ముందున్నద్వారము తెఱచెను. లోన నిరువురు వ్యక్తులు బంధింపఁబడియుండిరి. దూరముననున్న నాముదపుదీపము మినుకుమని వెలుఁగుచుండ నావెలుఁగులో గృహభాగము నొకమాఱు తేరిచూచెను. గబ్బిలములు ఱెక్కలు టపటపలాడించుచు నిటునటు నెగురుచుండ నందెవరో సందడి చేయుచుండిరని కీర్తివర్మ భావించి మ్రాన్పడి నిలిచెను. కొంతసేపటి కొకగబ్బిలము దీపపు

జేరువనుండి ఱెక్కలు పటపటలాడించి యెగురుటచే గాలికి దీప మారిపోయెను. గృహభాగ మంధకారబంధుర మయ్యెను. గృహభాగమె కాదు, హృదయముగూడ నంధకారావృతముగ నుండెను. పరివారమును గలిసికొని కరదీపిక తెప్పించుకొనఁ దలంచెఁగాని, యాలస్య మెంతేని కార్యభంగము గావించు నని హత్యానిర్వాహణమునకు సిద్ధపడెను.

ఆశోపహతుఁడనై హత్యకుఁ బాల్పడుచుంటినే యని తొలుతఁ గీర్తివర్మ శంకించెను. అంతరాత్మ యకృత్యమున కియ్యకొనకు మని బోధించెను. దురాశ యతనిహృదయమున రాజ్యము చేయుచుంటచేఁ బాపభీతి తొలంగెను. భూతదయ, సర్వసమత్వము, అహింసాధర్మము నెఱుంగని కీర్తివర్మ - పాపమునకు జంకని ఆ కీర్తివర్మ - సాహసముతోఁ గరవాలము జళిపించి యా యంధకారమున, తన యపకీర్తికిఁ దీసిపోని యా యంధకారమునఁ జెంత నిదురించుచున్న యిద్దఱువ్యక్తులను ఖండించెను.

ఆ ఘోరహత్యఁ గావించుటచే హృదయము చాలసేపు స్తబ్దమయ్యెను. కనులకు సహజమగు నవలోకనశక్తి నశించెను. పాపోన్ముఖమగు నాతనిహృదయము చాలసేపటికిఁ బూర్వస్థితికి వచ్చెను. కీర్తివర్మకుఁ గ్రమముగ నావశ్యక ధర్మము బోధపడెను. దూరమునుండి కొక్కొరో కో యని కోడి కూసెను. తెల్లవారునరికి కిటనుండి నిర్గమింపకున్న రహస్యము బహిర్గత మగునని కీర్తివర్మ వధింపఁబడిన రెండు వ్యక్తుల శిరములు చెండి కొనివచ్చి, ద్వారమందున్న యొక

పెట్టెలోఁ బడవేసి, ద్వారమును బంధించి, భటులతో రాజ మందిరము జాగరూకతతోఁ గాచియుండుఁ డని బోధించి, యొక భటునిచే ఖండితశిరోయుగళాలంకృతమగు పేటిక మోయించికొని, ద్వారము దాటి వెడలిపోయెను. ఇంతలో సోమనాథకవి వర్ధమానపురసైనికులతో 'అదిగో భీమరాజు తననగరి కేగుచున్నాఁడు, వెంబడింపుఁ'డని హెచ్చరించెను. ద్వారమును గాచియున్న వర్ధమానపురసైన్యము, స్వసైన్యము జయవాక్యములు పలుకుచుండఁ గీర్తివర్మ పరిణయోత్సాహముతో వర్ధమానపురాభిముఖుఁడై బయలువెడలి ముందుఁ గొంద అశ్వికులను దనరాకఁ దెలుపఁబంచెను. కొలఁదిసేపటికి వర్ధమానపురసమీపమునకుఁ గీర్తివర్మ దఱిసి శుభరూపమగు పరిణయాహ్వానమునకొఱకు వటచ్ఛాయను విశ్రమించుటకు జాముప్రొద్దుకంటె నెక్కుడెక్కి యుండెను. తరుణభాస్కరకిరణప్రసారముచే నా వటవృక్ష మలంకృతమై నయనానందకరముగ నుండెను. కీర్తివర్మ వృక్షమూలమునఁ బఱుపఁబడిన యొక రత్నకంబళముపై నాసీనుఁడై క్రీడావినోదములతోఁ గాలక్షేపముఁ జేయుచుండెను. ఈ కాలక్షేపకృత్యములచే దారుణహత్యాజనితమగు నాందోళనము హృదయము నంతగా బాధించుటలేదు.

కొంతసేపటికిఁ గొందఱు సైనికులు, సేనానాయకులు, బ్రాహ్మణులు మంగళవాద్యములతోఁ గీర్తివర్మ నెదుర్కొని సగౌరవంబుగ వర్ధమానపురమునకుఁ దోడ్కొనివచ్చి యానంద నిలయమున విడిది యొసంగి మంగళప్రయత్నములలో నుండుఁ

డనియు శుభముహూర్తమున నాహ్వానముఁ జేయుదుమనియు విన్నవించి వెనుకకు మరలి యేగిరి. కీర్తివర్మ వినోదార్థము నిలయమునఁ జరించుచు సహజవిలాసభాసురముగఁ జిత్రింపఁ బడియున్న భీమరాజుసౌదామినుల చిత్తరువులు, శృంగారరస ప్రచురణములగు గోపికాక్రీడనములుగల చిత్తరువులు దర్శించి సౌభాగ్యవతీసందర్శనోత్సాహము నడంచుకొనుచు శుభ ముహూర్త మెంత విరామమో యనుచు, నిముసములు యుగ ములుగ లెక్కించుచు నుండెను. ఉద్వేగాతిశయము, స్వప్రయో జకత్వప్రదర్శనోత్సాహము పెనఁగొని భీమరాజును సంద ర్శింపవలయుననియు సౌదామినితో భాషింపవలయుననియు నాతని బ్రేరేచెను. సమయార్థియగుచుఁ గీర్తివర్మ తన యుద్రే కాతిశయ ముపశమింపఁజేయ సౌభాగ్యవతిచిత్తరువు సమయా నుసారముగ సందర్శించుచు నుండెను. ఆనందనిలయమున వివాహమండప మమర్పఁబడెననియు, మీరాకయే యాలస్య మనియు సోమనాథుఁడు వచ్చి కీర్తివర్మకు నివేదించెను. సోమనాథునకుఁ గీర్తివర్మకుఁ గందూరురాజ్యసమీపమున సమావేశమయ్యెఁ గావఁ గీర్తివర్మ పూర్వపరిచయమును బురస్కరించి సోమనాథునితోఁ జనవుగ భాషించుచు స్వోత్కృ ర్షోద్బోధకములగు ప్రసంగములతోఁ గాలముఁ గడుపుచుండ వాహకులు చతురంతయానముఁ గొనివచ్చి ద్వారమున నుండి తీవరింపసాగిరి.

అంతలో బ్రాహ్మణుఁ డేతెంచి తాము కొనితెచ్చిన విజయచిహ్నములతో—దయచేయుఁడని రాజన్యుఁడు సెల

విచ్చియున్నాఁడని విన్నవించి లగ్నము దాటిపోవుచున్నది. త్వరపడుఁడని, తొందరింపసాగెను. కీర్తివర్మ విరామము చేయ నదనుగాదని ఋతుయోచితములు పరిణయకాలానుగుణములగు నలంకారములు వివిధవస్త్రములు ధరించి కరవాలముఁ దాల్చి తన యాకృతివిశేషములు దర్పణమున సందర్శించి కొఱఁతలు సవరించుకొని శిబిక నలంకరించెను. ఒక భటుఁడు పేటికను గొనివచ్చి యా పల్యంకికలో నుంచెను. సోమనాథుఁడు వెంటనంటి యేదియో భాషించుచుండ వాహకులు పల్యంకిక వహించి తూర్యధ్వానములు దెసల మాఱుమ్రోయ గ్రామప్రదక్షిణముఁ జేయించుచు రాజవీథులనుండి యానంద నిలయమునకుఁ బల్యంకికఁ జేర్చిరి. కీర్తివర్మ పల్యంకిక దిగి సోమనాథునిఁ గైకొని భటునిచేఁ బేటికఁ బట్టించుకొని మరకతతోరణాలంకృతము, ముక్తాఫలరంగవల్లికావేల్లిత మగు విలాసమందిరమునఁ బ్రవేశించెను. సౌభాగ్యవతిప్రతిచ్ఛంద మొకటి యానందనిలయమున నలంకరింపఁబడియుండెను. కీర్తివర్మ యా మంగళరూపముఁ దిలకించుచు వర్ధమానపుర రాజ్యమును భీమరాజు కన్యాదానసమయమున ధారపోయు ననియుఁ గందూరు రాజ్యము వశంవదమైనదనియుఁ బొలవాసదేశము తా నార్జింపనున్న రాజ్యద్వయసంయోగముచే శత్రుజనాభేద్యము కాఁగలదనియు నాంధ్రసామ్రాజ్యాధీశు నిఁక వంచింపవచ్చుననియుఁ గోరికలపైఁ గోరికలఁ బన్నుచు నొక మణిమయాసనమున నాసీనుఁడై యుండెను.

---

# పండ్రెండవ ప్రకరణము.

వర్ధమానపురమును భీమరాజు, సైన్యముతో వదలి, కందూరు రాజ్యమున కేగుచుఁ బురము నంతయు నలంకరింపుఁ డనియు సౌభాగ్యవతిని కీర్తివర్మ కొసంగి వివాహము జరుపఁబడుననియుఁ జాటించెను. సమీపగ్రామము లన్నింటినుండి యనేకులు వచ్చిరి. రాజకీయాధికారులు కారాగారమున నున్న సౌభాగ్యవతి నంతఃపురమునఁ జేర్చి భీమరాజొసంగిన యాజ్ఞ ననుసరించి తామును, దమ సతులు, పరిజనము గలిసి కీర్తివర్మను వివాహముఁ జేసికొమ్మని బోధించిరి. మహాదేవరాయలయుం దనేకలోపము లారోపించి యా సంబంధము మానికొమ్మని బతిమాలిరి. సౌభాగ్యవతి వారి ప్రశ్నలలో దేనికిని బ్రత్యుత్తర మీయక యూరకుండెను. పరిణయార్హములగు నలంకరణములఁ దెచ్చి యొసంగ నాయమ కైసేసికొన మానికొనెను. కారాగారమున ధరించిన జీర్ణపరిధానము, చిక్కుపడిన కేశములు, విచారాతిశయముచే వాడిన మొగము, ఆయమ సౌందర్యమునకు నూతనశోభను గడించుచుండెను. గృహమునం దంతటను బరిణయప్రయత్నములు జరుగుచుండెను.

సోమనాథుఁడు సౌభాగ్యవతిని సమీపించి 'అమ్మా! కళ్యాణమండప మలంకృతమై యున్నది. సామంతులు, ప్రభుత్వోద్యోగులు కళ్యాణవేదిక నలంకరించిరి. కీర్తివర్మ ముఖమండపమున వివాహదీక్షోచితమగు వేషముఁ దాల్చి శుభనిమి

పముకొఱకు నిరీక్షించుచున్నాఁడు. అలంకరణములు ధరింపుము. కీర్తివర్మ ననుగ్రహింపుము. పితృశాగవము కాపాడుము. పరిణయవేదికను గటాక్షింపు' మని పలుమాఱు తెలిపెను. సౌభాగ్యవతి యావచనము లాలకించి సోమనాథునితో 'మహాదేవరాయలఁ దప్ప నితరుల వరింపను. కీర్తివర్మ ఖడ్గమునకు నాకంఠము నొసంగుదునుగాని సూత్రమున కొసంగను. ఎంతవఱకు నన్నుఁ గీర్తివర్మకు భార్యనుగా మీరు గ్రహింతురో యంతవఱకు నేను నిర్బంధము క్తనుగాఁ గాన వచ్చినను గారాగారనివాసినినే' యని శిరము వ్రాల్చెను. ఆ యామె విశాలనయనములనుండి వేఁడివేఁడి యశ్రుబిందువులు రాలెను. విచారాతిశయమున ముగ్ధురాలై యున్న సౌభాగ్యవతిని దోఁడి పరిచారికలు కళ్యాణమండపమునకుఁ గేలూఁత యొసంగి కొనిపోయిరి. మండపముననున్న పీఠములపై ననేకులాసీనులై యుండిరి. సౌభాగ్యవతి వారి నెవ్వరినిఁ దిలకింపలేదు. జీరాడుపైఁటతో, జాఱిన పెన్నెరితో వ్రాల్చిన తల యెత్తక పాదము లీడ్చుచు వివాహమండపమున కాయమ చేరెను. వివాహదివస మగుటచే నాఁడు మహాదేవరాయలను బంధనమునుండి తొలఁగించిరి. ఉపవాసవ్రతములతో నిర్బంధావాసశ్రమతో నాతనియారోగ్యము నశించెను. శూన్యమగు తన జీవితమున నీ కళ్యాణమును సందర్శించు భాగ్యము కలుగునని మహాదేవరాయ లెన్నఁడును తలంచి యుండలేదు. మహాదేవరాయలు పరిణయమండపముఁ జేరి యొక పీఠముపై నాసీనుఁడై సౌభాగ్యవతివదనముపైఁ దనదృష్టిని నిలుపగా

లగు చూపులను బ్రసరింపఁజేయుచుండెను. మహాదేవరాయలు మండపముననున్న జనుల నెవ్వరిని గనులెత్తి చూడక, సౌభాగ్యవతినిమాత్రము సందర్శించుచుండెను. అంధకారబంధురమగునైహికమున మహాదేవరాయలదృష్టి కొక సౌభాగ్యవతి మాత్రమె కానవచ్చుచుండెను.

దూరమున నింకొక పరిణయమండప మలంకరింపఁబడియుండెను. అచట వసుంధరకు, భీమరాజునకుఁ బరిణయము జరుగునని మండపపీఠముల నాసీనులైనవా రందఱుఁ దలంచుచుండిరి. కొంతకాలమునకు సాలంకృతయగు వసుంధరను, బరిచారిక లాపరిణయమండపమునకుఁ జేర్చిరి. గోకర్ణుఁడు, మలయవతి, కళ్యాణమండపమునకుఁ జేరిరి. మంగళారావములు మ్రోయుచుండెను. భీమరా జింకవచ్చు, నింకవచ్చును పరిణయమున కాయన యలంకృతుఁడై వచ్చుటయే తడవని ప్రేక్షకు లందఱు నిరీక్షింపసాగిరి. అంతలోఁ గీర్తివర్మ భటునిచే నొక పేటికఁ బట్టించుకొని పరిణయమండపములోనికిఁ జేరెను. మండపములో నున్న సింహాసనముపై నాసీనులై యున్న గోకర్ణుని, మలయవతిని గీర్తివర్మకుఁ జూపించి వార లిరువురే సౌదామినీభీమరాజులని సోమనాథుఁడు రహస్యముగ నెఱింగించెను. కీర్తివర్మ సత్వరముగ గోకర్ణుని, మలయవతిని సమీపించి పాదములపైఁబడి ప్రణామమొనరించి 'రాజ్ఞీ! రాజేంద్రా! సౌభాగ్యవతిపరిణయమునకుఁ దాము విధించిన శుల్కము గొనివచ్చితిని. పరిగ్రహింపుఁ'డని పేటికను దెఱచెను. పీఠముల నలంకరించిన రాజులు సామంతులు భటులు, కీర్తి

వర్మ తెచ్చిన శుల్కములు పరిశీలింపవలయు నని చుట్టును మూఁకగాఁ జేరి ప్రతీక్షించిరి. భీమరాజు, సౌదామిని యట నాసీనులై యున్నది, లేనిదిగూడ సౌభాగ్యవతి సందర్శింపలేదు. ఆ సందడిఁగూడ నామె గమనింపలేదు. మహాదేవరాయ లా సమ్మర్దమును బరిశీలించుటకంటె సౌభాగ్యవతిని సందర్శించి కృతార్థుఁ డగుట ముఖ్యమని కనులఁ దనివిదీఱఁ జూచు చుండెను. అనురాగప్రపంచమున మునిఁగియున్న వారికాకీర్తివర్మ గోచరించుట లేదు. ప్రపంచమునే వారలు మఱచిరి.

కీర్తివర్మ పేటిక తెఱచి 'భీమరాజా! సౌదామినీ! మీ యనుజ్ఞ శిరసావహించి నాశక్తి ధారవోసి శుల్కముగ కళ్యాణమండపము సలంకరింపఁ బ్రతిపక్షులశిరములఁ గొని వచ్చితిని. పరిగ్రహింపుఁ' డని రెండు శిరోభాగములఁ దీసి గోకర్ణ మలయవతుల సమీపమున నుంచి నిలువఁబడెను. గోకర్ణున కంతయు విస్మయముగ నుండెను. మలయవతి విభ్రాంతురాలై సందర్శింపసాగెను. ఆ ఖండితశిరము లెవరి వెవరివను కలకల మా సభామండపమునం దంతట నెగఁ బ్రాకెను. గోకర్ణుఁడు, మలయవతి యా శిరోభాగములఁ గొని హా భీమరాజా! హా సౌదామినీ! గోముఖవ్యాఘ్రమగు కీర్తి వర్మచే వధింపఁబడితిరా? ఎంత దారుణహత్యకు లోనైతిరి? ఎట్టి దుర్దశకుఁ బాలుపడితిరి? 'అని విలపించిరి. పరిణయము దర్శింప వచ్చిన జనసమూహ మంతయు హాహాకారములు చేసెను. సౌభాగ్యవతి కోలాహలము నాలించి యటకుఁ జేరెను. భీమరాజుయొక్కయు, సౌదామినియొక్కయు,

శిరోభాగము లట దర్శించి విచారక్రోధపరవశమున వలువలో నిమిడియున్న కరవాలమును బెటికి సౌభాగ్యవతి కళ్యాణ మండపమునుండి మెల్లఁగ దాటిపోవుచున్న కీర్తివర్మ కంఠముపై విసరికొట్టెను. ఖడ్గహతిచేఁ గీర్తివర్మకంఠ మెగిరి గోకర్ణునిపాద పీఠము చెంతఁబడెను. జను లందఱు విస్మయపరవశులై కీర్తివర్మ శిర మిట ఖండితమై యెట్లు పడఁగలిగెనని యుత్సాహ ముతో, విచారముతో, నాగ్రహముతోఁ దిలకింపఁ దొడంగిరి. సభ కలకలముతో నిండిపోయెను.

సభామందిరమున నలజడి మెండయ్యెను. పౌల వానమండలేశ్వరునిభటు లందఱు వీరావేశపూరితులై యట్ట హాసములు చేయుచు హంతకుఁ డేడి? కీర్తివర్మను ఖండించిన దురాశయుఁ డేడి? చీల్చెదము. కండలు గ్రద్దలకు వేయుద మ్మనుచు మండపములోనికిఁ బ్రవేశించిరి. ఆంధ్రసామ్రాజ్య సైనికులు వారలఁ బ్రతిఘటించిరి. ఆ సమయమున వివిధా లంకారములతోఁ బరిణయ వేషముతో నున్న ఆంధ్ర సామ్రాజ్యాధీశ్వరుఁడగు రుద్రదేవచక్రవర్తి పరిణయమండ పమున సైన్యముతోఁ బ్రవేశించి 'మిత్రులారా! ఆర్యులారా! శాంతింపుఁడు, శాంతింపుఁడు. గతమునకు వగచి తొందర పడకుఁడు. అధర్మసంరంభమును మన మందఱము సమాన ముగ విజృంభించి చల్లార్చెదము. క్షణము శాంతింపుఁడు, క్షణము శాంతింపుఁ' డని స్ఫుటముగ వాకొనెను. కొంతసేపటికి సభ యంతయు నిస్తరంగనీరాకరమువలె శాంతిముద్ర

వహించెను. అంతలో సంన్యాసిని యామందిరమధ్యమున నిలిచి తంబురా మీటుచు నిటులఁ బాడెను.

"శాకతిరాజ్యచక్రముఁ ద్రిప్పుచున్న
శ్రీరుద్రదేవధాత్రీశలాఘనుఁడు
నిత్యసత్యవ్రతనిశ్చలాత్మకుఁడు
ధర్మసంరక్షణార్థము కత్తిఁ గట్టెఁ
బరసతీరతుఁడు దుర్వ్యాపారయుతుఁడు
భీమరాజు వసించెఁ జెరసాలయమున
సౌదామినియు యమసదనంబుఁ జేరె
గోకర్ణుసత్యసంకులధర్మనిష్ఠ
మలయవతీదయమానభావంబు
శ్రీవసుంధరకృపార్ద్రీభూతబుద్ధి
సౌభాగ్యవతిసదాచారసంపత్తి
మహాదేవరాయధర్మప్రచారంబు
వాగీంద్రనిరాజ్యవాత్సల్యభరము
విజయంబుఁ జేకూర్చె విలపింపవలదు
విలపింపవలదు దోర్వీర్యాఢ్యులార!"

సంన్యాసినిమధురగీతము విని నంతనె సభ్యు లందఱు విచారమును దొలంగి విరాగము వహించిరి. అంతలో వాగీంద్రుఁడు మూర్తీభవించినశాంతమువలె నా కళ్యాణమండపముఁ జేరి యట నిలిచెను. రుద్రదేవచక్రవర్తి, గోకర్ణుఁడు, మలయవతి, సౌభాగ్యవతి, సంన్యాసిని, మహాదేవరాయలు, సోమనాథుఁడు వరుసగ వాగీంద్రచూడామణికి నమస్కరించిరి.

రుద్రదేవచక్రవర్తి వాగీంద్రునిముందు వినయవినమితాంగుఁడై నిలిచి 'యోగీంద్రా! భీమరాజు సౌదామినీద్వితీయుఁడై కందూరురాజ్యముపైకి విజృంభించి వసుంధరను బలిమిమైఁ గొననిశ్చయించి మలయవతిని, గోకర్ణుని గారాగారమున బంధించెను. నా పరిజనుఁడు వారల విడచి పుచ్చెను. కందూరు రాజ్యమున నున్నచో నింక వీరి కేగతి కలుగునో యని వసుంధరను, మలయవతిని వెంటఁగొని గోకర్ణుని నే నిటకుఁ జేర్చితిని. పరిణయమండపములచెంత యథావిధి జరుగు విధానములకు నే నెట్టి యాటంకముఁ గలిగింపక యొకమందిరమున విశ్రమించితిని. కీర్తివర్మ ప్రమాదమున గోకర్ణుని, వసుంధరను ఖండించి శిరములుగొని భీమరాజుసౌదామినులసమక్షములోఁ జేర్పనిశ్చయింప నీవిపరీతపరిణామము జరిగెను. కీర్తివర్మను, పితృశోకపరితప్తురాలగు సౌభాగ్యవతి ఖండించెను. విషయ మిది. ఈ వధకథ మహామహులగుతమకు విన్నవించితిని. దోషము నెఱింగి శిక్షింపుఁడు. కర్తవ్యము నిర్ణయింపుఁ' డని వాకొనెను.

వాగీంద్రుఁడు చాలసేపు యోజించెను. శిక్షాస్మృతి యంతయు జ్ఞాపకమునకుఁ దెచ్చికొనెను. ప్రత్యేకముగ నందఱి గుణదోషములు జాగరూకతతోఁ దెలిసికొనెను. సౌభాగ్యవతి, కీర్తివర్మకంఠరక్తముచేఁ బంకిలమైన కరవాలమును, ఛిన్నహస్తమును గొని వాగీంద్రునిపాదపద్మములచెంత నుంచి నిలిచెను. గోకర్ణుఁడు, సౌభాగ్యవతి భీమరాజు పుత్రియని విన్నవించుచు న్యాయవిజ్ఞప్తిగ్రంథమును జతగింపుఁ డని వాగీంద్రుని వేఁడుకొనెను. వాగీంద్రుఁ డాహా త్తమఁ సాదర

ముతోఁ బరిశీలించి, 'రుద్రదేవరాజా! ఇఁక నా యభిప్రాయము జెప్పవచ్చునా? నాయాజ్ఞఁ బాటింతురేని నిశ్చితాంశమును విన్నవింతు' నని వాఁ డని ప్రత్యుత్తరార్థియై నిలిచియుండెను. చక్రవర్తి సభ్యుల నందఱను సందర్శించి యిట్లనెను. "వాగీంద్రుఁడు ధర్మజ్ఞుఁడు, సర్వశాస్త్రపారంగతుఁడు; పెద్దకాలము నుండి వర్ధమానపుర, కందూరు సంస్థానములు తిలకించుచున్నాఁడు. నేఁ డొక వికల్పము జరిగినది. హత్యాకారకుఁడగు కీర్తివర్మను సౌభాగ్యవతి వధించెను. కందూరురాజ్య వర్ధమానపురరాజ్యములు రాజశూన్యము లైనవి. ఈ యుభయ రాజ్యముల వదలి గోకర్ణుఁడు, మలయవతియు శారదా పీఠమున కేగనున్నారు. బంధవిముక్తుఁడగు మహాదేవరాయలతో నేను నా సామ్రాజ్యమున కేగనున్నాను. మన యందఱి క్షేమమును యోజించి వాగీంద్రచూడామణి మనమన కర్తవ్యములు, ప్రమాదములకుఁ బ్రతిఫలములు, నిరూపింపనున్నాఁడు. నే నన్నింటిని శిరసావహించి యంగీకరింపనున్నాఁడను. మీ రంద ఱంగీకరింతురేని యాజ్ఞనీయ సిద్ధముగా నున్నాఁడు. వాగీంద్రచూడామణియుద్బోధము మీ యందఱ కంగీకృతమా?" వివాహమండపము ప్రతిధ్వనించునటుల నంగీకృతమను ప్రజాఘోషము బయలువెడలెను. వాగీంద్రుఁడు మందిరమందున్న యున్నతపీఠముపై నాసీనుఁడై యాంధ్ర సామ్రాజ్యమునకుఁ, గందూరురాజ్యమునకు, వర్ధమానపుర రాజ్యమునకు సంబంధించిన సేనానాయకులఁ జూచి 'మీ రంద ఱైకమత్యముతో మెలఁగుఁడు. స్వల్పకాలములో

నాంధ్రసామ్రాజ్యచ్ఛత్రముక్రిందఁ గందూరువర్ధమానపుర సంస్థానములకు శుభక్షేమాభిరామములగు నియమములఁ బ్రకటింప నున్నాఁడ' నని వాకొనెను. సైనికులు సేనానాయకు లానందముతోఁ బర్యవసానశ్రవణమునకు వేచి యుండిరి. పౌలవానసైన్యము చేయునదిలేక ఒకవంక నాంధ్రసామ్రాజ్యసైన్యము, ఇంకొకవైపు కందూరు వర్ధమానపుర సైన్యములు తమ్మావరించికొనియుంట గమనించి యెటకుఁ బోవ వీలుగాక యటనే నిలువఁబడిపోయెను. ఇంతలో రుద్రసేనాని వచ్చి పౌలవాన సర్వసేనానాయకుని రుద్రదేవుని పాదములముందుఁ బడవైచి పౌలవానసైన్య మంతయు నాంధ్రసామ్రాజ్యసైన్యములోఁ గలుపుకొనఁ బ్రార్థించెను. రుద్రదేవుఁడు కోఁగంటిచూపులతో నంగీకృతి వెల్లడించెను.



# పదుమూఁడవ ప్రకరణము.

వాగీంద్రుఁడు రుద్రదేవచక్రవర్తిని జూచి 'రాజవత్సా! నీహృదయము ప్రేమపరిపన్నమైనది. వసుంధర నిన్ను రక్షింపుమని కోరినది. విజ్ఞప్తిఁ బాలించితివి. రక్షితవస్తువు రాజునకుఁ జెందుట యాచారము. నీహృదయము నాకర్షించిన యీ ప్రణయమూర్తిని సశాస్త్రీయముగఁ బరిణయముఁ జేసికొని యాంధ్రసామ్రాజ్యపతాకముక్రిందఁ గందూరు రాజ్యము చల్లఁగ వర్ధిల ననుగ్రహింపుము.' అని వసుంధరాహస్తము రుద్రదేవచక్రవర్తి కొసంగి యిరువురి నాశీర్వదించెను. సభ్యులు జయజయనినాదము లొనర్చిరి.

వాగీంద్రుఁడు మహాదేవరాయలఁ బిల్చి 'ఓయీ! నీవు చక్రవర్తియానఁ దిరస్కరించినందులకుఁ బ్రతిఫలముగ శిక్ష ననుభవించితివి. సేనాసాహాయ్యముతో నేగిన నీవు విరోధిమందిరమున నేకాంతముగ వసించుట రాజనీతికి విరుద్ధము. కావున నాంధ్రసామ్రాజ్యనాయకుఁ డగు మీయన్నగారి చరణములపై వ్రాలి క్షమార్పణము వేఁడికొ'మ్మనెను. మహాదేవరాయలు భక్తిపూర్వకముగ నగ్రజాతునిచరణములపై వ్రాలి క్షమింపు మని వేఁడికొనెను. చక్రవర్తి సోదరుని కౌఁగిలించుకొని 'పరమేశ్వరునియనుగ్రహముచే నిన్నుఁ గనఁగల్గి ధన్యుఁడనైతి'నని యానందబాష్పములచే నాతనిమేను దడిపెను.

వాగీంద్రుఁ డంతలో నూఁతకొనక 'మహాదేవరాయా! రమ్ము రమ్ము. నీవిషయ మింకను విచారింపవలసియున్నది. ఇంత

వల కగ్రజునాజ్ఞ తిరస్కరించినందులకుఁ బ్రతీకారముఁ దెల్పితిని. మిగిలినవిషయము విచారింప నించుక వ్యవధి కావలసి యున్న'దనెను. స్తబ్ధుఁడై మహాదేవరాయ లొకప్రక్క నిలువఁబడెను.

వాగీంద్రుఁడు సౌభాగ్యవతినిఁ బిల్చి "అమ్మా! నీవు తండ్రితో వ్యతిరేకించి కారాగారవాసము ననుభవించితివి. కీర్తివర్మ నీ కనురూపవరుఁడని నీతండ్రి నిర్ణయించెను. పితృవధజాతరోషంబున నాతని నవాలోచితముగ వధించితివి. అన్యరాజహత్యాదోషమునకుఁ బ్రతిఫలముగ నిన్ను మహాదేవరాయలఁ బెండ్లాడి పితృరాజ్యముఁ బాలింపు మని యాజ్ఞాపించుచున్నాను. నీ సాహసమునకుఁ బ్రతికృతిగ మహాదేవరాయలు నిన్నుఁ బరిగ్రహించి యాంధ్రసామ్రాజ్యమున నుండియేని వర్ధమానపురరాజ్యము పాలింపవచ్చు నని నే నాజ్ఞాపించుచున్నా"నని సౌభాగ్యవతిహస్తముఁ గొని వాగీంద్రుఁడు మహాదేవరాయలహస్తమునం దుంచి మీ కనుకూలదాంపత్యము దైవము ప్రసాదించుఁగాత మని యాశీర్వదించెను. జయవాదములు మిన్నుముట్టెను.

వాగీంద్రుఁడు మలయవతిని, గోకర్ణుని ధిలకించి మీ రిద్దఱు నేఁటినుండియే శారదాపీఠమున కేగి జైనాచార్యత్వము వహింపవలయును. శతవృద్ధునగు నే నింక నాశ్రమధర్మములు నిర్వహింపఁజాలనని తనహస్తమునఁ గల దీక్షాదామముల రెంటిని దీసి మలయవతిహస్తమున, గోకర్ణునిహస్తమున బంధించి మీ యిరువుర జైనాచార్యత్వము లోకానందదాయకముగఁ

బరిణమించుఁ గాత మని యాశీర్వదించి కార్యక్రమమంత నిర్వహించితి నన్నను.

ఇంతలో సంన్యాసిని తంబురా మీటుచుఁ గల స్వరముతో నిటుల నొక గీతము బాడెను.

రాజదుర్మార్గభారము శాంతినొందె
భారతమాతయభాగ్యంబుఁ దొలఁగె
రుద్రదేవుండు నిర్వ్యాధవిక్రముఁడు
మాతృదేశక్షేమమార్గవిదుండు
యావదాంధ్రతమాధ్యక్షతఁ గాంచె
మంగళ మారాజమార్తాండమణికి—

సౌభాగ్యవతిమనస్సంకోచ మడఁగె
నభిమతవరసిద్ధియయ్యె రాజన్య
మండలమణియైన మహాదేవపతికి
మంగళంబగుఁ గాత మంగళం బగుత—

జైనపీఠమున కాచార్యత్వ మంది
జగదుపకారంబు సలువఁగానున్న
పుణ్యదంపతులకుఁ బూజనీయులకు
మంగళం బగుఁగాత మంగళం బగుత—

శాంతి వాంఛించి యాచార్యత వదలి
సారూప్యమునకయి జతనంబు సల్పు
వాగీంద్రునకుఁ గలావాగీశ్వరునకు
మంగళం బగుఁగాత మంగళం బగుత.

వాగిందుఁ డామంగళగీతముఁ బాడుసంన్యాసినిని సమీపించి "సతీ! నవయౌవనమున ఘోరనియమావృతంబగు నీ సంన్యాసము స్వీకరింపనేల? నీవు బ్రాహ్మణకన్యకవలె నున్నావు. పాలకురికి సోమనాథుఁడను కవి—చక్రవర్తితో వచ్చియున్నాఁడు. ఆయనను బ్రాహ్మణధర్మానుసారము బరిణయము కమ్మని నాప్రార్థనమని" వాకొనెను. సంన్యాసిని హస్తములు మోడ్చి 'ఆర్యులారా! నా జీవితధర్మము నించుక తెలిపి యాజ్ఞ పుచ్చుకొనుచున్నాను. మంజరి యని నన్ను వ్యవహరింతురు. వర్ధమానపురసంస్థాన మహామంత్రిపుత్రికను. భీమరాజు, సవతి తల్లియగు సౌదామినితో దుర్నయముగ వర్తింప గోకర్ణునివలె నేనును దిలకించితిని. గోకర్ణుఁడా యధర్మము సహింపనోపక రాజ్యమును వీడి కందూరున కేగెను. అస్వతంత్రురాల నగు నేను భీమరాజు చేసిన భృగుపాతశిక్షకు లోనై జీవము పోక యీదీక్ష స్వీకరించితిని. వృద్ధులగు నాజననీజనకులు భీమరాజునిర్బంధముచే గతించిరని సైతము నేఁడె వినియున్నాను. నా కీ దైహికములతోఁ బనిలేదు. వసుంధరకు, గోకర్ణునకు భీమరాజువలన రానున్నవిపత్తు తొలగింప •నాంధ్రసామ్రాజ్యమున వసించితిని. నా తపము ఫలించినది. పద్మాక్షీదేవి నాకోర్కెఁ దీర్చినది. నాప్రాణమిత్రురా లగు సౌభాగ్యవతి మహాదేవరాయలఁ జెట్టఁబట్టినది. శారదాపీఠమునకు మలయవతితో గోకర్ణుఁ డేగుచున్నాఁడు. వసుంధర కామితము ఫలించినది. దుర్మార్గత్రయము నశించినది. మహారణ్యములఁ

దపోమహిమ నార్జించుటయే నాకామిత మని యోగిని పలికి సభ్యు లందఱకు నమస్కరించి "ఇఁకముం దీదీనురాలు మీకు మంజరీరూపమునఁగాని సన్యాసినిగఁ గనిపింపదు" అని అని శ్రీశైలమునకుఁ బోయెను. సోమనాథుఁడును, దాను సంన్యాసదీక్ష నిదివఱకె స్వీకరించితిననియు, మహాదేవరాయల నిర్బంధవిముక్తుని జేయువఱకు, నాంధ్రసామ్రాజ్యాధినాథునకుఁ గళ్యాణము జరుగువఱకు, గృహస్థుల ననుసరించి చరించుట తన నియమ మని తెలిపి వాగీంద్రునకు నమస్కరించి సంగమేశ్వరమునకు వెడలిపోయెను.

చక్రవర్తి వాగీంద్రునకు, గోకర్ణునకు, మలయవతికి నమస్కరించెను. సోదరుఁడు సౌభాగ్యవతియు, నటులె యొనర్చిరి. కళ్యాణముల నాంధ్రసామ్రాజ్యమున జరుపనెంచి సోదరునితో, సౌభాగ్యవతితో రుద్రదేవుఁడు వసుంధరాద్వితీయుఁడై నాఁటిరాత్రియండి పోవ సంకల్పించెను. వాగీంద్రచూడామణి, మలయవతి, గోకర్ణుఁడు పరిణయములు దర్శింప సంకల్పించి యాంధ్రసామ్రాజ్యమున కేగ నిశ్చయించిరి. రుద్రసేనానిని కందూరు వర్ధమానపుర రాజ్యములు రెంటిని బరిణయమ్ము లగువఱకు శాంతముగఁ బరిపాలింప నాజ్ఞాపించి వివాహప్రయత్నములు సామ్రాజ్యమునఁ జేయింపుఁ డని తెలుపఁ గొందఱి భటులఁ జక్రవర్తి హనుమకొండ కారాత్రియుండియే పంపెను.

కొన్ని దినములకు గోకర్ణుఁడు, మలయవతి, వాగీంద్రుఁడు సౌభాగ్యవతి, మహాదేవరాయలు, చక్రవర్తి, వసుంధర

యాంధ్రసామ్రాజ్యమునకుఁ జేరిరి. వాగీంద్రనిర్దిష్టమగు శుభముహూర్తమున మహాదేవరాయలు సౌభాగ్యవతిని, జక్రవర్తి వసుంధరను బరిణయమయ్యెను. ఆంధ్రసామ్రాజ్యమున నందఱు కొలఁదికాలముమాత్రము వసించిరి. వాగీంద్రుఁడు గోకర్ణునితో, మలయవతితో శారదాపీఠమునకును, మహాదేవరాయలు సౌభాగ్యవతితో వర్ధమానపురరాజ్యమునకును బయనమైరి.

రుద్రసేనాని చూపిన స్వామిభక్తికి రుద్రదేవుఁడు మిగుల నానందించి 'నీ కామితము సమకూర్తును. కోరి కొమ్మని నిర్బంధించెను. రుద్రసేనాని రాజనిర్బంధమున నిట్లు విన్నవించెను. "ఆంధ్రుల శిల్పకళకు లక్ష్యముగ నేనొక దేవాలయమును పాలెముపట్టుచెంతఁ గట్టింప సంకల్పించితిని, దానికి సామ్రాజ్యము తోడ్పడినఁ జాలును." రుద్రదేవుఁడు పరితోషముతో నంగీకరించి రుద్రసేనానిజీవితములో నీ యాలయమునకు వలయుధనము ఆంధ్రసామ్రాజ్యపాలకు లొసంగునటుల దానపత్రము వ్రాసియిచ్చెను.



# పరిశిష్టము.

రుద్రదేవుని జనకుఁడగు ప్రోలరాజుజీవితము కొంత వఱకు విన్నవించియున్నారము. ప్రోలరాజు కాలమరణము నొందునప్పటికి రుద్రదేవునకుఁ బదిసంవత్సరములుకంటె నెక్కుడు వయస్సుండదు. సేనానాయకులలోఁ బెద్దవాఁడగు రుద్రసేనాని రుద్రదేవుని, దదనుజుఁడగు మహాదేవరాయలను బ్రేమతోఁ దిలకించుచు రాజ్యమును విచ్ఛిన్నము కాకుండఁ గాపాడెను. బుద్ధిశాలియుఁ దేజోధనుండు నగు రుద్రదేవుఁడు బాలుఁ డగుటచే సామంతులలోఁ గొందఱు లక్ష్యము సేయక కప్పములఁ జెల్లింపమానివేసిరి. అట్టివారిలోఁ గందూరు, వర్ధమానపురము, పొలవాస పరిపాలకులు ముఖ్యులు.

రుద్రసేనాని యను పద్మనాయకవీరుఁడు కందూరుపైకి దాడివెడలునప్పటికి రుద్రదేవుఁడు, మహాదేవరాయలు బాలకు లగుటచే నాసంగ్రామమున జోక్యమును గలిగించు కొనఁజాలరైరి.

భీమరాజు కందూరురాజ్యపాలకుఁ డగు తైలపదేవుని వధించి యారాజ్యమును హరించినవిషయము గోకర్ణుఁడు వ్యతిరేకించి కందూరురాజ్యపునరుద్ధరణమునకుఁ బ్రయత్నము చేయు విషయము రుద్రదేవుఁడు విని సత్స్వభావుఁడగు గోకర్ణుఁడు శాంతి కాపాడఁగలఁ డని చాలకాలము మిన్నకుండెను.

రుద్రదేవునకు యుక్తవయస్సు వచ్చునప్పటికిఁ గందూరు రాజ్యము భీమరాజుయాజమాన్యమునందే యుండెను. రాను రాను భీమరాజుదురంతములు మితిమీఱెను. గోకర్ణుని ధర్మశీలము నిరుపయోగకరము గాఁదొడఁగుటచేఁ గడకు విధిలేక కొన్నిసంవత్సరములకు మహాదేవరాయలను సైన్యముతో వర్ధమానపురమునకు రుద్రదేవచక్రవర్తి పంపించెను. చిరకాలము మహాదేవరాయలు నిర్బంధితుఁ డయ్యెను.

కందూరురాజ్యపునరుద్ధరణము మహాదేవరాయబంధవిముక్తి లక్ష్యమునం దుంచుకొని చిరకాలమునకు రుద్రదేవచక్రవర్తి సంగ్రామమునకు వెడలునప్పటికిఁ దైలపరాజపుత్రి భీమరాజుదురంతములచేఁ గృశించుచుండెను. యుక్తవయస్కురాలును రూపవతియు నగు నాయమను రుద్రదేవుఁడు పరిగ్రహించి కృతార్థుఁడై సోదరునిబంధము తొలంగించి సౌభాగ్యవతి నొసంగి పరిణయముఁ గావించెను. లోకక్షేమము నెంచి వాగీంద్రుఁ డీ పరిణయముల సమకూర్చెను.

రుద్రదేవుఁడు క్రమముగ నాంధ్రదేశము నంతయుఁ దనహస్తగతముఁ గావించుకొని హనుమకొండలో నొక గొప్ప శివాలయమును, సహస్రస్తంభమండపమును గట్టించి యాలయద్వారముచెంత నొక శాసనము స్థాపించి యందుఁ దన విజయముల నన్నింటినిఁ జేర్కొనెను.

యుక్తాయుక్తవివేచనశూన్యుఁడై సవతితల్లియగు సౌదామినితోఁ బశుధర్మముగ వర్తించిన భీమరాజు దుశ్చరి

త్రము నంతయుఁ, దేటతెల్లముగ భూలోకమున శాశ్వతముగ నుంటకై, రుద్రదేవుఁ డీ క్రిందివిధముగా శాసనమున వ్రాయించెను.

"యాతేఽపి తైలనృపతౌ దివ మస్య భీత్యా
సర్వాతిసారకబళీకృతగాత్రయష్టౌ
శ్రీరుద్రదేవనృపతేః పృథువిక్రమస్య
భీమోఽపి రాజ్యపదవీం క్షణికాం న లేభే॥

తద్వద్భీమనృపాధమో నరపశు ర్మాతు స్సపత్నీపతిః
హన్తా భ్రాతృవరస్య భోజనవిధౌ భీమేన సంస్పర్ధతే."

హనుమకొండ కేగు నాంధ్రసోదరులు నేఁటి కీవిధముగ భీమరాజకళంకచరిత్రమును బఠించుచున్నారు. ఇంతియే కాక కందూరురాజపుత్రిక యగు వసుంధరను రుద్రదేవ చక్రవర్తి పరిణయమైనవిషయ మాశాసనముననే కలదు.

"కందూరూదయచోడవంశవిలసత్ క్షీరాబ్ధిగర్భోద్భవ
త్పద్మైకాశ్రయవీరరుద్రనృపతేః కిం వర్ణ్యతే విక్రమః"

మన కథానాయికయగు వసుంధరాదేవి కందూరు పరిపాలించు చోడరాజన్యులవంశసముద్రమునకు లక్ష్మివంటి దనియు, నాలక్ష్మి తన నాశ్రయించె ననియు శ్రీరుద్రదేవ చక్రవర్తి స్వయముగాఁ జెప్పియున్నాఁడు.

పవిత్రమగు నీ కథాంశమంతయుఁ గాకతీయసామ్రాజ్యమునకు సంబంధించినది. శాలివాహనగర్భితమై కాకతీయసామ్రాజ్యము నలరించినను, ఆకథాపాత్రములకు పాల

కవి కర్త సోమనాథుఁడు, రుద్రదేవచక్రవర్తి, వాగీంద్రచూడామణి, గోకర్ణుఁడు నేఁటికిని జరిత్రప్రపంచమున సజీవులై యున్నారు.

అపకీర్తినరకమునఁ బడి చిరయాతనల ననుభవించు భీమరాజు సౌదామినుల వికృతస్వరూపములు నేఁటికిని వర్ధమానపురనివాసులకుఁ బ్రత్యక్షము లగుచున్నవి. వాఙ్మయ మున్నంతవఱకు రుద్రదేవుఁడు లిఖించిన భీమరాజు దుశ్చరిత్రము శాశ్వతముగ నిలువగలదు.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.

